శ్రీ.

# శతకంఠరామాయణము

అను

# సీతా విజయము

మర్ధనకవి విరచితము.

ఇది

శ్రీమాలేపల్లి రామచంద్రశాస్త్రిగారిచే

లేఖకప్రమాదజనితదోషంబులు లేకుండునట్లు సవరింపంబడి

విన్నకోట అప్పలనరసింహులుగారిచే

స్వకీయ శ్రీశారదామకుటముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రకటింపంబడియె.



Printed by A. Venkatareddi. at the S. S. M. press.

VIZAGAPATAM.
February—1899.

# శతకంఠ రామాయణము

అను

# సీతా విజయము

మర్దన కవి విరచితము.

ఇది

శ్రీమాకేపల్లి రామచంద్ర శాస్త్రిగారిచే

లేఖక ప్రమాదజనితదోషంబులు లేకుండునట్లు సవరింపఁబడి

విన్నకోట అప్పలనరసింహులుగారిచే

స్వకీయ శ్రీ శారదా మకుటముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రకటింపఁబడియె.



Printed by A. Venkatareddi, at the S. S. M. press.

VIZAGAPATAM.
February—1899.

# పీఠిక.

శతకంఠరామాయణమను పేర వాడఁబడు సీతావిజయమను ప్రబంధ మింతకుఁబూర్వమే ప్రసిద్ధినొంది యున్నది. ఆకావ్యరత్నమింతదనుక నేకారణముచేతనో కాని ముద్రితముగాక యుండుటచే దానిని ముద్రింపఁదలఁచి నాస్నేహితులగు మ. రా. రా. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారియొద్ద నొకప్రతియును, మ. రా. రా. నిడదవోలు సుందరముపంతులుగారి లైబ్రిరీలో నొకప్రతియునుండఁగా నవిపుచ్చుకొని వానిననుసరించి సాధ్యమగునంతవఱకు దోషములులేకుండ సవరించి యాసవరణఁ జేయఁబడిన స్థలములయం “ ” దీగురుతులనుంచి ముద్రింపించితిని. కాని రెండుప్రతులయందును కృత్యాదిపద్యములు లేవయ్యె. పిమ్మట మఱియొకప్రతి లభించినది- గాని దానివలనను నాకోరిక దీరదయ్యె. అట్లగుటచే నిప్పటికున్నదానితో సంతృప్తిఁ బొందవలసివచ్చినది. ముందు దొరకినయెడల రెండవకూర్పున నీలోపము పూర్తి చేసికొనయత్నించెదను. మహారాజశ్రీ రాయబహదూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు వ్రాసిన కవులచరిత్రలో నీప్రబంధ మిరువురుకవులు రచించినట్లు వ్రాసియున్నారు. కానిమాకు దొరకిన గద్యలుగల రెండుప్రతులలో నొకదానియందిది మర్దనకవివిరచితముగాను రెండవదానియందు లింగనకవిప్రణీతముగాను గానవచ్చుచున్నది. అయినను నేనారంభించినప్రతి మర్దనకవి విరచితముగానున్నదియగుటచేతను, లింగనకవికృతముగానున్నది యొకటిరెండాశ్వాసములు ముగిసినపిమ్మట లభించియుండుటచేతను నాశ్వాసాంతముల మర్దనకవిప్రణీతముగానే ముద్రింపవలసివచ్చినది. ఇంతకుఁ గృత్యాదిపద్యములు దొరకునంతవఱకుఁ గవినిర్ణయము చేయవలనుపడకయున్నది. దొరకినప్రతులు శుద్ధప్రతులు కాకపోవుటచేతను, మొదటికూర్పగుటచేతను నెంతకష్టపడి పరిశీలించినను గొన్నిలోపములుండకమానవు. పండితోత్తములు వానినిమన్నించి దీనినాదరింతురని కోరుచున్నాను.

విశాఖపట్టణము.
189[illegible] సం॥ ఫిబ్రవరి.

ఇట్లు
చిన్నకోట అప్పలనరసింహులు.

శ్రీరస్తు.



# సీతావిజయము

## ప్రథమాశ్వాసము.

ఉ॥ భాసురలీలశంభుఁడు కృపారసముప్పతిలంగఁ జూర్కై। లాస
మునందుఁ బార్వతికి రాముకథల్ వివరింప,నందుచే। వాసిగ సంతసిల్లి,
నిజవల్లభుపైఁ దనచూడ్కి నిల్పి, యో। దాసజనావనాత్మక! సదాశివ!
యింకొకటానతియ్యవే॥ ౨॥

మ॥ శతకంఠుండను ఘోరదైత్యుఁడు రఘుస్వామిన్ రణంబందునే।
గతిమైఁ దల్లడిలంగఁ జేసె? నటుఁ దత్కాంతాలలామంబె యు। ద్ధతితోఁ
దాఁకె పెనంగె నెట్లు? మఱి తత్కాండప్రచండక్రియన్। మృతుఁడై యే
విధిఁ గూలెనాతఁ డిది పేర్మిం దెల్పుమా వేడెదన్॥ ౩॥

గీ॥ ఎవ్వఁ డా రామచంద్రుని నిచ్చఁ దలఁచు। నెవ్వఁ డా సీతమహిమం
బులెఱుఁగఁ గోరు। నాయురారోగ్యములు వానికతిశయిల్లుఁ। దాండవం
బాడు లక్ష్మి యాతని గృహమున॥ ౪॥

వ॥ అనినవిని సర్వజ్ఞుండగు మహాదేవుండు సమ్మతించి పులస్త్యప్ర
కారంబును, తత్సుతుల విశ్రవసాశ్రముల విధంబును, రావణకుంభకర్ణ
విభీషణాదుల జననంబును, అన్నకొడుకులం బూచి యశ్రముండు వగచు
టయు, తపంబు సేయుటయు, తత్ప్రభావంబున నూఱుశిరంబులు నిన్నూ
ఱుకరంబులుం గల మహాదానవుం గనుటయు, నతండు రాముని చేఁ దెగి
న రావణాద్యఖిల దనుజప్రళయంబును వినుటయు, నప్పగ యూఁగఁ
గోరుటయు, తపంబు సేయుటయు, నజుండు పొడచూపుటయు, నతని

వలన దుర్లభంబులగు వరంబులుగొనుటయు, మునులబాధించుటయు, నమ్మునులు రామచంద్రుని పాలికిం జని శరణు చొచ్చుటయు, వారికి నభయహస్తంబులిచ్చుటయు, శతకంఠునింజంపఁబ్రతిజ్ఞ సేయుటయు, మునులఁబంపుటయు, వెనుక నమ్మహాశదనుజునివిక్రమంబుదలఁచి బలసామగ్రి చాలదని వగచుటయు, లక్ష్మణుండు తమతమపరాక్రమంబులు దెలుపుటయు, విభీషణుని రాఁదలఁచుటయు, నతనివలనఁగొన్నివివరంబులెఱుంగుటయు, హనుమంతునఁదలంచుటయు, నతనికిఁదద్వృత్తాంతంబు సెప్పుటయు, నకపికులోత్తముండు తన మహారూపంబు సూపుటయు, సకలమనుజదనుజవనచరబలంబుల రప్పించుటయు, తన్నుంగొని చనుమని సీత వేడుటయు, రాఘవుండనుమతించుటయు, దండు వెడలుటయు, నందఱనొక్క పెట్టున హనుమంతుండు తనశరీరంబునందాల్చుటయు, దేవతలు సన్నుతించి పుష్పవర్షంబు గురియించుటయు, నందులకు మిగులనుత్సహించి పవనజుండు తనవాలంబున నఖిలదళంబుల సముద్రంబులు దాఁటించుటయు, లగ్గపట్టుటయు, హనుమద్రాయభారంబును, చిత్రగంధినీతియు, ద్వంద్వయుద్ధప్రకారంబును, సకలబలప్రళయంబును, రాముండును శతముఖుండునుందలపడి ఘోర యుద్ధంబు సలుపుటయు, నందులకు రాఘవుండు కళవళించుటయు, సీతవిల్లందుటయు, దనుజబలసంహారణంబును, శతకంధరు పరాభవంబును, మఱునాఁడరుదెంచుటయు, నారదాగమనంబును, హితోపదేశంబును, బ్రహ్మాస్త్రప్రయోగంబును, శతముఖమరణంబును, చిత్రగంధివిలాపంబును, లీలకేతను పట్టాభిషేకంబును, హనుమంతుండు మరల జలధులు దాఁటించుటయు, పురంబుచేరుటయు, రాజ్యంబుపాలించుటయు మొదలుగా నంతయుఁదలపోసి మందస్మిత ముఖారవిందుండై యిందుశేఖరుండు పార్వతీదేవికిట్లనియె॥ ౫॥

కం॥ రావణుఁ,డురుసంగరవి। ద్రావణుఁ, డాభీలబాహుదండజి
తోర్వి। రావణుఁడు, సేయునురుదు। ర్భావపరాభవము లాత్మభా
వించిసురల్॥ ౬॥

గీ॥ క్షీరవారాశికడ కేగి, శ్రీరమాధి। నాథుఁ బొడగని, కదిసి వందనములొసఁగి। తమపరాభవ మెఱిగింపఁ, గమలనాభుఁ। డభయకరమిడి పనిచెఁ, గొన్నబ్దములకు॥ ౭॥

గీ॥ దేవతల బ్రోవ నాత్మఁ జింతించి, పంక్తి। రథ మహాగర్భ దుగ్ధాంబురాశియందు। నొనరసత్సంతతికి మోదమొదవ, రామ। చంద్రుఁ డుదయించెఁ బూర్ణిమాచంద్రుపగిది॥ ౮॥

వ॥ ఇట్లుదయించి॥ ౯॥

సీ॥ ధరణీధరాటకఁ దాటకఁబడనేసి, జన్నంబుబన్నంబు చక్కఁజేసి,। ఖ్యాతిగారాతిని నాతిగాఁగావించి, భవునిచాపంబు రూపంబుమాపి,। సీతను భాగ్యసమేతను బెండ్లాడి, కైకవాక్యమున నైక్యంబునొంది,। గుహుని సద్ధర్మహృద్గుహునిసంభావించి, రాష్ట్రపరాధువిరాధుఁగొట్టి,।ఘనులమునులనుమన్నించి, 'ఖరులగుఖర'। దూషణులభీషణాంబకాదులనుగూల్చి,। యొకటరక్కసి వెకటసై సొక్కుదాని। ముక్కుచెవుల కుఁగలనిక్కు చక్కఁజేసి॥ ౧౦॥

శా॥ మారీచుంబడనేసి, వాయుజుని సన్మానించి, కిష్కింధకున్। నీరేజాప్తజురాజుఁ జేసి, యలకంధింబూనిబంధించి, బల్।నారాచంబులఁబంక్తికంఠఘటకర్ణశ్రేణిహింసించి, లం। కారాజ్యంబున నవ్విభీషణుని భాగ్యప్రాప్తుగా నిల్పుచున్॥ ౧౧॥

ఉ॥ వారిధి వానరాళిగొలువంగ మగ్రమ్మఱ దాఁటి, సీతయుం,। దారును, లక్ష్మణుండు, నవధానవిమానము లెక్కి, వేల్పులున్।భోరునఁబుష్పముల్ గురియఁబొంగుచు, వైరివిదారధీరగం। భీరమనస్కులై చనిరి పెల్లుగఁ బల్లులఁ జూచు వేడుకన్॥ ౧౨॥

వ॥ఇట్లు చనిచని నిరంతరకుసుమఫలభరితతరునిచయారామంబులును, విమలకమలకల్హారషండమండిత జలాశయంబులును, అభేద్యపరిఖాప్రాకారద్వార కవాటమణితోరణవిరాజితసౌధాగ్రబంధబంధురశాతకుంభ సముదయంబులును, హాటకవినిర్మిత నూత్నరత్నదీప్తి ధగద్ధగాయమానరాజప్రాసాదప్రాంగణరంగసంగత కనకమంటపావరణవిచిత్ర

కుడ్యగవాక్షంబులును, వీరకుమారసుందరమందిరపశ్చిమభాగసంస్థితకేళికాకుధరనిత్యనివాస కీరమయూరశారికా పికప్రకట కోలాహలంబులును, అనవరతమదజలపంక సంకర గండమండల శుండాలజాలంబులును, జవవిజిత పవనమనోవేగరంగత్తుంగతురంగంబులును, అవక్రమణిచక్రగణిత ఘంటికాఘణఘణారవాభ్రంకష ధ్వజ సకలసాధనాయుత రథనిచయంబులును, సంగరాభంగ వీరాలాపప్రతాపభటకదంబంబులును, రంభాసంభోగారంభవిజృంభమాణవిభవగంభీరవారవనితాసంఘంబులును, సమస్తరాగోపరాగ తానమానావధాన మంగళపాఠక మహితంబులును, అభ్రంకషగోపురప్రాకారచతుర్ద్వారపవనతరళితవృషభకేతన నానాధూపధూమ ఘుమఘుమాయమాన వాసనావాసిత దేవాలయంబులును, భేరీమృదంగశంఖకాహళపణవఢక్కాముఖానేకవాద్యఘోషంబులును, ప్రజ్ఞావిశేషనిర్జిత శేషభాషాధీశులగు విప్రవర్గంబులును, సమరపరశుచ్ఛేదితోరస్థలనిమ్నక్షతభూషణభూషితక్షత్రియకుమారవారంబులును, ధనకనకవస్తువాహనప్రవర్ధమానవ్యావహారహసిత ధనదాదులగు వర్తకులును, అక్షుద్రభద్రతరశాశ్వతైశ్వర్యతిరస్కృతసముద్రులగు శూద్రులును గలుగు సాకేతనగరంబుప్రవేశించి, అనర్గళ సంభ్రమాయత్తచిత్తుండై రఘువరుండు మఱుఁవనోకఁశుభముహూర్తంబున ననుజపరివృతుండై మునిజన పురోహితామాత్యజననీత్రయానుమతంబున జానకీసమేతుండై॥ ౧౩॥

కం॥ పట్టాభిషిక్తుఁడయ్యెను। నెట్టనభువనములఁగలుగు నృపతులు మెచ్చన్।భాట్టప్రభాకరశా। స్త్రోట్టంకితులైనసుకవులానరనుతింపన్॥

గీ॥ ఇట్లుపట్టాభిషిక్తుఁడై యేపుమెఱసి। దనుజవిదళన బిరుద పద్యములువినుచు। నెల్లజనములుముదమొందనేలుచుండెఁ। దల్లి,దండ్రియు, దైవంబుఁ,దానెయనఁగ॥ ౧౪॥

సీ॥ ధర్మంబునాల్గుపాదంబులఁదిర్గిల్లు, వాఁఛించినప్పుడేవానగురియుఁ,। దరువులేవేళనుద్ధతిమీఱ ఫలియించుఁ, పైరులుదున్నకపండుచుండుఁ,।దిరిపెంబువిరసమేదిక్కునఁనొదవదు, మొదవులుపిదుకకముఁన్నెపిదు

కు,। వ్యాధులునఘములువలసలై దూరించుఁజింతింపఁగోరుకొలుసిద్ధినొందు,। రాజపరమేశ్వరుఁడు, దైత్యరాజహరుఁడు,। రాజసింహుండు, దశరథరాజసుతుఁడు,। రాజసదృశకళాంగుఁడు, రాఘవుండు,। ఘనతరాజ్యంబుఁబాలించు కాలమునను॥ ౧౬॥

గీ॥ గట్టిధాన్యంబు పోకకుఁ బుట్టెడేసి। అట్టిపోకలు రూకకునని కెడేసి। అట్టిరూకలు మాడకు నలువదేసి। అట్టిమాడలు నింటింట నగణితములు॥ ౧౭॥

క॥ మేఘశ్యామలదేహుఁడు। రాఘవుఁడీరీతి,భూసురస్ఫుటభాషా। మోఘాశీర్వాదమహా। శ్లాఘామతి నేలుచుండుసమయమునందున్॥ ౧౮॥

చ॥ శతముఖనామధేయుఁడొ,కచండనిశాచరలోకనాథుఁడుఁ।క్రతనలపంక్తికంఠఘటకర్ణపురందరజిత్ప్రహస్తులీ। క్షితిఁబడుటంతయున్ హితులచేవిని, రామునిమీఁద నాడటన్। ఘృతయుతపావకాకృతిని గెంటకమందుచు,హుంకరింపుచున్॥ ౧౯॥

గీ॥ మెఱసి బ్రహ్మాండమెల్లను గ్రుంగనట్టి। హాసమొనరించి, వక్త్రగహ్వరముఁదెఱచెఁ,। దెఱవనుఱువడినర్కుండు తెరువుదప్పి। 'మార్తుఁడనఁబోక' మేఘునిమఱుఁగుఁజొచ్చె॥ ౨౦॥

ఉ॥ అగ్గలమయ్యె మ్రోఁత జగదంతరమందునఁ దద్భయంబుచే,। దిగ్గజపంక్తి దెల్లె, మఱితేఁకువలేక సమస్తజీవముల్। గ్రగ్గెఁ, బయోనిధుల్ గలఁగె, బ్రాన్పడె నబ్జభవుండు,నాసుధా। భుగ్గణమెల్లభీతిలిరి ఘోరున రామజయంబు గోరుచున్॥ ౨౧॥

వ॥ మఱియు నయోధ్యాదిపట్టణంబుల మహోత్పాతంబు లుద్భవించెఁ; శతముఖుండును డెందంబున నందంద విచారించి రాముండను నొకఁడు నరునిమాత్రంబునకు సకలలోకంబులుపరిమార్ప నేల?వానికిఁగో బ్రాహ్మణదేవతాదులు ప్రియంబులనివిందు నటుగానఁదత్ప్రహారణంబులు గావించెద; రాముండును వాఁడందులకు నడ్డపడవచ్చెనేని పగదీర్చుకొనెదఁగాక యని॥ ౨౨॥

గీ॥ మఱినిఁబోదలుచు ఋష్యాశ్రమములుసొచ్చి। డాసి మఱియును

హోమగుండములు పూడ్చి। యాగధేనువులను ద్రుంచి, పూగముఖ్య। భూజములుద్రోసి, కాసారములుగలంచి॥ ౨౩॥

క॥ మునిసతులఁజెఱలుగొని, యా। మునివరులను దునుమఁజిత్తము నరోసి,తుదిన్। వనలతల మునులకరములు। ఘనముగ బంధించు వికృత కఠినముఖుండై॥ ౨౪॥

క॥ నెపమేమియు లేకయే, తన। రపమైతముబాధపఱప, గాత్రసు మీఁదం। గుపితాత్ములయ్యుఁ,దపసులు। శపియింపఁగఁజాలరైరిజలజజుమహిమన్॥ ౨౫॥

సీ॥ ఒకమునివరుఁబట్టి యూర్ధ్వపుండ్రము నాకు, నొకవిప్రు జన్నిద మొడిసి తెంచు,। నొకమౌని పైఁ జల్లు నుర్వీపరాగంబు, నొక్క తాపసు నోరునొక్కి మూయు,। నొకమునీశ్వరుపిల్లసిక పెల్లగిలఁదీయు, నొక్క యోగీంద్రుని ముక్కుఁజదుము,। నొకమహీసురుమీఁద నుమియును మత్తుచే,నొక్క దిగంబరు నాలయఁదన్ను,। నొకతపోధనుఁడే తెంచి,వికలమతిని। పెక్కుమాఱులు శతముఖు పేరునొడివి,। పాహి పాహి యనుచు సాగఁబడిన,నతని। కాలుగొని యీడ్చుఁదుదఁదానె కాలుపగిది॥ ౨౬॥

సీ॥ దిక్కుంభికుంభముల్ వ్రక్కలుగావించు నుక్కునఁ జెలరేఁగి యొక్కనాఁడు,। తనబాహుకండూతి దప్పఁ గులాద్రులనుంకించి పెకలించు నొక్కనాఁడు,। తపియింపఁజేసె నాతపమునననని భానునొడయఁగా నూహించు నొక్కనాఁడు,। పొలయరాదని పూని మలయమారుతమును నుప్పున నెగనూఁదు నొక్కనాఁడు,। ఉరగులను బట్టి దండించు నొక్కనాఁడు,। ఉగ్రుఁడై నిర్జరులఁద్రోలు నొక్కనాఁడు,। ఉదరి మానవులను మ్రింగు నొక్కనాఁడు। ఉబ్బి లోకంబు గాలించు నొక్కనాఁడు॥ ౨౭॥

క॥ ఈవిధిని లోక 'పీడలు'। గావించినఁ, జిత్తములను గళవళపడి, యా। దేవతలు, మునులు, ధరణీ। దేవతలును గూడి, జాలిఁబడి యొకచోటన్॥ ౨౮॥

క॥ ఎవ్వఁడు మనలకు దిక్కఁ, క। నెవ్వండీబాధ మాన్పు, నిల యెవ్వనిచే। నివ్వికృతుఁడీల్గు నెవ్వని। మవ్వపుఁగరుణారసమున మనులోకంబుల్॥ ౨౯॥

వ॥ అనుచు దుశ్చింతాసముద్రంబున మునింగి యపరిమితడోలాందో
ళితమానసులై క్రమ్మఱ ధైర్యంబులు పురికొల్పుకొని సురలు మునివరుల
కిట్లనిరి॥ ౩౦॥

క॥ మునుమనకొఱకై, దానవ। హననమునకు, విష్ణుఁడవనినలరి, దశ
స్యం। దనునకుఁబుట్టి, రఘూద్వహుఁ। డన, నిపుడున్నాఁడుగాదె యధికు
లెఱుంగన్॥ ౩౧॥

గీ॥ అట్టి రాఘవుఁడ,ధిక రాజాధిరాజ। చారుకోటీర మాణిక్యచాక
చక్య। సారమండితసత్పదాంభోరుహద్వ। యుండె, మనకిఁక దిక్కుగా
కొ,ండుగలఁడె?॥ ౩౨॥

మ॥ దశదిగ్భాగములం బ్రతాపమహిమల్ దట్టంబుగా నిండ, న। ద్ద
శకంఠస్ఫుటకంఠపంక్తి సమరోద్దండాగ్రహాభీలక। ర్కశభల్లంబులసం
హరించిమనలం గాపాడఁడే? యట్టిపీ। రశిరోత్తంసమె దిక్కు, దీనికి వి
చారంబేల యూహింపఁగన్॥ ౩౩॥

సీ॥ తనభక్తుఁడొంటిఁబోఁ దలఁప, దమ్ముఁడు, దాను, దోడయ్యె రా
మచంద్రుండుగాఁడె?। కులహీనుఁడనక, మక్కువమీఱ నొకకిరాతుని బ్రో
చె రామచంద్రుండుగాఁడె?। మర్కటుండనక, నయ్యర్కజుఁబట్టభద్రునిఁ
జేసె రామచంద్రుండుగాఁడె?। తనశత్రువనక, నా దైత్యుతమ్మునిఁగాచె
రూఢిగా రామచంద్రుండుగాఁడె?। యట్టికరుణాపయోనిధిక, ట్టిసుకృతి।
క్తె,లమి మీఱంగ మనలను నేలుటెంత?। తడయకచ్చోటికేగుఁడీ తపసులా
ర!। జాగుసేయంగ నేటికి? సభ్యులార!॥ ౩౪॥

వ॥ ఏమునుదివినుండి పొడచూపెదమని చెప్పి సురలు నాకంబున కరి
గిరంత॥ ౩౫॥

శా॥ శాండిల్యుండును, జహ్నుమౌనివరుఁడున్, జాబాలియుం, గౌ
త్సుఁడుం,। గౌండిన్యుండును, గాలవుండును, మహాకణ్వుండును, మైత్రే
యుఁడున్,। మాండవ్యుండును, మందపాలుఁడును, సన్మార్గప్రభావుండు
మా। ర్కండేయుండును, గూడివచ్చిరతిశీఘ్రంబొప్ప రాముంగనన్॥ ౩౬॥

వ॥ ఇట్లు రయంబున వచ్చివచ్చి॥ ౩౭॥

క॥ ఆతురముఁగాంచిరిసా। కేతము, వరనృపతిజనని కేతనము,తి
వి। ఖ్యాతము,నీప్సితవస్తు। వ్రాతము,నసమాన వైభవసమేతంబున్॥ ౩౮॥

ఉ॥ కాంచి,తదీయదివ్యపరిఖావిశదత్వముఁ,గోటవాటముం,। గాం
చనగేహపంక్తి యును, గంధగజాశ్వరథోష్ట్రవారమున్,। మించిన వే
డ్కఁజూచుచును మెల్లన వీడ్కొని, తత్పురీంద్రమ। ధ్యాంచితసీమ,నొ
కర్కకనకాయతసౌధముగాంచి మెచ్చుచున్॥ ౩౯॥

క॥ ఆమందిరమధ్యంబునఁ,। గోమలచకచకలఁదనరు గురుమణిగణ
శో। భామయమగు సింహాసన। మూ,మునిపుంగవులు గాంచి, యతిహ
ర్షమునన్॥ ౪౦॥

సీ॥ కలితపుణ్యచరిత్రుఁ, గంజాతనిభనేత్రు,జలధరదేహు,నాజా
నుబాహుఁ,। గరుణాకటాక్షు, శృంగారసుందరవక్షు,సత్యసంశీలు,వి
శాలఫాలు,। స్మితముఖాంభోజు,నాశ్రితజనసురభూజు, హారకేయూ
రు, వికారదూరు,। రవికోటిసంకాశు, రాక్షసేంద్రవినాశు,భువనప్ర
శస్తు, నద్భుతగృహస్థు,। సమరతలభీము,బుధజనకుముదసోము,। విను
తసుత్రాముఁ, త్రైలోక్యవిమలనామ,। జానకీరాము, నృపకులసార్వ
భౌముఁ,। గనిరి మౌనులు కన్నులకలవుదీఱ॥ ౪౧॥

సీ॥ వీఁడఁటేకృపమీఱ వేల్పులకొఱకునీమహిమీఁదఁబుట్టిన మాయ
లాఁడు;। వీఁడఁటే దశరథోర్వీనాయకునిఁ దనసుద్దుల నుబ్బించు ముద్దు
లాఁడు;। వీఁడఁటేపిన్ననాఁడేడాసివెక్కసిరక్కసిఁ ద్రుంచిన మొక్క
లీఁడు;। వీఁడఁటే గాధేయు విమలతరాటోపయజ్ఞంబురక్షించు యజ్ఞ
భోక్త;। వీఁడఁటేశౌర్యములకెల్లవీడుపట్టు;। వీఁడఁటేధర్మములకెల్లఁదో
డఁబుట్టు;। వీఁడెసాక్షాత్కరించిన విష్ణుమూర్తి;। వీనిఁగనుకంటె శుభ
ములువేఱుకలవె?॥ ౪౨॥

వ॥ అనిమునీంద్రులుసాంద్రప్రమోదరసపరిపూర్ణ హృదయులై
వివిధాశీర్వాదమంత్రాక్షతవిన్యస్తప్రశస్తహస్తంబులెత్తి, భక్తితోఁగ
దిసి,యిట్లనిరి॥ ౪౩॥

సీ॥ శ్రీరస్తు ధరణిజాశ్లిష్టభుజాదండ! భండనోద్దండ! కృపాప్రచం

ఉ॥ విజయోస్తు త్రిభువనవిఖ్యాతచారిత్ర! విశదాబ్జనేత్ర! పవిత్రగాత్ర!। దీర్ఘాయురస్తు భూదేవతామందార! కలుషసంహార! భాగ్యప్రచార!। ఆరోగ్యమస్తు శతార్కతేజోరూప! గురుజయాటోప! సద్గుణకలాప!। అనుచునాశీర్వదించి మంత్రాక్షతపవిత్రసూనశుభలాజముఖ్యవస్తువులొసంగి। భయము, బియమును, జయమును, రయము, నయముం, బెనఁగొనఁగనిల్చిరా రాముఁబేర్మిఁగనుచు॥ ౪౪॥

వ॥ రాఘవేశ్వరుండును, బత్యుత్థానాభివందనములందఱకును వేఱువేఱ నాచరించి, అర్ఘ్యపాద్యాదివిధులంబూజించి, ఉచితపీఠంబులనుండనియమించి, మందస్మిత ముఖారవిందుండై యానంద మందంప సందడింపనందంబుగా మెల్లన మునివరులకిట్లనియె॥ ౪౫॥

శా॥ అయ్యా! మావిభవంబులెల్ల, భవదుద్యద్పూతపాదాంబుజా। త్యయ్యాలోకనచింతనంబునఁగదా జానొప్పనీ డేఱు, మీ। రెయ్యేతావుల కేగుదెంతు, రెటమీరీక్షింతురింపొందగా, ।నయ్యాతావులువృద్ధిబొందిను నుటే మాశ్చర్యమూహింపఁగన్॥ ౪౬॥

శా॥ సేమంబేకదమీకు? మీపరిజనుల్ శిష్యుల్ విడంబింతురే?। నేమంబొప్పఁగ ధేనువుల్ పితుకునే నిత్యోత్సవక్రీడలన్?। వేమాఱున్ ఫలియించునే తరువులుర్విన్? సత్తపోధర్మముల్। ప్రేమన్ వర్ధిలునే? నిరంతరమఖాభీష్టంబులీడేఱునే?॥ ౪౭॥

శా॥ దైన్యంబేమియులేక, మీకరుణనిర్ధాత్రీతలంబెల్లహ్నా। ద్వాన్యాసంబున నేలఁగంటి, మఱికాచే 'మోద మద్దానిచే'; । సన్యాసత్వముఁబూనినన్ను మదినిచ్చల్ నమ్మియున్నట్టిచో। నన్యాయంబెటనుద్భవింపదుగదా యాభీలవైరంబులన్॥ ౪౮॥

క॥ ఏపని పనిచినఁ జేసెద। మీపాదములాన తెలియ మెల్లనఁ జెపుఁడా। దాపరము సేయనేటికిఁ?। దాపసవరులార! మీకు దాసులమెడలన్॥ ౪౯॥

క॥ నావినిమునివరులెల్లన్। భావంబులసంతసిల్లి, బహువైఖరులన్। దీవించి, రాఘవేంద్రుని। తోవినుమనియిట్టులనిరితొడఁబడి 'భక్తిన్'॥ ౫౦॥

ఉ॥ శ్రీరఘురామ! శత్రుముఖజీవనజస్ఫుటసోమ! భూరిర। క్షోర ణభీమ! చారుతరసుందర 'తానత' కామ! 'శౌర్యవి। స్ఫార' సహస్రధా మ! భవ 'బంధ' విరామ! పవిత్రనామ! వి। స్తారయశోభిరామ! శుభ దామ! 'నినున్నినుతింపశక్యమే'॥ ౫౧॥

గీ॥ అలిగిరావణకుంభకర్ణాదిఘోర। రాక్షసావళినెల్లను రణము లోన। బాణములపాలుచేసి మాబాధమాన్పి। తింతెకంటెను శుభము మాకెద్ది చెప్పుమా॥ ౫౨॥

చ॥ తతభుజదండనిర్జితకృతాంతనిలింపవరేణ్యయక్షరా। డతులిత సిద్ధసాధ్యగరుడాహిసమస్తచరాచరున్, మహా। ద్భుత భువనైకకంట కుని, దానవనాయకుఁ,బంక్తికంఠునిన్। క్షితిఁబడనేయనెవ్వనికిఁజెల్లుఁ? దలంపగరాఘవేశ్వరా!॥ ౫౩॥

శా॥ నిద్రాసక్తియొకింతమానిన బొమల్నిక్కించి, చేచాచి య। క్షుద్రాకాశధరాపరీతములు దాశోధించి, యేమబ్బినన్। రౌద్రాకా రతవక్త్రగహ్వరముఁజేరందెచ్చి భక్షించు కో। పోద్రేకాత్మునిఁ,గుంభ కర్ణు, నురుదేహుం,గూల్పగాశక్యమే॥ ౫౪॥

శా॥ జంభారాతిని నూఱుమాఱులనిలో సాధించి, లంకాపురిన్। శుంభద్విక్రముఁడై తదీయసతులన్ సుక్రింజెఱల్ వెట్టి, దో।స్తంభాన ర్గళుఁడై మహోగ్రరణకాంక్షన్ సంచరించెన్మహా। దంభపోద్ధతుఁడిం ద్రజిత్తు, ఘనయుద్ధక్రీడకున్ సాధ్యుఁడే॥ ౫౫॥

ఉ॥ దోయిటఁబట్టనేర్చు నలతోయధులన్నియు నొక్కపెట్టునన్;। వాయువునిల్పనేర్చు; శిఖివాతనుబడ్డను వెళ్లనేర్చు; మా। యాయుతవి క్రముం,డతని నన్యనృపాళికి శక్యమే మృతుం। జేయఁగ? మేటిరక్కసి వజీరుని, నయ్యతికాయు 'నాజిలోన్'॥ ౫౬॥

గీ॥ పిన్నయప్పుడె యముఁబట్టిపీచమణఁచె। నెడనెఱిఁగి వేలుపు లనెల్లనేపుమాపెఁ। ద్రిభువనా 'ధీశులనుగూడ' ధిక్కరించె। నమ్మహాకా యునెదిరింప నలవియగునే॥ ౫౭॥

గీ॥ వినకయుండరె మీరును; వెసనుపొందుఁ। నొక్కవేళ్ళిడినె

గమీటునుకుఁగలిగి। యప్రతిద్వంద్వసాహసులైనయట్టి। కంపనాకంప నులతోడఁగడఁగఁదరమె?॥ ౫౮॥

ఉ॥ అంతమెునర్పనేర్తురు కృతాంతునినైనఁగడంగిరేని; మెప్పింతు రు రావణాసురుని భీమగదారణకౌశలంబులన్;। వింతగవారిఁగన్న న లవిశ్వవుఁడైనను భీతినొందు; దే। వాంతకు, నన్నరాంతకుని నాహవ మందెదిరింపవచ్చునే?॥ ౫౯॥

వ॥ మఱియునదియునుంగాక దేవదానవసంగ్రామరంగనిరోధుం డగు మహోదరుండును, సకలదిగంత దంతావళ దంతాగ్రసంఘాత క్షతసిమ్నోన్నతవక్షస్థలప్రశస్తుండగు ప్రహస్తుండును, క్రోధావలో కనమాత్రచంచలాయమానవిశ్వుండగు మహాపార్శ్వుండును, నిఖిలశ త్రుభీముండగు ఖడ్గరోముండును, ప్రళయసమయ కనదనలసదృశ ధా ముండగు సర్పరోముండును, హాలహాలప్రతిమాన విషరోమస్తోముం డగువృశ్చికరోముండును, శమనసమవిక్రమక్రమవిమతోదగ్రమహో గ్రాహసుపర్ణుండగు నగ్నివర్ణుండును, మొదలుగాఁగల దానవులపా ర బలపరాక్రమవంతులు గారె? వారినెల్ల నల్లన సంహరింపవే? అ దియునుగాక దుష్టనిగ్రహశిష్టపరిపాలకుండును, జగదేకవిక్రముండు నను బిరుదులు నీకుఁజెల్లునని వెండియు నమ్మునీంద్రులు రామచంద్రున కిట్లనిరి॥ ౬౦॥

గీ॥ అనఘ! నీశౌర్యమునఁజేసి యఖిలజనులు। పరిణమించియు, ని ప్పటిబాధవలనఁ। బరిణమింపక యున్నారు పార్థివేంద్ర!॥ వెట్లుజెప్ప దుమవ్వార్త లేముకడఁగి॥ ౬౧॥

గీ॥ శతముఖుండను ఘోరరాక్షసవరేణ్యుఁ। డప్రతిద్వంద్వదోర్బ లుఁడై, సరోజ। గర్భవరముఁజేసి లోకములు గలఁచెఁ। గావరుఁడ గు ప్రతాపలంకావరుండు॥ ౬౨॥

క॥ మునుదశకంఠుని బాధకె। మనఁజాలక యొకఁభంగిమంటిమి; యిపుడో। జనవల్లభ! శతకంఠు। డొనరించెడి ఘోరబాధ కోర్వంగ లమే?॥ ౬౩॥

గీ॥ వారెదివిఁజూడు దేవతావర్గమెల్ల। నద్దురాత్మునిఁదు గావించు నాపదలకు। 'వెలిచివచ్చిన'వారు మీ'మలుఁగు' చూరఁగ। ననుడు, రా ముండువీక్షింపె నభ్రితలము॥ ౬౪॥

వ॥ ఇట్లువీక్షించిన దేవతలును బొడచూపి పారిజాతప్రసూనం బులాన్నృపసూనునిపైఁ గురియించి యంతర్ధానంబునొందిరి; రామచం ద్రుండునువిషణ్ణహృదయుండై చింతించి, పదితలలరక్కసు నుక్రూణం గింపనోపకసీతావియోగుండనై యకారణంబున వాలిందునించి కోతు లమలువుచూచ్చి, యనేకప్రయాసంబుల వైరంబు చక్కంబెట్టిలోకం బు లుద్ధరించితి నవి యట్లుండె, నూఱుతలలును, గరశతద్వయంబునుం గల శతకంఠు నెట్లుసంహరింప నేర్తునని యుల్లంబున మెల్లన వగచి వెండియునమ్మునీంద్రులతో రామచంద్రుండిట్లనియె॥ ౬౫॥

క॥ ఎవ్వనికిఁబుట్టెనాబలుఁ। డెవ్వరికొలఁకింతిసేసెనిట్టిదురాత్ముం। డెవ్విధిఁగోరె వరంబులు। మవ్వంబునఁ బద్మభవుఁడు మఱి యెట్లొ సఁగెన్?॥ ౬౬॥

క॥ ఎఱుఁగింపుఁడిపుడుసన్ముని। వరులార! భయంబునొందివనరఁగ నేలా?। దురితాత్మునిమీపంపునఁ। దెగవొప్పఁగ సంహరింతు దివిజులు పొగడన్॥ ౬౭॥

క॥ అనవినిమునివరులెల్లన్। మనములహర్షించిమృదులమధురతరో క్తుల్। పెనఁగొనఁగ రామభద్రునిఁ। గనుఁగొని యిట్లనిరి భయవికార ముదోఁపన్॥౬౮॥

క॥ విశ్రాంతిఁదనరు సుగృహ। స్థాశ్రమమునియగు పులస్త్యుఁడను సుకృతునకున్। విశ్రవసుండనువాఁడును। నశ్రమఁడనువాఁడు, సిరివుర ట్లుదయింపన్॥ ౬౯॥

వ॥ అందువిశ్రవసుండనువాఁడు, కైకేశి యనుదానిం బాణిగ్రహ ణంబుగావించి, దానివలనంగ్రమంబున రావణకుంభకర్ణ విభీషణాదు లగు జగదేకపవిత్రాపులఁగాంచె; అశ్రముండనువాఁడు, చిత్రగంధియ నుగంధర్వవధూటిందగులుకొని సంతానంబుగానక కతిపయదినంబులు

చింతించి,- దశకంధర ఘటకర్ణ విభీషణప్రముఖులగు విశ్రవసుని కొడుకులు సమరప్రచండులని లజ్జించి, తనమనంబున నిట్లనియె॥ ౨౦॥

చ॥ తనయులులేని ధామమును, దైవనివాసములేని గ్రామమున్,। వినయములేని విద్యయు, వివేకము మాలినయట్టి వైద్యమున్,। జనపతి లేనిరాజ్యమును, సౌఖ్యవిరోధకమైనభోజ్యముం,। గనకము లేని భాగ్యము, 'సుగంధములేనిసుమంబు, వ్యర్థముల్'॥ ౨౧॥

ఉ॥ కావునఁ బూనియేను దశకంఠునికంటెఁ బ్రతాపశాలిగా। వావిరి నాత్మఁ గోరి యొకవంకఁ దపంబొనరించి, యందుచే। నావలనూఱు మోములును హస్తశతద్వయముంగలట్టి స। ద్భావుని, ఘోరశాత్రవవిఫాలునిఁ, బుత్రునిఁ గందు వేడుకన్॥ ౨౨॥

చ॥ అనిచని యాశ్రముండొకవనాంతరమందున మూఁడుమూర్తులన్। మనమున నిల్పి, చండరవిమధ్యమునందనచూడ్కి నిల్పి, యి। మ్మునఁ దప మాచరింపఁగఁ ద్రిమూర్తులు దానగుటం జెలంగి యా। యినుఁడు ప్రసన్నుఁడై, తనయునిచ్చె జగద్భయదప్రతాపునిన్॥ ౨౩॥

వ॥ ఇట్లు భండనోద్దండశతద్వయభుజాదండుండగు పుత్రునిం బడసి, మఱియును లంకకంటె సహస్రగుణాతిశయంబగు ప్రతాపలంకయను నొక్కపట్టణంబు సముద్రమధ్యంబున విశ్వకర్మచే నిర్మింపఁజేసి యందు శతకంఠునికింబట్టంబుగట్టి వెండియుఁ దపంబునకరిగెనంత॥ ౨౪॥

క॥ మీరును రావణముఖ్యా। క్రూరాసురవరులఁ జంపి కువలయము మెల్లన్। 'బీరంబున' రక్షించితి। రారూఢిగ వేల్పులును నహాయని పొగడన్॥ ౨౫॥

గీ॥ శతముఖుండును రావణక్షయముఁ, గుంభ। కర్ణమరణంబు, నింద్రజిత్కాయభగ్న। మంతయును వినుచు లయకాలాగ్నిపగిది। మండి దండిగనూహించె మనసులోన॥ ౨౬॥

గీ॥ నరులు వానరులన నెంతనాకుఁ దృణము। జగతిఁ దక్కినవారిచేఁ జావకుండ। నిమ్ము వరమని యేలభారతీశుఁ గోరెఁ। గాని, రావణుఁ డేవ్యంబుగానఁడయ్యె॥ ౨౭॥

వ॥ కావునఁ బరపురుషులచే నెవ్వరివలనం జావులేకుండ విరించిని

వరంబుగోరి యాటమీఁద రామునిసంహరించి తనయగ్రజులపగయీఁగొ
దనని ప్రతాపలంకాపురిపాలనంబునకు నాప్తులగు మంత్రిలం బ్రతిష్ఠిం
చి, మాణిక్యకనకరజతతామ్రలోహాదినవప్రాకారరక్షకులగు రాక్ష
సులనాదరించి, యొకమహారణ్యంబునకుం జని కృతస్నానుండై భార
తీరమణునుద్దేశించి, జగదద్భుతంబుగాఁబంచాగ్నిమధ్యంబున నచ్చోట
బొటమన వ్రేలూఁతగొని నిక్కి హస్తంబు లెత్తి మహోష్ణచండమధ్యా
హ్నమార్తాండమండలంబుఁజూచుచు నిరాహారుండై వెయ్యేండ్లుతపం
బుగావించెనంత॥ ౭౮॥

ఉ॥ జగములుతల్లడిల్లె; రవిచంద్రులుగన్నడరైరి; పెల్లుగా। దిగిభ
ములెల్ల మ్రొగ్గె; జలధివ్రజమింకె; సమస్త 'జంతువుల్'। వగచె; సురేం
ద్రుఁడున్ బెదరె; వాయువణంగె; హిరణ్యగర్భుఁడున్। మొగినరుదెంచి
నిల్చె నతిమోహముమై శతకంఠుముందటన్॥ ౭౯॥

వ॥ ఇవ్విధంబున నవ్విరించి సుప్రసన్నుండై కరుణారసంబు పెల్లు
బ్బ యబ్బురంబుగానిట్లనియె॥ ౮౦॥

శా॥ అన్నాయోయిశతాస్య! యాశ్రమతనూజా! యెమ్మదుద్యత్త
పో। త్యాన్నత్యంబునకిచ్చ మెచ్చితివరం'బాసింపు'మాయిచ్చెదం,। గన్ను
ల్విప్పుము నన్నుఁజూడుమనుచుంగారుణ్యపాథోధియై। చెన్నారందను
నాదరింపఁ, బరమేష్ఠింజూచి హర్షాత్ముఁడై॥ ౮౧॥

ఉ॥ కరముల్ మోడ్చి విరించికిన్ శతనమస్కారంబు లందంద ను।
త్కరమా భక్తినొనర్చి లేచి తనవక్త్రంబుల్ విడంబించి, యో। హరి
నాభీకమలోద్భవా! నిగమవిన్యాసప్రశస్తాననా!। కరుణాసాగర! నీకు
మ్రొక్కెదను మత్కామ్యంబులీడేర్పవే॥ ౮౨॥

వ॥ అనిమఱియు బహువిధంబులఁగైవారంబుఁజేసిన విని వనజసం
భవుండు పరమప్రీతుండై యొక్కవరంబు వేఁడుమొసంగెద ననుడు శ
తముఖుండును సంతసిల్లి, అయ్యా! నెయ్యంబున వరంబు లొసంగు మె
ప్పుమీకుండెనేని యక్షరాక్షసగరుడగంధర్వసిద్ధవిద్యాధర కిన్నర కింపు
రుషసురనరవానరాదులగు పురుషులవలనను, మృగాండజ భుజంగమ

లోకంబులవలనను, మీనకర్కట మకరకచ్ఛపాది జలచర సముదయం
బువలనను మరణంబు లేకుండనిమ్మనిన నప్పరమేష్ఠియుఁ దప్పక దయచేసి
మఱియు నొకవరంబు వేఁడుమనిన దనుజేంద్రుండు ప్రార్థించి, రణం
బు సేయునెడఁ దనశరీరంబునంగల శోణితకణం బెచటం దొఱంగు నచ
ట నూర్గురు శతముఖులు జనించునట్లుగా ననుగ్రహింపుమనుడు జల
జాసనుండును నత్తెఱఁగునకు సమ్మతించి, నీతపోమహిమంబునకు మూ
డులోకంబులనెందు సరియెఱుంగము గావుననింక నొకవరంబడుగుమ
ని సుప్రసన్నుండైనం గని, జరయును, శ్రమయును, పరితాపంబును,
భయంబును, దైన్యంబును నెన్నండును దన్నుంబొరయకుండ వరంబొ
సంగుమనవుడు విరించి యట్లకాకయని దీవించి యంతర్ధానంబు నొం
దె; శతముఖుండును ప్రతాపలంకాభిముఖుండై చనునెడ॥ ౬౩॥

క॥ మెందుకొనభయముధరణీ। మండలమదితల్లడిల్లె; మాఁగుదుది
శలన్। నిండుకొనె; నిర్జరేంద్రుఁడు। గుండియ జల్లనఁగఁ జేతికులిశము
వైచెన్॥ ౬౪॥

వ॥ శతముఖుండును గమలసంభవదయాసంప్రాప్త వరప్రభావ
ధురంధరుండై తనపురంబు ప్రవేశించి, తనజ్ఞాతులగు రావణ కుంభక
ర్ణుల పగయీఁగి రామునిం దునిమెద, నతం డగుపడుదనుకను దత్ప్రి
యంబులగు గోబ్రాహ్మణమునిసంఘంబుల హననంబు గావించెదనని ప్ర
ధానులును, దండనాయకులును దన్నుంగొలువ సకలదిక్కులును వ్రి
క్కలుగావించి, దేవతలపురంబులకు దాడివెట్టి, దివిజులం బాఱఁదోలి
మఱలి మాయాశ్రమంబులు చూఱలాడి, కొందఱ మునులంజంపి, పతివ్ర
తలగు తరుణులఁ జెఱలుగొని, హోమధేనువులందునిమి, యివి మొదలు
గాఁగల ననేకహింసలు గావింపఁదొడంగెనని వెండియు రామచంద్రున
కిట్లనిరి॥ ౬౫॥

గీ॥ ఈవుదప్ప మాకు నెవ్వారు దిక్కులే। రట్లుగాన భీతినమరవరు
లు। వెలయమిమ్ముఁజేరి వేఁడుకొండని పంప। వచ్చినార మభయమిచ్చి
బ్రోవు॥ ౬౬॥

గీ॥ అనుచుబాష్పధారలత్తఱి వారలఁగా। నతిభయాత్ములగుచు స

మ్మునీంద్రు। లున్న, వారినద్దుపనూహించి రామభూ। వరుఁడు బలికె మధురవాక్యములను॥ ౮౭॥

గీ॥ తెగువనింత సేయు దేవతాద్రోహిని। సంహరించి, మిమ్ము, సక లసురలఁ। గాతుఁగరుణమెఱఁ; గావఁగా లేకున్నఁ। బ్రాణమేల? యీ కృపాణమేల?॥ ౮౮॥

గీ॥ అనుచువారికభయహస్తంబులిడి పంచె। నఘవిదూరుఁడైన ర ఘువరుండు। చనిరిమునివరులును సంతోషభరితులై। మగిడి తత్తదాశ్ర మంబులకును॥ ౮౯॥

గీ॥ చనినఁబిమ్మట నేకాంతసౌధమందు। రాఘవుఁడు భూరితర శ రలాఘవుండు। మహిమతోడుత సౌమిత్రి మైత్రిమెఱయఁ। జేరికొలువం గఁ గూర్చుండిచిత్తమునను॥ ౯౦॥

క॥ శతముఖుని జన్మమహిమయు,। జతనంబుగ నతఁడు తపముస లిపిన ధైర్య। స్థితియును, వరములు గొనుటయు। మతిలోఁ దలపోసి దీ నమానసుఁడయ్యెన్॥ ౯౧॥

క॥ తానసురాంతకుఁడయ్యును। మానవుఁడైయుంటఁజేసి మహి మలు తెలియం। గానోపక, పలుమాఱును। వానిపరాక్రమముఁదలఁచివ నరఁగఁదొడఁగెన్॥ ౯౨॥

వ॥ ఇట్లుతలంచుచుఁ దదనంతరం బాసుమంతాది మంత్రుల నటకు రావించి, వారువినంగ లక్ష్మణు మొగంబై యిట్లనియె॥ ౯౩॥

సీ॥ కెరలెడి దధిఘృతక్షీర సురాసముద్రంబు లేవిధమున దాఁటవ చ్చు? దాఁటెబో పూర్వవిధాతృడిచ్చినవరగర్వమెత్తెఱఁగునఁగడవవ చ్చుఁ? గడచెబో నవపరిఖాయుత ప్రాకారపట్టణం బెటులగ్గపట్టవ చ్చుఁ? బట్టెబో కలనిలోఁ బరపురుషాభేద్య దనుజవల్లభునెట్లు దును మవచ్చు? నేలవచ్చిరి సకలమునీంద్రులిటకు? నేలప్రతినలు గావించితే ను? దనుజ। వంశవిభుఁడెట్టికైవడి వసుధఁగూలు? నకట! తమకించి ప లుకుట హానిగాదె?॥ ౯౪॥

వ॥ అని తానును లక్ష్మణుండునుందక్కఁ దకిన బలసామగ్రి చా

లకుండుటకును, చతుస్సముద్రలంఘనంబు గావింపఁజాలకుండుటకును నిర్విణ్ణహృదయుండై యూరకుండె; మంత్రులు నిట్టిట్టనియూహింపనేరరైరి; తత్ప్రకారంబు లీక్షించి కోపారుణితలోచనుండై సౌమిత్రి రామచంద్రునకిట్లనియె. ॥ ౯౫॥

గీ॥ శతముఖుండను రాక్షసచక్రవర్తి। నెట్లు సాధింతునని విచారింపనేల?। తూలికాపర్వతంబును ధూళిచేయ। మిణుఁగురుఁటింతైనఁజాలదే మేదినీశ!॥ ౯౬॥

వ॥ అట్లుగా విచారింపు మదియునుంగాక॥ ౯౭॥

చ॥ వడిఁగబళింతునే శశిదివాకరబింబములం గణంకమైఁ? బుడిసిటిలోననిల్పుదునె భూరిపయోనిధులెల్లఁ బెల్లుగాఁ?। బిడుగునుబోలు ముష్టిహతిఁబృథ్వియు నింగియు ధూళిచేతునే?। యెడపక నాదుముందఱ సహించి శతాస్యునిఁజెప్పనేటికిన్?॥ ౯౮॥

శా॥ చిత్రంబాప్పఁ దపంబుచేసి శివునక్షీణత్రిశూలంబొగిన్। సుత్రామాదులుమెచ్చఁగైకొను నృపక్షోభప్రశస్తున్ బుధా। మిత్రాత్మున్ లవణాసురుం దునుమఁడే మీరెల్లహర్షింపనా। శత్రుఘ్నుండణుమాత్రుఁడే తలపఁగా సంగ్రామరంగంబునన్?॥ ౯౯॥

చ॥ నిరుపమవిక్రమస్థితిని నీసరివచ్చు; నపారఘోరసం। గరమగు వేళదుర్విమతఖండనమంత్రమెఱుంగుఁ; గ్రిమ్మఱం। బరబలమెత్తివచ్చిన శుభంబొనఁగూర్చుకొనంగనేర్చు; నా। భరతుఁడు కేవలుండె యురుభండనభూమిని రాఘవేశ్వరా!॥ ౧౦౦॥

శా॥ దండిన్మున్ను మహాధ్వరాశ్వమునకై దర్పించి మమ్మందఱన్। గుండెల్ వ్రీలఁగనేయరే దివిజులాఘోషింప యుద్ధంబునన్?। వెండిన్మిమ్ములనుం జెనంకి మనరే వేగంబునన్ భండనో। ద్దండుండాకుశుఁడున్ లవుండు దరనేతన్మాత్రులే భూవరా!॥ ౧౦౧॥

చ॥ రసికుఁడు విద్యలందుఁ; బరరాజభయంకరుఁ డెంచి చూడఁగా;। నసిముఖతీక్షణాస్త్రవివిధాశుగసంచితశౌర్యశాలి;దై। త్యశమనమూర్తి; శుంభదఘదారుణగోత్రపవిత్రధార; మీ। దుసనికుమారుఁ

దుగ్రరణకోవిదుఁ డావిజయుండు బేలయే?॥ ౧౦౨॥

మ॥ అడియట్లుండగ 'దేవకల్పులు' రణోద్యత్ప్రాభవుల్' బంట్లు
డే। బ్బద'కోట్లుం'గొలువంగ రౌద్రముఖుఁడై భానుప్రభల్ మీఱఁగా।
నదనందమ్ము నెదిర్చినన్ భయదవాలాభీలుఁడై మృత్యువున్। గదుమంగాఁ
గలబాహువిక్రముఁడు సుగ్రీవుండు సామాన్యుఁడే?॥ ౧౦౩॥

శా॥ ఓష్ఠద్వంద్వము పెల్లుగానదర రాహుంబోలి మందోదరిన్।
నిష్ఠూరంబుగఁబట్టి తెచ్చుచుఁగపుల్ నిక్కన్ దశాస్యోగ్ర హ్యాస్నిష్ఠాభం
గముఁజేసి పెంపుగన్నఁడే నీముందటన్ వానర। శ్రేష్ఠుం డంగదుఁ డంత
వాఁడు గలుగంజింతింపఁగా నేటికిన్?॥ ౧౦౪॥

శా॥ తల్లిందండ్రివి నీవెయంచును మదిందాత్పర్యమొప్పంగ, మీ। కె
ల్లందానె విచారముల్దెలుపుచెంతే దానవాధీశహృ। ద్భల్లంబై చరియిం
చు భండనమునం,బ్రత్యర్థిసంహారుఁడా। భల్లూకేంద్రుఁడు, జాంబవం
తుఁడు తలంపంగొంచుఁడేయెంచఁగన్?॥ ౧౦౫॥

శా॥ కేలన్సాలమహీజయుగ్మము రణాంగీకారమొప్ప న్మహా। భీ
లుండై ధరియించి యెల్లదిశలు న్భేదిల్లఁగా నార్చుచున్,। వాలంబభ్ర
ముసోఁకఁజాఁచి రిపులన్వారించు ధీరాత్ముఁడా। నీలున్,శౌర్యగుణాల
వాలు ననిలో నెట్టించువారేరిలన్?॥ ౧౦౬॥

ఉ॥ కార్ముకమందె నేని పటుకాండపరంపరచే నరాతులన్। మర్మ
ములుచ్చిపోవ నసమానచమత్కృతి నేయనేర్చు; దు। ష్కర్ములఁగూడఁ
డెన్నఁ; దురుశౌర్యుఁడు; ధైర్యుఁడు; కార్యవేది; జ్యో। తిర్ముఖు నంత
వాఁడు మనదిక్కునఁగల్గఁగఁ జింతయేటికిన్?॥ ౧౦౭॥

చ॥ క్షితిధరవృక్షవర్గ మఱచేతుల నిల్పి కడంగి రేసి యా। శతిగళుఁ
డైన భీతిలు; నశేషపరాక్రము లాహవంబునన్;। దితిసుతలోకశుష్కవ
నతీవ్రదవానలకీల; లుగ్రులా। శతబలియు న్గవాక్షుఁడును జాలరె దై
త్యునిసంహరింపఁగన్?॥ ౧౦౮॥

వ॥ మఱియు వానరకులోత్తారకుండగు తారకుండును, మహాభు
జుండగు గజుండును, వజ్రధారాప్రతిమానశరభుండగు శరభుండును,

మఱియు సమరవిజయస్తోములగు గోముఖ, గంధమాదన, ఋషభ, మైంద, ద్వివిద, వేగదర్శి, గవయప్రముఖ నిఖిలమహావనచరచమూనాయకులును గడంగి రేని చతుర్దశభువనంబులుం బరిమార్పనోపరే? అది యునుగాక మీరు బెట్టినచెట్టు విభీషణుండిట్టిసమయంబునఁదోడురాకుండునే? అతండలిగిన సకలబ్రహ్మాండంబులుంబూఁటాడఁడే? ఇంతబలసామగ్రిగలుగ నసురవరునికొఱకు నీవింతవంతనొందఁదగునే? యనిమహాబలవంతుండగు హనుమంతునిం దలంచి చిఱునవ్వునవ్వుచు లక్ష్మణుండు వెండియు రామచంద్రునకిట్లనియె॥ ౧౦౯॥

సీ॥ పుట్టినప్పుడె పట్టి బెట్టిదంబుగ నబ్బైమిత్రింగఁ దేభానునినింగి కెగిసి?। అసమానజవముచే నలరి కాల్వయఁ బోలె దాఁటఁడే యలసముద్రంబుఁగడిసి?। లంకాపురముసొచ్చి శంకయించుకలేక హతునిఁగావింపఁడే యక్షుఁగణఁగి?। దీపితాటోపకోపాపారశిఖిశిఖాతతులచేఁగాల్పఁడే తత్పురంబు?। అట్టిజగజెట్టియగు గాడ్పుపట్టిమనకు। నిట్టివేళలఁ గలుగంగ నేలవగవ?। నతఁడుగడఁగిన శతకంఠుఁడనఁగనెంత?। యొక్కవ్రేల్మిడి నెగమీటు నుర్విరెల్ల॥ ౧౧౦॥

వ॥ మఱచితిరే? నాఁడు మనలనిరువురం గొనిపోయి మహిరావణుండు పాతాళంబున భద్రకాళికిఁ బ్రియంబుగా నిచ్చి తృప్తింపంబూనుసమయంబున నాకశతపత్రినాళంబున సూక్ష్మరూపంబునం జొచ్చి, అచ్చటఁగాపున్న మత్స్యవల్లభునితోఁ బెనంగి, అతిరయంబున నప్పాతాళలంకానివాసులగు రాక్షసులనందఱ నిర్మూలంబుగావించి, పిదప మహిరావణుతోఁ బోరాడి, సప్తభ్రమరంబులతోడ వాని ప్రాణంబులుం గొని మనలను బ్రతికించెఁగాదె? అట్టి ప్రాణబంధుండును, శౌర్యధురంధరుండునగు మరున్నందనుండు మనకాప్తుండై యున్నవాఁడది యునుంగాక సకలదేశంబులవారును సుఖదుఃఖములకు మనలోవారుగాని వెలిగాఁ బ్రవర్తింపనేరరింతయు విచారించి, సంగరంబున కరిగి శతముఖునిసంహరించి లోకంబులఁగావుమని వెండియు నిట్లనియె॥ ౧౧౧॥

గీ॥ డంబుగలభద్రదంతావళంబువోలె। నిన్ను నీవెఱుంగవుగాక, నీ

పురణము। నందు నలిగితివేని బ్రహ్మాండ మెల్ల। నిలిచి భస్మీకరింపవే నిమి షమునను?॥ ౧౧౨॥

గీ॥ అనుచుఁదమ్ముఁడు బోధింపనలరి, రామ! భద్రుఁడెంతయు స త్యంబుపరులగెలువ(వచ్చు నీచెప్పినట్టి భావములననుదు। జనవరేణ్యుం డు పిదప లక్ష్మణునకనియె॥ ౧౧౩॥

గీ॥ కార్యఖడ్గములను రెండు 'గతుల' యందుఁ। గార్యముత్తమ, మ దిచకొలఁగాకయున్నఁ। బలువిధంబుల నవ్వలిబలమెఱింగి। ఖడ్గమొనరిం ప నటమీఁది కర్జమందు॥ ౧౧౪॥

వ॥ అదిగావున మొదట సామదానమాయోపాయభేదంబుల శత కంతుంబరిమార్పనూహించెద; అట్లొనఁగూడకున్న దండంబున దండధ రునిలోకంబునకనిచెద; వాఁడననేంత? యింతలో విభీషణుని రావించి యతనివలన శత్రువునివర్తనంబులన్నియుం దెలిసికొని, యటమీఁదనమ్మ హాత్ముండుచెప్పినచొప్పునఁజనుదమని విభీషణుండలంచిననతండును దన మనంబునహర్షించియెవ్వరికినెఱింగింపక యతిశీఘ్రగమనంబున॥ ౧౧౫॥

చ॥ అనిలుఁడు నన్నలుండు హరుఁడాదిగఁగల్గినమంత్రులందఱుం। దనుఁగొలువన్సముద్రము ముదంబున దాఁటి, బలంబు నెకొలనన్। వె నుకొనియభ్రవీధిని నవీనజవంబునవచ్చె; వచ్చి స(జ్జనమణియైన రాఘ వుని సమ్మతిసేయుచుఁదత్పురంబునన్॥ ౧౧౬॥

క॥ రామునిఁ, గోమలమేఘ। శ్యాముని, మునిలోకపతితసంతతవిల స। న్నాముని, శాత్రవభీమునిఁ,। బ్రేమనువీక్షించెనవ్విభీషణుఁడేలమిన్॥

క॥ వీక్షించి యతనిచరణము। లక్షీ'ణా మోదహృదయుఁ'డై తనని టలం। బాతుణమసోఁకమొ్రక్కుచు(రాక్షసనాయకుఁడు లేచి ప్రవిమ లభక్తిన్॥ ౧౧౭॥

చ॥ జయజయ మానివృజ్జలజచారణ! పాపవినాశకారణా!। జ యజయదైత్యసంహరణసాయక! కామ్యఫలప్రదాయకా!। జయజ యపుణ్యగాత్ర! అతిసత్యచరిత్ర! విచిత్రవిక్రమా!। జయజయ రామ చంద్ర! గుణసాంద్ర! సురేంద్రమునీంద్రసన్నుతా!॥ ౧౧౮॥

వ॥ అనియిట్లు పలుతెఱంగుల వినుతింప నమ్మధురవ్యాహృతులభాష
ణుండగు విభీషణున్‌గ్రుచ్చి గాఢాలింగనంబు గావించి, ఆనందాశ్రుజ
లపరంపరలు దొరుఁగ సరగునఁ దనదండ నొక్కయుచిత పీఠంబునం
గూర్చుండఁబెట్టి, భక్తపరాయణుండగు రామభద్రుం డతని సేమంబు
దెలిసికొనిమన్నించి, మెల్లననిట్లనియె॥ ౧౨౦॥

శా॥ ఆవేళంబవరంబునందలదశాస్యాభీలబాణాళిచే। నావిర్భూ
తమునొందు వహ్నిఁబడి చేయాడింపఁగాలేనిచో,। నీవాదైత్యుని మర్మ
కర్మతతులన్నేర్పంగ హింసించితిన్;। నీవంటాప్తుఁడుభూమిలోనఁగలఁ
డే? నిక్కంబుదైత్యోత్తమా!॥ ౧౨౧॥

గీ॥ ఓవిభీషణ! నిన్నొక నావఁజేసి। సంగరాంబుధినరసియీఁదంగఁ
గంటి। నట్టివలనను గడచితి, నంతకంటె। నొక్కప్రళయంబువార్త నేఁ
డుద్భవించె॥ ౧౨౨॥

గీ॥ అట్టివృత్తాంతమెఱిఁగింతు ననఘ! వినుము। నూఱుతలలును ని
న్నూఱు ఘోరబాహు। లుండు దైత్యేంద్రుఁ డొక్కఁ డుద్దండుఁడగు
చుఁ। దాపసుల దేవతలఁ గ్రొవ్వి యేపుమాపె॥ ౧౨౩॥

వ॥ మఱియు ననేకవిధంబుల గోబ్రాహ్మణహననంబులును, సకల
దిశారమణతాడనంబులును, అఖిలజీవసంక్షోభంబును గావింప నద్దు
రాత్ముండు చేయుబాధలకుంజాలక, మునిదేవతానివహంబులరుదెంచి,
తమతమబాధల తెఱంగంతయు నెఱింగించి, శరణుచొచ్చినం గరుణిం
చి, యభయహస్తంబులిచ్చి పంచితి; ఇటమీఁద నేదియుం దెలియక య
ద్దానవుని వర్తనంబులన్నియు నీచే నెఱుంగుటకు నిన్నురావించితిననిన వి
ని, విభీషణుండు నజ్జనవరేణ్యుని కరుణావలోకనమహిమంబునకు ని
చ్చ నచ్చెరుపడి మచ్చికనిట్లనియె॥ ౧౨౪॥

సీ॥ జంభారిగంభీరదంభోళిధారతోఁ బర్వతంబొకటి దీర్పంగఁగ
లదె?। కఠిననఖాభీలకంఠీరవంబుతో భద్రేభమొకటి దీర్పంగఁగలదె?।
సంవర్తసమయప్రచండానలముతోడ నెఱిశుష్కగహనంబు నిలువఁగల
దె?। ఝంఝూవాయుప్రభంజనమహాఘాటితోఁ గొలఁదిగా మబ్బు మా

ర్కొనఁగఁ గలఁడె? । ఎంతవాఁడైన, వరముల నెన్ని గొనినఁ, । గనలి నీతోడ నెదిరించి మనఁగఁ గలఁడె? । పుడమిఁ బటుచూర్ణమై తానె పోవుఁగాక । రఘుకులాంభోధిచంద్ర! శ్రీరామచంద్ర! ॥ ౧౨౫॥

క॥ పగవారిని మీ యెదుటను । బొగడన్ రాదైనఁగాని భూమీశ్వర! న । న్నొగి నడిగినందులకు నై । త్యగణాధిపు మర్మ మెల్లఁ దగ నెఱుఁగింతున్॥ ౧౨౬॥

క॥ పంకజగర్భుం డైనను । శంకామతినుండఁ బొగడఁజాలక, నేను । ట్టంకింపఁ గలనె? సకలా । లంకారము, తత్పురి తాపలంక మహీశా!॥ ౧౨౭॥

క॥ ప్రాకారంబులు తొమ్మిది । భీకరమై యుండు జంభభిన్ముఖ్యాసురా । నీకంబులకును, దక్కన । లోకులకిఁకఁ జెప్ప నేల? లోకాధీశా!॥ ౧౨౮॥

వ॥ మఱియుఁ బరిఖాజలప్రమాణంబు రసాతలంబు నతిక్రమించి, బ్రహ్మరుద్రాదులకు నభేద్యంబై ప్రవర్తిల్లు; దీర్ఘజిహ్వ, శిఖిముఖ, స్థూలకంఠ, యోజనహస్త, దుర్ముఖ, శూర్పకర్ణ, రక్తాక్ష, పింగళాక్ష, గజోదర, త్రిముఖులను మంత్రులు పదుండ్రు వర్తింతురు; అందు నొక్కొక్క మంత్రిని మూఁడుకోట్ల రాక్షసులు సేవింతురు; అందు నొక్కొక్క మంత్రి మృత్యువునైనఁ బారిఁగొనఁజాలు; అందఱుం గూడినఁ జతుర్దశభువనంబులును జప్పరింతురు; వారికి నాథుండు శతముఖుండు పరమేష్ఠిచేఁ బరపురుషాభేద్యత్వము మొదలుగాఁ గలుగు ననేక దుర్లభవరంబులు గొన్ని, విష్ణుశంకరాదులఁ దృణీకరించుచు, నతండు మనంబున నేను మిమ్ము సేవించి, మీచేత రావణాదులం దునిమించితినని నన్నుం జంపఁదలంచుచుండు; నాకు నతనికి వైరం బెప్పుడును గలదు; వాఁడు మీచేత నే కాని మఱి యెవ్వరికి నజేయుండని వెండియు రామచంద్రున కిట్లనియె॥ ౧౨౯॥

గీ॥ శతముఖుని కింకరులు తన్ను హతునిఁ జేయ । నకట! యెప్పుడు వత్తురో యనుచు దిశలు । చూచుచుండఁగఁ జాలవి చూపులనుచు । సమరభర్త సహస్రాక్షుఁ డయ్యెఁ గాదె?॥ ౧౩౦॥

గీ॥ ఉరుబలాధికుఁ డగు శతాస్యుఁడు మదించి । దాడి మనమీఁద నె

కరుఁడఁ దరలివచ్చు। నొక్కొ-యని భీతిమై నేను నుకుఁడకుఁ। తారకా చలగహ్వారాంతమునసుండు॥ ౧౩౧॥

వ॥ అనినవిని పార్వతీదేవి మహాశ్చర్యంబునొంది చిఱునవ్వు నవ్వు చు శంకరుమొగంబుపైఁ దనచూడ్కి-నిల్పి, మహాత్మా! యిట్టి విచిత్రంబ గు చరిత్రంబు నెన్నండును వినియును గనియును నే నెఱుంగ; నీదివ్య కథావిధానం బేపుణ్యుఁ డాకర్ణింపఁబూను నతనికినాయురారోగ్యం బులును, మహదైశ్వర్యంబును, పుత్రపౌత్రలాభంబును, సకలబంధు నివహానుకూలంబునునై యాచంద్ర తారకంబుగా వర్ధిల్లు నటుగాన నే ను కృతార్థురాలనైతి నటమీఁదివృత్తాంతంబానతిమ్మనిన నమ్మహాదేవుం డిట్లనియె; అట్లు విభీషణుండు శతకంఠుని మహిమంబు కొంతవినిపించి రామచంద్రునకు వెండియు నిట్లనియె॥ ౧౩౨॥

క॥ అతులితదోర్బలమునకును । వితతపరాక్రమమునకును వివరిం పఁగనీ। శతముఖునకు రావణునకు। మతమునఁ దలపోయ హస్తిమశ కాంతరముల్॥ ౧౩౩॥

క॥ కావున శతముఖుఁదునుమఁగ। నీవేకా కొండుగలఁడె? నృపవ ర! వేగన్। రావింపుము యుద్ధమునకుఁ। బావనులగు హనుమదాది బ లములనెల్లన్॥ ౧౩౪॥

సీ॥ నావుడువిని నరనాథుండు చింతించి యేవెఱవున దాఁటుదేను వార్ధు,। లెవ్వరిబలమున నేగుదాహవమున, కేవిధమునఁదు)ంతు నేను రి పుల,। నేలాగుబోషింతు నెల్లయోగీంద్రు)ల, నెట్లుద్ధరింతు, నేనేమిసే తు,। దేవతాభయములే తెఱఁగునవారింతు, వడిసైన్యములమతి వ్వాఁ దుసదుపు?। ననుచుఁదలపోసి తలపోసి యాత్మయందు। నంతయును జూ చి యాహనుమంతునుండి। కొంతకార్యంబు మఱి సమకూఱుననుచుఁ। గోరిధైర్యంబు మతిబురికొల్పియపుడు॥ ౧౩౫॥

క॥ హనుమంతునిఁ, బటుదోర్బల। ధనవంతుని, సకలధరణిదైవత వినుతున్,। ఘనశాంతునిఁ, గపికాంతునిఁ। జను దెమ్మని రాఘవుండు చ య్యనఁదలఁచెన్॥ ౧౩౬॥

ఉ॥ అగ్గతినాన్నృపాలమణి యాత్మఁదలంచిన, మారుతాత్మజుం। డగ్గలమైనమోదము భయంబును భక్తియునుంబెనంగఁగా। నగ్గురుగంధమాదనమహాచలశృంగముమీఁదినుండి తా। దిగ్గుననేగుఁదెంచె నతితీవ్రరయంబునఁదత్క్షణంబునన్॥ ౧౩౭॥

వ॥ ఇట్లుసంభ్రమంబున మనోవేగుండైవచ్చి, సాకేతనగరంబుసొచ్చి, యొక్కచక్కని ముహూర్తంబున॥ ౧౩౮॥

ఉ॥ శీలుని, దివ్యనూత్నమణిచేలునిఁ, జాపవనస్ఫుటానల। జ్వాలుని, ధర్మసద్గుణవిశాలుని, ఖండకళానిధిస్ఫుర। త్ఫాలుని, ఘోరశాత్రవవిఫాలుని, ధీరుని, రామభద్రభూ। పాలునిఁగాంచి, తచ్చరణపద్మములంబడి లేచి నిల్చుచున్॥ ౧౩౯॥

చ॥ కరములుమోడ్చి,యోదనుజఖండన!యోకరుణాసముద్ర!యో। పరమవివేక! యోకలుషభంజన! యోరఘురామచంద్ర! మీ। చరణపయోజముల్ భజనసల్పఁగనేర్చుట మూడులోకముల్। తరలక వేడ్కనేలుటగదా తలపోయఁగ మానవేశ్వరా!॥ ౧౪౦॥

చ॥ ధరణిసుతాధిపాయ భుజదండవినిర్జితదానవాయ భా। స్కరకులసంభవాయ జలజాతదళాయతలోచనాయ సం। గరవిజయాయ తాపసనికాయనుతాయ నతాయతేనమో। పరమకృపాత్మనే వరనృపాయ రఘూత్తమ! రాజసత్తమా!॥ ౧౪౧॥

ఉ॥ ఏపనికైననన్ను జగదీశ్వర! పంపుము, సప్తవార్ధులుం। దావులుపన్ని సైన్యములు దాఁటఁగఁజేతునొ? మృత్యువక్త్రము। ల్దాపలిచేతమూయుదునొ? డాసికృతాంతునిఁబట్టి తెత్తునో?। భూపకులావతంస! వెసఁబూని కులాద్రులు పెల్లగింతునో?॥ ౧౪౨॥

వ॥ అని పెక్కుభంగుల సంభ్రమింప దశస్యందననందనుండు మారున్నందనుంగరుణామృతలహరులుచెదర నవలోకించి, రమ్మురమ్మని యామ్ముఱొమ్మునంగదియ నాలింగనంబుగావించి, కుశలంబడిగి పథశ్రమంబుదీఱ నొక్కహర్మ్యంబున విడియనియమించి పనిచిన నతండు చనిన పిదప విభీషణుంగనుంగొని, యిమ్మహామహునిచేతఁగాని కార్యంబులా

నఁగూడదవని యిష్టాలాపంబుల నారేయిగడపి, మఱునాఁడు సంధ్యాదిక్రియలు నిర్వర్తించి, గురుపితృపూజనంబులుగావించి, అగ్నిహోత్రింబులుదర్శించి, విప్రసహస్రంబులకుఁ గర్పూరతాంబూలపరంపరలొసంగి, వారిచే నాయురారోగ్యాశీర్వాదంబులు గైకొని, భరత శత్రుఘ్న లక్ష్మణ విభీషణాదులతోఁగూడ నలంకృతుఁడై, సుఖంతాది మంత్రులుంగొలువ నేకాంతసౌధంబునంగూర్చుండి, అప్పటికి హనుమంతునిరప్పించి, అతండును, దానును, విభీషణుండును, రావణకుంభకర్ణ దేవాంతక నరాంతక కంపనాకంపనాతికాయ మహాకాయమేంద్రజిత్ప్రహస్త మహోదర మహాపార్శ్వ ఖడ్గరోమ సర్పరోమ వృశ్చికరోమాగ్నివర్ణ ప్రముఖ నిఖిలదానవ మహోద్దండ భండన ప్రకారంబులుగ్గడింపుచు, నెడనెడమారుతింగొనియాడుచుఁగొంతప్రొద్దుపుచ్చి, హనుమంతునికి శతకంఠుని ప్రకారంబెఱింగింపుమని విభీషణునకుఁగనుసన్నగావింప నమ్మహాత్ముండును సమ్మదంబున నమ్మరుత్సుతునకుఁదెలివిపడ శతకంఠునిజన్మంబును, తపోమహిమంబును, జలజభువలన వరంబులుగొనిన తెఱంగును, మునిదేవతాపరిహారణంబులును, చతుస్సముద్రలంఘనప్రయాసంబును, పరిఖావిశేషంబును, ప్రాకారప్రకారంబును, ద్వారరక్షక మహాదానవనివహ విక్రమంబులును, మంత్రిప్రచండత్వంబును గరతలామలకంబుగా నెఱింగించిన విని వనచరవర్యుండు గగనంబునఁ గుప్పించి గంతు లిడుచు, రామభద్రునిం గొనియాడుచుఁ దనచే నింతయు సాధ్యంబగుట మనంబున నిశ్చయించి రఘువల్లభునకిట్లనియె॥ ౧౭౩॥

గీ॥ అన్న రాఘవ! నీబంటనున్నవాఁడ। నెంతవాఁడైనవాఁడన నెంత
మనకు?। మీరుబంపిన నేగి యాతూర్రుఁడైన। శతముఖునిఁజంపి యే తెంతు జతనముగను॥ ౧౭౪॥

సీ॥ అది యెటువలెనన్న నద్రిజాధీశుని శక్తి నాయందున సంఘటిల్లు। నరయ జగత్ప్రాణుఁడైన మాతండ్రిచే జవసత్వములు నాకుఁ జాలఁగలుగు। నశ్రమశౌర్యంబు నజరత్వ మమృతియు నమరులవలన నాయందునుండు। నదిగాక మీదివ్యహస్తసంస్పర్శచే మెండుగా వజ్రదే

హనుండనైతిఁ గాన మీయాజ్ఞఁ దలమోచి కదలి కడఁగి యనికిఁ దొడఁగి నశతకంఠుఁడనఁగ నెంత? యట్టహాసంబుచేసి కాలాగ్ని నైనఁ బట్టి మ్రింగుదుఁ జలపట్టిపంతమునను॥ ౧౮౫॥

గీ॥ దాఁటరాదని జలధులు దడయ నేల? మెఱసి దాఁటెంతు వాలంబు మీఁద నేనఁ దవిలి యాత్మస్తవంబుగాఁ దలఁపవలదు తథ్యమింతయు నీదు పాదంబులాన॥ ౧౮౬॥

వ॥ అనిమరుత్సుతుండు వెండియు నిట్లనియె మీరు నమ్మించిన నమ్మక సుగ్రీవుండు మీచే దుందుభి కళేబరంబు మీటించి, సప్తతాళంబుల నొక్క కోలం దునియ నేయించి, యటమీఁద నాశ్రయించెఁ గాదె; కావున మీరును నా మహారూపంబు చూపిన వీక్షించినంగాని సమ్మతింపరెల్లి మీ పేరఁ జంద్రతారాబలంబులు గలిగియున్నవి, నేను నా యందుఁ గలబలంబు తేటతెల్లంబు చేసెదనని నృపవరునిచే ననుజ్ఞవడసి యా రేయి శయనంబునన న్నుంగూర్చి ఘటికాదశకంబు తపంబు చేసిన నతండు మదంశసంభవుండు గావున నేనును బ్రీతుండనై ప్రసన్నుండనైతి నప్పవనజుండు నన్ను వీక్షించి యిట్లని స్తుతించె॥ ౧౮౭॥

దండకము॥ శ్రీమన్మహాదేవ! దేవాదిదేవస్ఫురచ్చారుకోటీరదేదీప్యమానోల్లసద్రత్నకాంతిచ్ఛటామండితాంఘ్రిద్వయా! యద్వితీయా! క్రిమా! విక్రమా! చారుహస్తప్రశస్తా! బుధస్తుత్య! సత్యాంగకా! సత్యభాషా! విశేషాహిభూషా! సురాధ్యక్ష! దక్షాధ్వరధ్వంస! కంసారిమిత్రా! త్రినేత్రా! సుగంగాకళత్రా! మహాగాత్ర! యీశా! మహేశా! ఫలికాశోర్ధ్వజూటా! వృషాధీశఘోటా! శివా! పాపకల్లోలనీసత్ప్రదా! ఘోరసంసారదూరా! హరా! నిర్వికారా! మహాకార! కారుణ్యపాథోనిధీ! ధీనిధీ! మారభూతిప్రియా! భూతనాథా! జగన్నేత! మృత్యుంజయా! కృత్తివాసా! మహోల్లాస! పంచాననా! పంచబాణాంతకా! బాణపక్షా! విపక్షక్షయా! యక్షయా! యక్షగంధర్వవిద్యాధరానీకసంసేవ్య! భవ్యా! మహానీలభద్రేభచర్మాంబరా! తాండవాడంబరా! పాండురాటోపశుంభద్యశోభూషణా! శంకరా! శంభు! సర్వజ్ఞ! సర్వాత్మ

కా! సర్వసర్వంసహాదేవతా పారిజాతా! యతీతా! వృదాఖ్యాత! శ్రీకంఠ!లోకేశ్వరా! శాశ్వతైశ్వర్యసంపన్న! యాపన్నలోకావనా! పావనా! పాపవారాశిభుగ్బాడబా! వేదచాలన్నియు న్మాని నీబంటుగాఁ బూనిరక్షింపవేభర్గ! షత్పుణ్యమార్గా! నమస్తేనమస్తేనమః॥ ౧౪౮॥

ఉ॥ మారుతిమెట్టిరీతిఁ బలుమాఱునుసన్నుతిచేయనేనొగిన్। ధీరతనుత్సహించి, యతితీవ్రతఁడాసికపీంద్ర! మెచ్చితిం। గోరుముదేనినైననది గొబ్బుననిచ్చెద, నిర్వహించెదన్। వారకనిన్నుఁబోలు గుణవర్ధనుఁడెచ్చటనైనఁగల్గునే॥ ౧౪౯॥

వ॥ అనియనేక ప్రకారంబులమన్నించిన నతండు హర్షించి నాతోనిట్లనిమెః అయ్యా! నెయ్యంబునామీఁదఁగలదేని ప్రళయకాలంబున మీరువిశ్వరూపంబు దాల్చునెడ మీయందు నెట్టిమహిమంబు ప్రవర్తిల్లునట్టినుగ్నిరీక్షంబగు తేజంబును,విమతశిలీముఖాప్రతిహతత్వంబును,దయనొసంగుమనుడు నేనునుసమ్మతించి, యట్లకాకయని దీవించి, కైలాసంబునకువచ్చితిః;తదనంతరంబాహనుమంతుండు దనతండ్రినివాయుదేవునిందలంచెః; అతఁడును బుత్రునిమెడం బ్రసన్నుండై యసదృశజవంబును, అభేద్యసత్వంబును నొసంగిచనిమెనంత॥ ౧౫౦॥

ఉ॥ సమ్మదమందిరాముఁడొక సౌధమునందన రూపుచూడఁజి। త్తమ్మునఁగోరి,మీఱితనతమ్ములురావణుతమ్ముఁడుం బ్రమో। దమ్మునఁగొల్వ, మంత్రులుచితంబుగఁజేరిభజింప, నన్నచో। నమ్మరుతాత్మజుండటకునల్లనవచ్చివిశేషమేర్పడన్॥ ౧౫౧॥

క॥ ఈరీతివచ్చి రాఘవు। భూరిపదంబులను వ్రాలి భువి తన మూర్తిన్। వారకచూపనుజ్ఞలు। భోరునఁగొని చెలఁగి వాయుపుత్రుండచటన్॥ ౧౫౨॥

సీ॥ తనదువాలంబు మార్తాండప్రచండరథమ్మున కుగ్రకేతనముగాఁగఁ। దనమోముసత్యలోకనివాస జలజాతభవ చతురాస్యచుంబనము సేయఁ। దనపటుదీర్ఘదోర్దండ ప్రభావంబు దిగ్గజంబులనెల్ల గ్రుంగఁజేయఁ। దనబర్బరస్థూలతను మహామహిమంబు నీరజజాండంబు నిండుకొనఁగఁ। దనదు భారంబునకు మహీతలము వణఁక। భూరినక్షత్రములు

మొలపూసలుగను। బెరిగి లోకంబులకునెల్ల భీతి గదుర। విలయభైరవ
మూర్తియై వెలయుచుండె॥ ౧౫౩॥

చ॥ మఱియును వక్షమందునను మాధవుఁడున్, ముఖమందు నగ్ని
యున్,। శిరమున నిర్జరేంద్రుఁడును, జెకుఁగుల నశ్వినులున్, మహోజ్జ్వ
ల। చ్చరణతలోరుమధ్యముల సర్వనిలింపులు, సిద్ధసాధ్య కి। న్నరగరు
డోరగాదులు ఘనంబుగఁగన్పడి రొక్కపెట్టునన్॥ ౧౫౪॥

వ॥ ఇట్లపారగంభీరధీరవిస్తారశరీరుండును, అప్రతిద్వంద్వశౌర్యుం
డును, వాలప్రచండభుజాదండ సత్త్వతృణీకృతాఖిలవీరాగ్రణుండును,
దుర్నిరీక్ష్యతేజస్సంఛాదితబ్రహ్మాండకోటరుండును, చరణపరాక్రమితభు
జంగమవల్లభుండును, తీక్ష్ణరోమాగ్రచుంబితసమస్తనక్షత్రనిచయుండు
ను, నిశ్వాసప్రభవఝంఝూప్రభంజనోద్ధూత విపక్షరక్షోమేఘపటలుం
డును, నగు మహామహుని నిరీక్షింపఁజాలక సుమంత్రప్రముఖమంత్రులు
ను దక్షిణద్వారలునుందల లెత్త వెఱచి భయకంపితదేహులై యుండిరి;ల
క్ష్మణభరతశత్రుఘ్నులును దదీయమహిమాతిశయంబు గాంచి యిట్టిట్ట
నివర్ణింపనేరక నిర్విణ్ణమనస్కులై ప్రవర్తిల్లిరి; రామభద్రుండును దద
క్షుద్రరౌద్రరేఖావిశేషంబునకుఁ బరమాశ్చర్యహృదయుండై, యితని
సహాయంబున శతముఖుండునుమవచ్చు, సందియంబువలదని నిశ్చయిం
చి, అభంగకృపాపాంగంబుల నమృతంబు చిలుక నవలోకనంబు చేసి
మెల్లననిట్లనియె॥ ౧౫౫॥

ఉ॥ శాంతవిచార! వాయుసుత! శత్రుగణాంతక! మాయురే!హ
నూ। మంత! మహానుభావ! యఘమర్దన! నీదగురూపుచూడఁగా। నెం
తటివారు రాజులు, కపీశ్వర! నాకునుశంకపుట్టె, నేఁ। డింతియె చాలు
నీవిపుడ మెప్పటిరూపము మాకుఁ జూపవే॥ ౧౫౬॥

ఉ॥ నాపనివాయుజుండు నరనాథునకెప్పటిరూపుతోడుతన్। వావి
రివందనంబులిడివచ్చి విభీషణుదండనుండె; న। ద్దేవుఁడు రామచంద్రుఁ
డు నతిప్రియభాషలమాటిమాటికిం। జేవదలిర్ప సన్నుతులు సేయుచు
నుండె ననేకభంగులన్॥ ౧౫౭॥

వ॥ అంత॥ ౧౫౮॥

గీ॥ పవననందను ఘోరరూపంబుఁ జూచి। మునుపు దనుమ్రింగియుం దుచేఁ దనివిలేక। యప్పటికిఁ దన్ను మ్రింగునో యనుచు భీతి। నేగు క్రైవడి న పరాబ్ధి నిసుఁదుగ్రుంకె॥ ౧౫౯॥

గీ॥ రాఘవుఁడు తొల్లి లవణవారాశిగట్టె। నిప్పుడిది యేడఁ గట్టునో యిందు నిలువ। బాగుగాదని చని మిన్నువ్రాఁకునట్టి। చటుల బడబాగ్ని శిఖలన సంజవాడమె॥ ౧౬౦॥

గీ॥ ప్రాగ్వధూమణి దన నఖప్రకరములను। విప్పుకొప్పనఁ జీఁకటి వెల్లి విరిసెఁ। నఖల వెండియు సవరించు నట్టి సొబగు। చూచు దర్పణమన శశి దోఁచె నవుడు॥ ౧౬౧॥

గీ॥ అంతకంబెను మున్న భటాళి గొలువఁ। గొలువు చాలించి యా నృపకుంజరుండు। వెలయ సంధ్యాద్యనుష్ఠాన విధులు దీర్చి। యనిలజ విభీషణులఁ బిల్చి యాత్మగంబ॥ ౧౬౨॥

వ॥ వారునుం దానును సహోదరత్రయంబును బంక్తిం గలసి మరకతపలాశపత్రంబుల షడ్రసోపేత రుచిరాన్నంబులును, మృగపక్షిమాంసంబులును, విచిత్ర శాకంబులును, ఘృతదధిప్లుతంబుగా నానావిధంబులగు నూఱుఁగాయలతో సరుచి పరిహారంబుగా నారగించి, కర్పూర తాంబూలంబులు గైకొని తదనంతరం బా విభీషణు నవలోకించి మహాత్మా! యిట్టి సమయంబునఁ జతురంగబలంబులతో సహాయుండ వై యేతద్దుష్కర కార్యం బెల్లైనను దోఁగించి నిర్వహింపుమని యనర్ఘ మణిమయభూషణంబులు నపార దివ్యాంబరంబులు నసదృశ పరిమళంబులును దోరహత్తుగా నిచ్చి పనిచెఁ; నతండు సమ్మతించి రామచంద్రునకు నమస్కరించి లంకాపురంబునకరిగెఁ; పిదప రఘువరుండు హనుమంతు నవలోకించి, యనేక ప్రకారంబుల నాదరించి, తనకంఠంబున నొరయు దివ్యరత్నహారంబు కపివరుని గళంబున దగిలించి, నీవును లక్ష్మణుండును గిష్కింధానగరంబున కరిగి యేతద్వృత్తాంతం బంతయు సుగ్రీవున కెఱింగించి, సకలవానరసహితంబుగాఁ దోడి తెమ్మనుచు వహార్షించి, లక్ష్మణుండును వాయుజసహితుండై తత్పురంబునకరిగెఁ; మఱియును భరతశత్రుఘ్నులవి

క్షించి, మీరును కాంభోజ, మలయాళ, కర్ణాట, లాట, కిరాత, పాంచాల, సౌరాష్ట్రాది దేశంబులకుం జని యాయా రాజులఁ దోడితెండని పనిచె; తానును సీతాసమేతుండై హంసతూలికాతల్పంబునఁ దత్ప్రకారంబులు వినిపించుచు విశ్రమించెనంత॥ ౧౬౩॥

గీ॥ కాలమనుసింహమాకాశగంధగజముఁ। జేరి, తత్కుంభమధ్యంబుఁ జింపనందుఁ। దెలివిఁగన్పడు గొప్పముత్తియమనంగఁ। జొక్కమగునట్టి వేగుఁజుక్క పొడిచె॥ ౧౬౪॥

గీ॥ తారకలు డాఁగెఁ; గుక్కుటధ్వనులు మీఱెఁ;। గలువగమి జాఱెఁ; మదనునిఘనత దీఱెఁ;। గంజములు గేరెఁ; జల్లగా గాడ్పు సేరెఁ;। దీపతతులాఱెఁ; బలబల తెల్లవాఱె॥ ౧౬౫॥

గీ॥ నెమ్మి నంబరమనియెడు కమ్మరీఁడు। గరిమఁ బ్రాగ్భాగసాంధ్యరాగంబు కొలిమి। యందుఁ గ్రాఁగిన యట్టి లోహంపుముద్ద। వెడలఁజేసెనో యన రవి పొడిచెనపుడు॥ ౧౬౬॥

సీ॥ ఆవేళ రఘురాముఁ డల్లన వల్లకీమృదులస్వరంబున మేలుకాంచి,। కాలోచితక్రియల్ గ్రక్కునఁ గావించి, గురుమాతృలకు మ్రొక్కి కోర్కు లలర,। విప్రవర్గములకుఁ గర్పూరతాంబూలచేతులిచ్చి, మఱి ప్రమోదంబు గదుర। మణిభూషణంబులు మహితాంబరంబులు గైకొని సన్మంత్రిగణము గొలువ। సకలవానరరాక్షససైన్యచయము। లెప్పుడరుదెంచు? శతముఖు నెపుడు ద్రుంతు?। ననుచు సింహాసనంబున నలరి రాముఁ। డుండెఁ బేరోలగము నయనోత్సవముగ॥ ౧౬౭॥

గద్య॥ ఇదిశ్రీమచ్చేయకూర్తి నివాస, లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష సంప్రాప్తమహాకవిత్వవిద్యాపారీణ, సుమహితాంధ్రగీర్వాణభాషాప్రవీణ, సంగీతలక్షణధురీణ, సకలవిద్వన్మిత్రా, త్రేయసగోత్రపవిత్ర, ధర్మనార్యపుత్ర, నిఖిల మహీసురాశీర్వాద ప్రవర్ధమాన భాగధేయ, సకలనృపవిధేయ, వినయవిధేయ, ముద్దననామధేయ ప్రణీతంబైన

సీతావిజయంబను మహాప్రబంధంబునందుఁ

ప్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# సీ తా వి జ య ము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీకర! సద్గుణగణర। త్నాకర! కమనీయతర కృపాకర! పూ
ర్వా! భీకర తనురుచివిజితసు। ధాకర! పోచమన్నపాల! ధర్మవిశాలా!॥

వ॥ అవధరింపుమ త్తెఱంగున శాంకరీదేవికి వెండియు మహాదేవుం డి
ట్లనియె; అట్లు సకలబాంధవామాత్య పురోహిత సామంత సద్భటవిద్వ
త్కవిగాయక నాయక సంఘంబులు గొలువ నఖిలనృపసార్వభౌముండగు
రాముండు, వసిష్ఠుండు నీతివచనంబులు నితిహాసంబులు దెలుపం జేరోల
గంబుండి, శతముఖశతద్వయ దోర్దండ ఖండనాభిలాషుండై విభీషణసు
గ్రీవముఖ్య సకలసేనాగమున కాంక్షనుండెనంత॥ ౨॥

సీ॥ ఆవిభీషణుండును లంకా 'వరపురి' కేగి తనబంధుమిత్రులం దవిలి పిలిచి।
యుచటివృత్తాంతంబు లెల్ల నెఱింగించి, యిట్టివేళల ఘనమిన కులేంద్రు। స
హోదోడు గావలె, నింక జాగు సేయక యఖిలసాధనములు నమరం జేసి,। ర
థములు సవరించి, ప్రధనభీకరగంధ సింధురంబులు నేర్చి, చిత్రములకు।
మించు వేగంబు గలిగిను మేటిహయంబుల్ బోటు గత్తులం జూతు ము నీటుభ
టుల। నాయితంబులు సేయించి యతిరయమున। వరుసం దెమ్మని తగంబడ
వాళ్లం బనిచె॥ 3॥

సీ॥ సనిచితో డ్త్రోడసంపాతిని నలనీలసత్ప్రధానుల నెల్ల సరగం బిలిచి।
వేశ్వరమన్నించి దుర్వారబలులార! మీరు నాకోర్కులింపారననికి। నా
కొకకరుని వెంట నొక్కొకక్షౌహిణి కొలిచి రానరు దెండు బలిమి మె

అని। దారపుత్రభ్రాంతిఁదనరినదుర్మతుల్ రాఁకడిచ్చుట నెపరాకుగాఁకఁ। డనుచు నెంచఁగింప నమ్మంత్రులాహవమున కుత్సవంబులు గైకొని వచ్చ రించి। పరఁగఁ దమసాధనంబులు ప్రాణములుగఁ। జేసి యుద్ధపుయత్న ముల్ చేసిరపుడు॥ ౪॥

సీ॥ ఒనరని త్రైతెఁగుసయుద్ధసన్నద్ధులై కరిరథభటతురంగములు గొ లువ। నప్పుడేకైకమహాక్షౌహిణులతోడ మలయుచుఁబదుగురుమంత్రివ రులు। భేరీమృదంగగంభీరభాంకారముల్ జగతీతలము నాకసంబు నిండ। నాహవజయఘనిష్ఠురాలాపములు మీఱఁ జనుదెంచి యవ్విభీషణుని యెదు టఁ। గదలు వెసఁదాఁచి, ముసలముల్ ఘనతనూఁచి,। ప్రాసములుద్రిప్పి, పట్టి సప్రతతిఁ రొప్పి,। సాయకములేర్చి, సంగరసరణి నార్చి,। నేర్పుసూపిరి దోర్బలనిష్ఠ మెలసి॥ ౫॥

వ॥ ఇట్లనేకప్రకారంబుల హరుండును, నీలుండును, సంపాతియు, నవక్రుండును, వక్రజిహ్వుండును, శూలముఖుండును, రక్తవదనుండు ను, ఏకపదుండును, కుటిలకేశుండును, ఉలూకుండును, మహాగర్భుం డును, వికృతపార్శ్వుండును నాదిగాఁగలమంత్రులందఱు పొడచూపిన నుత్సహించి, అవ్విభీషణుండువారలనాదరించి, తానునునిజాభ్యంతర మందిరంబునకుంజని సకలబ్రహ్మరాక్షసభాషితానేకశ్రుతీతిహాసంబు లువినుచున్న తల్లికినమస్కరించి, రణప్రయాణవృత్తాంతంబంతయు వి నిపింపనక్కైకేశియు విజయుండవై మఱలిరమ్మని దీవించియక్షతలిచ్చినం గైకొని, అచటవీడ్కొని, మహాపతివ్రతాశిరోమణియగు సరమాదేవి కింజెప్పిన నప్పరమసుందరియు మందహాసంబు గావించి, దూర్వాక్షత తాంబూలనిచయంబులు దోయిటంగొనివచ్చియిచ్చి యిట్లనియె॥ ౬॥

చ॥ రమణ!దయాత్మ! నీతిగుణరత్నమ! భండనభూమియందుమీ। రమణునకున్ జయంబుగొని రమ్మనిపంప విభీషణుండొగిన్। సుమహితర త్నవిస్ఫురితషోడశచక్రసహస్రఘోటకో। త్తమశతఘంటికాయుతర థంబుముదంబునెక్కిసారెకున్॥ ౭॥

శా॥ శంఖారావము, దంతిబృంహితములున్, సర్వస్ఫుటోత్ప్రేక్ష

టా। రింఖాఘట్టనఘోష'లున్, మఱియు 'మౌర్వీనాదముల్, వేగవాత్కంఖాణోగ్రవిహేషలుం, బణవథకాక్కధ్వానముల్, ఘోరతం। బుంఖీభూతములై చెలంగెనరయన్ భూభాగమధ్యంబునన్॥ ౮॥

వ॥ ఈక్రమంబున విక్రమశీలుండైన విభీషణుండు సకలసేనా సమన్వితుండై లంకానగరంబు వెలువడి, దినదినక్రమంబున సముద్రంబును, తటాకంబులును, మహావనంబులును, పర్వతంబులును, ప్రవాహంబులును, దేశంబులును, ఘనతరగ్రామంబులును గడచి, సాకేతపురప్రాంతమునకుం జని, తనరాక రామచంద్రున కెఱింగింపఁబనిచెనంత॥ ౯॥

మ॥ దనుజుండుంజని రాముఁగాంచి 'యెలమిన్' దండంబులర్పించి యో। జననాథాగ్రణి! రామచంద్ర! భవదాజ్ఞామార్గ మెల్లం దలన్। ఘనతన్మోచి, విభీషణుండు చతురంగ ద్వాదశాక్షౌహిణుల్। దను సేవింపఁగ వచ్చి, నన్నుఁబనిచెం దద్వార్త విన్పింపఁగన్॥ ౧౦॥

ఉ॥ నావిని రామభద్రుఁడు రణప్రియమేర్పడమిన్నుముట్టిసం। భావనలిచ్చి, మంత్రులును బాంధవులుం దనుఁగొల్చిరాఁగ, భూ। 'దేవత'లెల్ల పారెకును దీవనలిచ్చుచునుండఁ, జయ్యనన్। రావణవైరియొక్క గజరాజము నెక్కి పురంబు వెల్వడెన్॥ ౧౧॥

ఉ॥ ఆరథకోటిఘోషలును నామదదంతి మహోన్నతక్రమం। బా రయనిర్జితానిలమహాశ్వసమూహ జవప్రభావిధం। బారణధుర్యసద్భట మహార్భటవృత్తియు నెల్లనొయ్యనన్। వారక చూచి మెచ్చి జయవర్ధనుఁడై ముదమందుచుండఁగన్॥ ౧౨॥

ఉ॥ తోషణుఁడున్, మనోవిగతదూషణుఁ, డుజ్జ్వలసూనృతోల్లస। ద్భాషణుఁ, డాశ్రితావనవిధానవిభూషణుఁ, డుగ్రశత్రుహృ। ద్భీషణుఁ, డార్యచర్యుఁడు, విభీషణుఁడొయ్యనవచ్చి మ్రొక్కెదు। ర్దోషవనీకుఠారునకు, దుష్టవిదారునకున్ రయంబునన్॥ ౧౩॥

వ॥ ఇట్లు పరమభక్తుండగు విభీషణుండు ప్రణమిల్లిన నల్లనఁ దనభద్రదంతావళకుంభమధ్యంబునకు రాఁదిగిచి మణిభూషణాంబరపరంపరలొసంగి గాఢాలింగనంబు గావించి, బలంబులు విడియ నొక్కబా

హ్యారమ్యప్రదేశంబుచూపించి, అచ్చటనుండ నియమించి, విభీషణునొక్క భర్మప్రాసాదంబుననునిచి, రాఘవుండారాత్రి వాసవప్రముఖత్రిదశులంబ్రార్థింప బృందారకులందఱు ప్రసన్నులై మహాత్మా! వరంబేమైన నడుగుమనిన ముదంబంది వినయంబున సురలం గనుంగొని నేఁడాదిగ శతముఖుండు మడియుటనుక సకల మనుజదనుజవనచరబలంబులకుఁ దృష్ణాహారవాంఛలు వొడమకుండ దయచేయుండనిన నట్లకాక యని దీవించి యంతర్ధానంబునొందిరి; రఘూద్వహుండును సుగ్రీవప్రముఖనిఖిలశాఖామృగంబుల రాక కెదురుచూచుచుండె నాసమయంబున॥ ౧౪॥

శా॥ దుష్కర్మక్షితిభృత్కఠోరపవి, సంతుష్టాత్ముఁ, డెల్లప్పుడున్। నిష్కౌటిల్యవిచారుఁ, డుత్తమగుణానీకుండు, శత్రుచ్ఛటా। శుష్కాగణ్యదవానలుండును, కృతస్తోముండు, సౌమిత్రి యా। కిష్కింధానగరంబు చేరువను సంక్షేమంబు మైనిల్చుచున్॥ ౧౫॥

సీ॥ అనిలజ! నీవేగి యర్కనందనుఁగాంచి యిటఁబుట్టినట్టివృత్తాంతమెల్లఁ। జెప్పి నేవచ్చుటచెప్పి రామునియాజ్ఞ చెప్పి, యీడకునతిశీఘ్రవృత్తి। సకలశాఖామృగసహితంబుగా యుద్ధసాధనములతోడ సరవిఁ దోడి। తెమ్ము, రాకుండినదిగ్గున నరుగు దెమ్మటమీఁద నాచేతనౌను గాని। యనినఁబనిపూని హనుమంతుఁడతిముదమున। నచటవీడ్కొని కిష్కింధ కరిగియచట। వానరులు దన్నెదుర్కొని వందనములు। సేయఁ బట్టణద్వారంబుఁజేరియచట॥ ౧౬॥

శా॥ ఉగ్రారాతిపయోధిబాడబుని, విద్యుత్సన్నిభాక్షున్, రణో। దగ్రున్, బాహుబలప్రతాపఘను, మార్తాండాత్మజున్, భూరిహే। మగ్రావప్రతిమానధైర్యు, రఘురామ శ్రీపదధ్యాను, నా। సుగ్రీవుం బొడఁగాంచె నంత నతఁడుంబూచె న్మరున్నందనున్॥ ౧౭॥

క॥ కనుఁగొని యెదురుగఁజనియా। హనుమంతునిఁగౌఁగిలించి యాలరుచునర్ధా। సనమున నిడితతకుశలం। బనుపమకృపనడుగ నిష్టమంతయుఁజెప్పెన్॥ ౧౮॥

సీ॥ చెప్పఁ జాలంబునఁ 'జేదోయి' గీలించి వెండియు నిట్లనె విమలమతి
ని। నాతండ్రి దశరథనందనుం డా రామభద్రుఁ డున్నాఁడె సంభ్రమ మెల
ర్పఁగ। భండనోదగ్రప్రభావుఁ డాలక్ష్మణుం డతని సేవించునే యనుదినం
బుగ। భరతశత్రుఘ్నులు ప్రమదులే? మాతల్లి జానకి కుశలినియై సరవిగను
నె? విధవలై యున్న దశరథ విభుని సతులు। కొమరులను జూచి హైమైనను
గొంతవగవు। మాని యుందురె? రాజసన్మాన్యుఁ డగుచు। నావశిష్ఠుండు
మెలఁగు నే యచటనే? యనఘ!॥ ౧౯॥

గీ॥ చూచినాఁడ వె యీలోన సొంపు గదుర। రఘుకులేంద్రుని దద్ద
రారమణు సభల। సరవిఁ బుట్టునె యవ్విభీషణుని వార్త। వేడ్కఁ దెలుపు
రె యొక్కొక వేళ మమ్ము?॥ ౨౦॥

సీ॥ నా విని చిఱునవ్వు నవ్వి సుగ్రీవుని మన్నించి యా హనుమంతుఁ డని
యె। రామాది దశరథ రాజనందన చతుష్టయము నున్నారు సంభ్రమ
ముల। సీతామహాదేవి చెన్నొంది పతిసేవ సేయుచు నున్నది సేమమునను।
గరిమఁ గౌసల్యాదికాంతలు కొడుకులు మన్నింప నున్నారు మానవతులు।
నవ్వశిష్ఠుఁడు నున్నవాఁ డతిముదమునఁ। గడు విభీషణుఁడును రాము కడనె
యున్న వాఁడు; నేను నుచటనుండి వచ్చినాఁడ। నిన్ను నెప్పుడు రఘురాముఁ
డెన్నుచుండు॥ ౨౧॥

వ॥ అనిన విని యినసుతుం డనిలజు నవలోకించి యిట్లనియె; మహా
త్మా! విభీషణుండు రామునికడ నుండుటకు నాశ్చర్యంబును భయంబునుం
బుట్టె; ఎట్టి చందంబున కరుదెంచె? ఏమి కార్యంబె తెలింగింపు మన హనుమం
తుం డిట్లనియె॥ ౨౨॥

సీ॥ రావణుకంటెఁ బరాక్రమవంతుండు శతముఖుం డనెడు రా
క్షసవరుండు। గోవిప్రదేవతాక్షోభంబు గావింప నందుకు రాఘవుండ
లిగి మునులకు నభయహస్తము లిచ్చి, యాహవంబునకు సహాయంబు రమ్మ
నియెడు గనవ్వి! భీషణుం డోడఁ బడి భీషణశౌర్యుఁడై చనియె లంకకు రి
పుల్ జలదరింప। నిన్ను రమ్మని నృపుడంప నేను లక్ష్మ। ణుండు వచ్చితిమి
టకు నుద్దండగతుల। వాఁడె సౌమిత్రి మనపురద్వారశుంభ। దుపవనం
బున నున్నాఁడు తపనతనయ!॥ ౨౩॥

ఉ॥ నావినితల్లడిల్లి దిననాయకనందనుఁ డుల్కిపాటునం। బావని
నుంచిలేచి, తనభర్మగృహంబునకేగి తారతో। నావిధమెల్లఁజెప్పి,కన
కాంబరభూషణరత్నవస్తువుల్। వావిరికానుకల్ గొనుచువచ్చెఁ బురో
పవనంబుసేరఁగన్॥ ౨౪॥

చ॥ ఇటువలె వాయుజప్రముఖులేకముగాఁ దనుఁగొల్చిరాఁగ,మి।
క్కుటమగు భక్తితో నినుసికూరిమిపట్టి రఘూద్వహానుజుం। దటుకునఁ
గాంచి,వందనశతంబొనరించి,యనేకభంగులన్। స్ఫుటమృదుభాషణం
బులను భూషణచేసి,ముదంబెలర్పఁగన్॥ ౨౫॥

ఉ॥ కానుకలిచ్చి యోదనుజఖండన! యోనరనాథచంద్ర! యో। దీ
నశరణ్య! యోవిమలతేజ! భవన్నిజభృత్యుఁడంగదున్। సేనలతోడనెద్ది
యటఁజెప్పుము వేగనొనర్తునన్నఁ, ద। ద్భానుతనూజుఁబిల్చి బహుభం
గులనాదరణంబుసేయుచున్॥ ౨౬॥

చ॥ వినుమకపీంద్ర!యొక్కయవివేకపు రాక్షసుఁడిప్పుడుట్టిస। న్ము
నులనుగోకదంబముల మూర్ఖతఁద్రుంపుచు,దేవకోటులన్। ఘనముగబా
ధపెట్టుచును, గర్వముచే నెదురెందులేక మేఁచిననదియెల్లఁదాపసులు
చెప్పిన, వారలఁగాచెవేడుకన్॥ ౨౭॥

వ॥ ఇవ్విధంబునంగాచి యమ్మహాదానవుంబరిమార్చుటకుఁ బ్రతిజ్ఞ
సేయువాఁడైపరపురుషాసాధ్యంబులగు వరంబులుపరమేష్ఠియొసంగె;
అందులకునాలుగు సముద్రంబులు దాఁటవలయునని చింతింప నందుల
కేనొయ్యనడాసి మీపంపున నేనొక్కరుండనే చతుర్దశభువనంబులుభ
స్మీకరింతు; ఒకరక్కసిఱేనికై యింతవంతనొందనేల? యనిపలికినన
లరి, యిందులకుసందియంబులేదు; అయినను బెక్కురక్కసులలోనొం
టరిగమెలంగుట తగదనివిభీషణుండలంప నతండువచ్చి తనసేనలతోఁజ
నుదెంచెదననిచనియె; ఇంతకువచ్చునో, రాగలఁడో యెఱుంగము; నే
నునుహనుమంతుండును నీతోడఁదద్వృత్తాంతంబుచెప్పి నీసహాయంబు
గొనవచ్చితి మిటమీఁద నీదిభారంబని యూరకుండె; సుగ్రీవుండును ము
దంబుననందులకు సమ్మతించి యిట్లనియె॥ ౨౮॥

శా॥ దేవా! వాఁడ నెంత? వానరచమూదీప్తప్రతాపాగ్నికిఁ। లావర్గంబెసఁగించి, దానవసముల్లాసాటవిం గాల్చి, భూ। దేవాళిం గరుణించెదన్; మదినిఁ జింతింపంగ మీ కేల? యీ। నావంటిప్రియభృత్యుఁ డుండఁగ ధరానాథాగ్రచూడామణీ!॥ ౨౯॥

సీ॥ మలయాచలంబున మాల్యవంతంబున హిమవంతమునను మహేంద్రమునను। కనకాచలంబున గంధమాదనమున నీలాద్రి నల మలయాళగిరిని। శేషాచలంబున సింధుపర్వతమున మునుమిడి యల ఋశ్యమూకమునను। వనచరవర్గముల్ ఘనతతో నున్నారు; వారి రాఁబనిచెద, వచ్చుదనుకఁ। బంచరాత్రములిచట సమ్మతినినుండుఁ। డనుచుఁ బ్రార్థింప లక్ష్మణుఁ డనుమతించి। పంపఁ డనుండెఁ బవనజప్రముఖు లలర। భానుజుండును రాఁబంచె బలము నెల్ల॥ ౩౦॥

వ॥ ఇట్లు సుగ్రీవుండు సకలకుధరగహనతటాకంబుల కడకుఁ దన భృత్యులం బనిచె; పనిచిన వారును దత్తత్ప్రదేశంబులకుం జని రాముని పదంబులమీఁద నాన వెట్టి యఖిలభల్లూకవానరనివహంబులం బిలిచి మరలఁ జనుదెంచి రంత॥ ౩౧॥

చ॥ మలయనగంబునుండి పలుమాఱును రామునిఁ బేరుకొంచు, వే। ల్వలు దశసంఖ్య దన్నుఁ గొలువంగ రణోచితఘోరవాక్యముల్। సలుపుచు, నాగ్భటంబుల దిశావలయంబులు తల్లడిల్లఁ గాఁ। జెలఁగుచు వచ్చె నప్పుడు సుషేణుఁడు, భానుసుతుండు మెచ్చఁగన్॥ ౩౨॥

ఉ॥ వాలములన్ మహాకుధరవర్గములం బెకలించి మింటికా। భీలతవైచి మళ్లనవి బెట్టుగఁ బట్టుచు, హుంకరింపుచున్। హేలిఁ బదారువెల్వల పుడెమ్మిని గొల్వఁగ గోముఖుండు, న। న్నీలుఁడుఁ గూడివచ్చి రలనీలనగంబుననుండి చెచ్చెరన్॥ ౩౩॥

ఉ॥ భర్మనగంబునుండి చలపాదికపుల్ నవలక్షగొల్వఁగా। నర్మిలి వెల్వాలైచనుచు, నప్రతిమానభుజాబలంబులన్। దుర్మదవృత్తి నార్చుచును దోయధులెల్లఁ గలంగిపొంగ, జ్యోతిర్ముఖుఁ డేగుదెంచె నతితీవ్రరయంబున రాముఁ దల్చుచున్॥ ౩౪॥

చ॥ వివిధపరాక్రమస్థితుల వెల్వలుతో మ్మిదిగొల్వ నభ్రమున్। భువి
యునునిండనార్చుచును, బొంగుచు, గంతులు వేయుచున్మహా। జవము
ననిర్జరావళులు సన్నుతిసేయ విరోధిభీములై। గవయుఁడు, గంధమా
దనుఁడు గ్రక్కునఁజేరిరి యుక్కుమీఱఁగన్॥ ౩౫॥

చ॥ శతబలియున్, గవాక్షుఁడును, శౌర్యధురంధరుఁడైన మైందుఁ
డున్। జతనముతోడఁగూడి దశసంఖ్యను వెల్వలు దమ్ముఁగొల్వ నీ। క్షితి
జములొక్కటంబెటికి చేకొనిత్రిప్పుచు, గంతులేయుచున్। మతముఁలఁ
జేరిరవ్యోడకు మాద్రిగిరీంద్రమునుండియత్తఱిన్॥ ౩౬॥

వ॥ మఱియు నదియునుంగాక మూఁడుకోట్లతో ద్వివిదుండును,
రెండర్బుదంబులతోఁ బనసుండును, ఎనుబదిసహస్రంబులతో భల్లూక
నాయకుండును, ఏడక్షౌహిణులతో ఋషభుండును, పదునొకండుప
ద్మంబులతో వేగదర్శి తారక కుముదులునుగూడి నానాపర్వతంబుల
నుండి చనుదెంచి రవిమొల్లను బండెక్రిందు వెల్వలయ్యె; కిష్కింధను,
ఋశ్యమూకంబునంగల వానరబలం బెనిమిది వెల్వలయ్యె; అన్నియును
డెబ్బదిరెండువెల్వలై పరివర్తిల్లెనంత॥ ౩౭॥

సీ॥ శతకోటిలక్షలు శైలచరావళుల్ గదిసినమొనయనఁగానుబరఁ
గు। మొనలలుపదిలక్ష లనువుగాఁ గూడిననదిలోకమున బారువనఁగనొ
ప్పు। నట్టిబారువలుసహస్రంబుమూఁగిన నదిసుహాదళమన నవసిఁజెల్లు।
దళములర్బుదమైన దానిపేరంబరసంఖ్యయందురు మంత్రిజనములెల్ల।
నట్టియంబరములు కోటినైననొక్క। వెల్వయనఁదగు నటువంటివెల్వ
లేడు। పదులు రెండును సేవించు భానుసుతుని। నట్టివెల్లను జేకూర్చె న
ద్భుతముగ॥ ౩౮॥

సీ॥ ఎచ్చోటఁజూచిన నచ్చోట నేలయూనినభంగిఁగనుపట్టి నిలుచు
వారుఁ। దమ ఘోరసింహనాదముల నక్షత్రముల్ దొరఁగ మిన్నులు
ముట్టఁబెరుఁగువారుఁ। గాలునిభాతిని వాలంబులంకించి యాలంబునకు
నసియాడువారుఁ। బర్వతంబులనిమ్మపండ్లచందంబున నఱచేతులమబంతు
లాడువారు। నుఱికిసాలమహీజముల్ పెఱికితెచ్చి। తివిరిఁబలుమాఱుబి

ఆబిఱుఁద్రిప్పవారు। నగుచుభూభాగ భూరినభోంతరాళ। మందుఁగపి
మయమైయుండెనట్టియెడను॥ ౩౯॥

సీ॥ సౌమిత్రియపుడు తచ్ఛాఖామృగాఖిలసైన్యంబుఁగని మహాశ్చర్య
మొంది। పావనిఁజూచి యోపరమపుణ్యాత్మక! ధరణిలో నీకసాధ్యం
బుగలదే। యిన్నియునొక యెత్తు, నింతటికంటె నెక్కుడునీవుగావునఁ
దోడరవలసెఁ। నెల్లి పుష్యమి యాత్ర కిదిలెస్స సుగ్రీవుఁ బయనంబు సే
యింపు రయమున మీఱ। ననుడు సుగ్రీవుఁడే తెంచెననిలజుండు। నతఁడు
మఱునాటియాత్రకు ననుమతించె। రాఘవానుజుఁడును మదిఁ బ్రమద
మందెఁ। గపులు నాడాడ విడిసిరి విపులముగను॥ ౪౦॥

సీ॥ అంతసూర్యుఁడుగ్రుంకె నపరాచలంబున; నారేయిలక్ష్మణుం
డరసిజాంబ। వంతునిరప్పించి, వింతగానాతనివలన నదీప్రభావములు,
గిరుల। మహిమంబులును, విసర్మలతరుఘనలతల్, దేవదైత్యమహాను
భావములునా,। గపులపుట్టువులును, గఠినసంగరవర్తనములును, గడు
సముద్రములతెఱఁగు,। ముష్టియుద్ధప్రకారంబు, మొనసిపెనఁగు। లాడు
విధమును, ఖడపశతాస్యగతులు,। వానిమంతు్రిలతెఱఁగును, బూనిక
లును। దెలిసికొనుచుండె నంతటఁదెల్లవాఱె॥ ౪౧॥

క॥ భానూదయకాలంబున। భానుజుఁడుప్పొంగి రామభద్రానుజు
నిం।గానంగ వచ్చియిచ్చెను।దానగజశ్రేష్ఠ మొకటితగఁగపులలరన్॥ ౪౨॥

వ॥ ఇచ్చి తానును దారాప్రముఖనిఖిలసతీనిచయంబున కెఱుంగిం
చి వారిచేననుజ్ఞలుగొని, అంగదముఖానేకపుత్రపౌత్ర మహామాత్యవ
ర్గంబులుగొలువఁ బురంబు వెడలివచ్చె; లక్ష్మణుండును భానుజదత్త మ
త్తకరటిఘంటాస్ఫాలనకరుండై జాంబవ,త్సుషేణ, కుముద, నీల, గో
ముఖ, జ్యోతిర్ముఖ, శరభ, ఋషభ, మైంద, ద్వివిద, పనస, శతబలి,
గజ, గవయ, గవాక్ష, గంధమాదన, హనుమత్ప్రభృతులుగొలువనరు
గుదెంచె; సకలదళంబులును భూచరఖేచరులై రాఁదొణంగిరంత॥ ౪౩॥

గీ॥ ధరణిదిద్దిరఁదిరిగె, భూధరములదరె,। గలఁగె సప్తాంబురా
శులు, తలఁకెబ్రిహ్మ,। 'ఘనతరా'ఖిల సకలశాఖామృగప్ర। చండదో
ర్దండభండవోద్దండగతుల॥ ౪౪॥

గీ॥ అమ్మహోత్సవంబరసి రామానుజుండు। కలిగె విభవంబు మాకు నీకతనఁ గాదె। యనినఁ, బ్రణమిల్లి నీబంటనంత పలుక। నేల? యని రవితనయుండు నేగుచుండె॥ ౪౫॥

ఉ॥ ఏపునవట్లు భానుసుతుఁ డేగి దళంబులతోడఁ దా, నయోధ్యాపుర వేష్టితక్షితిధరోపవనంబులఁ జేర, గామధా। త్రీపతి తత్తదాగమన రీతులు చారులచే నెఱింగి, యుద్దీపితచిత్తుఁడై పనిచెఁ దీవ్రతమంత్రులఁ దానెదుర్కొనన్॥ ౪౬॥

ఉ॥ ఈగతి రామచంద్రుఁడు దినేశ్వరపుత్రు నెదుర్కొనంగఁ దా। వేగనమంత్రులన్ హితులవృద్ధుల రాజులఁ బంపనుబ్బి, తా। రాగురుభోగవైభవధురంధరుఁ, డారవిపుత్రుఁడందఱన్। బాగుగ నాదరించి పతిపజ్జకు లక్ష్మణుఁ గొల్చివచ్చుచున్॥ ౪౭॥

ఉ॥ రామునిఁ, బంక్తికంధరవిరాముని, నీలపయోదకోమల। శ్యాముని, మాసిహృత్కుముదసంచయసోముని, సత్యభాషణ। స్తోముని, సార్వభౌముని, విశుద్ధసుకీర్తిగుణాభిరామునిన్। ధీమణియైన భానుజుఁడు దిగ్గనఁ గాంచి ముదంబు నెక్కొనన్॥ ౪౮॥

ఉ॥ కాంచితదీయదివ్యపదకంజయుగంబులమీఁద వ్రాలి, తా। నంచితభక్తి లేచి దనుజానుజుఁడైన విభీషణున్ దయా। సంచితవృత్తిఁ గౌఁగిటను జక్కఁగఁ బట్టి, సుమంతముఖ్యులన్। మించుగ నాదరించి, మఱి మెల్లన రామునిఁ జేరి యిట్లనెన్॥ ౪౯॥

సీ॥ ఇనకులోద్ధరణాయ, దనుజసంహరణాయ, రామాయ, తే నమో రాఘవాయ;। ప్రవిమలసుగుణాయ, ప్రణుతమౌనిగణాయ, రామాయ, తేనమో రాఘవాయ;। భువనప్రశస్తాయ, భవభయహరణాయ, రామాయ, తే నమో రాఘవాయ;। భండనోద్దండాయ, దండితవృజినాయ, రామాయ, తే నమో రాఘవాయ;। రసికజనసార్వభౌమాయ, రాఘవాయ,। రావణాటవీదహనాయ, రాఘవాయ,। రామణీయకృపాత్మనే, రాఘవాయ,। రామచంద్రాయ, తే నమో రాఘవాయ॥ ౫౦॥

వ॥ అనిమతియు బహుభంగుల వినుతింప సుగ్రీవునిఁ గుఱిచ్చి యాలింగనంబు గావించి యతండును, దానును, విభీషణుండును, లక్ష్మణుండును, సుమంతుండును, వశిష్ఠుండును వానరబలావలోకనాభిలాషులై, భేరీమృదంగ వైణిక కాహళ పణవ ఢక్కానేక శంఖ వేణు వీణాదినాదంబులు చెలంగ రథంబులెక్కి వచ్చి దక్షిణగోపురం బెక్కి రప్పుడు॥ ౫౧॥

సీ॥ ఒకకపినింగికి నుంకించిగిరివైవ, నెగసి యొక్కఁడు దాని బగులఁదన్నుఁ। నొకవానరుఁడు రవినొడయ లంఘించిన, నొక్కఁడు వాని పైనుమిసినవ్వుఁ। నొకమర్కటుఁడు చెట్లు పెకలించి తెచ్చిన, నవిపుచ్చుకొనఁ బిఁకులాడు నొకఁడు;। ఒకకోఁతి యుగలించి యొగిఁ బండ్లుచూపినఁ, గఱచునొకఁడు వానిఁ బఱచు దనుక;। నొకఁడు రాఘవ! ననుఁ బూడు మొక్కరుండ। శతముఖునిఁదుఱింతునని వచ్చుఁ జొకళించు;। దండిగానేనె యిక్కడనుండి వాని। వాలమునఁ దెత్తునని కూయవచ్చు నొకఁడు॥ ౫౨॥

సీ॥ అక్కపిచుబుకదిగ్ఘాభీలరోమముల్ నలిమీఱఁ గనుపట్టు నాచుగాఁగ। వనచరవారదుర్వారశౌర్యంబులు భాతిగాఁ గనరాని లోఁతుగాఁగ। నొగి వానరోద్దండహుంకృతిధ్వానముల్ కూఱిరాంబుచరమహాఘోషగాఁగఁ। బద్ధాప్తనందనపాఱికటాజ్ఞావిలంఘన మదిచెలియలికట్టగాఁగ। నగచరులకోపములు బడబాగ్నిగాఁగ। నవ్వు తెలుపది విపుల ఫేనంబుగాఁగ। భాసురంబగు సకలసేనాసముద్ర। మప్పుడీక్షించె రఘురాముఁ డద్భుతముగ॥ ౫౩॥

గీ॥ తనమనంబున హర్షించి యినజుఁ జూచి। కరుణమీఱంగ వెండి యుఁ గౌఁగిలించి। మెచ్చియతనికిఁ దెప్పించి యిచ్చె నొక య। మూల్యమాణిక్యహారంబు మోదమునను॥ ౫౪॥

గీ॥ ఇట్లు మన్నించి వెండియు నినజుఁ గనుచు। నేఁడి జ్యోతిర్ముఖుఁడు? నీలుఁ డేఁడి? యేఁడి। కుముదుఁ? డాగవయుఁడు నేఁడి? కమలమిత్ర। పుత్ర! వేర్వేర నెఱుఁగింపు చిత్రముగను॥ ౫౫॥

వ॥ అనిన నొయ్యనఁ దన కేల నమ్మహీపాలతనయునకుఁ గపులం జూపి సుగ్రీవుండిట్లనియె॥ ౫౬॥

క॥ బహుకపిబలములు చుట్టును। రహిమీఱఁగఁ దన్నుఁ గొలువ రాఘవ! యిమ్మై। విహితముగఁ జూచుచుండెను। మహనీయబలుండు గంధమాదనుఁడధిపా!॥ ౫౭॥

క॥ తరుచరులు గంతులిడఁగా। మఱియుచు వాలంబు పీఠముగఁ జేసి మహా। గిరిఁబోలి చలనమొందెడు। గురుతరదోర్బలుఁడు వాఁడె గోముఖుఁడు నృపా!॥ ౫౮॥

క॥ ఆర్చుచుఁ గపులాహవముఁ। జేర్చుచు నభ్రములు ముట్టఁ బెరుఁగుచుఁ గొలువం। గార్చిచ్చువోలె నడుమను। గూర్చుండినవాఁడు దేవ! కుముదుఁడు సుమీ॥ ౫౯॥

క॥ భీమారిశుష్కతరువన। ధూమధ్వజులద్రిచరపతులు దనుఁ గొలువం। బ్రేమనునున్నాఁడు రుసం। గ్రామధురంధరుఁడు వాఁడు గవయుఁడు నాథా!॥ ౬౦॥

క॥ భూతలము వణఁక తనయూరు। చేత గిరిత్రయము నేర్పుచే నువిచిరణ। ఖ్యాతివహించెను గణకన్। జ్యోతిర్ముఖుఁడల్ల వాఁడె చూడుము రమణా!॥ ౬౧॥

క॥ వాలంబాయినుపైనా। భీలంబుగఁ జాఁచి కపుల భేద్యులు గొలువన్। ఆలంబున కట్టాడెడు। నీలునిఁ గనుఁగొంటె సకలనృపలోకమణీ!॥

క॥ తనసాహసంబు గనఁబడ। ఘనసాలయుగంబు చేతఁ గదియించి శతా। స్యునిఁ జంపఁబూని నిలిచెం। బనసుండదె చూడు ధరణిపాలవరేణ్యా!॥ ౬౩॥

గీ॥ విపులదోర్బలశౌర్యులు కపులు గదిసి। నేలయీనినవిధమున నిండి కొలువ। నాహవమునకుఁ గణఁక నట్టాడఁ దొడఁగె। నాగవాక్షునిఁ జూచితే యసురదమన!॥ ౬౪॥

గీ॥ ఎపుడు సంగరమబ్బు? నాకెపుడు బాహు। దండకండూతిమాను? నుద్దండభండ। నమున నెల్లపుడు రిపుదళన బొనర్తు?। ననుచుఁ బలికెడు వాఁడు గజాఖ్యుఁడధిప!॥ ౬౫॥

గీ॥ మాను పెల్లగవె పింగళాక్షుని నిమేష। మాత్రమునఁ గూల్చె

నప్రతిమానబలుఁడు। యిపుడుమిముఁజూచి దండంబులిడఁగఁజొచ్చె। శరభుఁడదెచూడు రఘురామసార్వభౌమ!॥ ౧౬॥

గీ॥ వితతముగఁ గపులేనూఱు వేలు బలిసి। జతనమునఁ గొల్వ హేమాద్రిచందమునను। మదినిఁబొదలుచునున్నాఁడు మానవేంద్ర!। శతబలినిఁజూడు మద్దివృక్షంబుక్రింద॥ ౧౭॥

గీ॥ ఒక్కరుండనె శతముఖునుకరుణించి। రామభద్రుని మెప్పింతు రణములోన। ననుచునాభీలవాలవల్లార్పఁదొడఁగె। వాఁడె వృషభుండు చూచితే వరగుణాఢ్య!॥ ౧౮॥

వ॥ అనిమఱియును సుగ్రీవుండందఱ వేర్వేఱ నెఱింగింపుచునుండ రామచంద్రుని చరణారవిందసందర్శనకుతూహలాయత్తచిత్తులై తమతమబలంబులతో నిలిచిగాసమయంబున॥ ౧౯॥

శా॥ అభ్రశ్యామసమానదేహుఁడు, సముద్యత్కుందమందారస। చ్ఛభ్రాస్యోగ్రుఁడు, విక్రమప్రకటరక్షోగర్వవిచ్ఛేదనో। గ్రభ్రూమండలుఁ, డాహవాహితభుజాగర్వప్రహారాతిశౌ। ర్యభ్రాజిష్ణుఁడు, జాంబవంతుఁడట మోదాత్ముండు వచ్చెన్వెసన్॥ ౨౦॥

శా॥ భూషావ్యాలంకరణస్ఫుటాంగుఁడు, దయాంభోరాశి, షట్శాస్త్రసారద్భాష్యార్థజ్ఞుఁడు, శత్రుదానవమహా'భ్రవ్యూహ' వాతూలుఁ। డా। యుష్యశ్రీహసితాబ్జసంభవుఁడు, శౌర్యోగ్రుండు, రామాయణ। ప్రేష్యాత్ముండు, మరుత్సుతుండు తగనర్థిన్వచ్చె నచ్చోటికిన్॥ ౨౧॥

శా॥ చండారిప్రతిమానతేజుఁడు, మహోత్సాహుండు, యుద్ధక్రియా। పాండిత్యుం, డసమానవిక్రముఁడు, శుంభద్వాలగండూషితా। ఖండాకాశవిమండలుండు, ప్రతిపక్షప్రాకటోద్యద్భుజా। దండచ్ఛేదనసత్వుఁ, డాగవయుఁ డంతన్వచ్చె మోదాత్ముఁడై॥ ౨౨॥

శా॥ ధూర్తారాతివిశాలశుష్కవనవాతూలప్రయుక్తోగ్రసం। వర్తాభీలదవానలుండు, గిరిరాడ్వక్షుండు, రక్షోనిశా। మార్తాండుండు, ఘనుండు, నీలుఁడటుఁ బేర్మిన్వచ్చెనందందనో। యార్తత్రాణపరాయణా! రఘువరా! యంచున్మహోత్సాహుఁడై॥ ౨౩॥

శా॥ ఉద్వృత్సత్వత్వతృణీకృతాసురభటవ్యూహుండు, సితోజ్జ్వల।ద్వి
ద్యుత్సన్నిభలోచనుండు, త్రిజగద్విఖ్యాతశీలుండు, దోస్సద్యస్సంజనిత
ప్రతాపుఁడు, శతాస్యచ్ఛేదనాభీలయు। ద్ధోద్యోగంబున వచ్చె మైం
దుఁడు ముదంబొప్పన్ దొరల్ మెచ్చఁగన్॥ ౭౪॥

శా॥ గంధర్వామరకిన్నరాదు లితఁడుద్గాఢాహవోద్యద్గదా। సం
ధానప్రబలప్రవీణుఁడని యిచ్చెన్ మెచ్చ నుప్పొంగి గా। ర్వాంధుండౌ శ
తకంఠుఁజంపుటకు రౌద్రావేశుఁడై వచ్చె స। ద్గంధాంగుండగు గంధ
మాదనుఁడు వేగన్ రాఘవుంబూడఁగన్॥ ౭౫॥

శా॥ వత్సా! రమ్మని నన్నుఁబిల్చి, త్రిజగద్దైవ్యకల్యు నారాక్షసున్।
మాత్సర్యంబునఁగూల్చి రమ్మనునొకో మానాథుఁ, డట్లైన నే। నుత్సా
హంబునఁబోయి మెల్లన శతాస్యుంజంపి మెప్పింతుఁగా। హృత్సాకల్య
తనంచువచ్చె నటకున్ హేలిన్సుషేణుండొగిన్॥ ౭౬॥

వ॥ మఱియు నదియునుంగాక పేరెన్నికైన మహావనచరు లచ
టికినరుదెంచినం గాంచి హర్షించి, రాఘవుండును వారివారికిం దగుతె
ఱంగుల గనకమణిమయాంగదంబులును, దివ్యాంబరంబులును దొరహ
త్తుగానిచ్చి, హనుమజ్జాంబవంతాదులఁ గరుణాసముద్రంబుల నోలలా
డించి, బహువిధంబులమన్నించి, బలంబులనొక్క రమ్యస్థలంబున విడి
య నియమించి, సుగ్రీవాంగదుల సాకేతనగరంబున నుంచె; రాక్షస
వానరబలంబులును రామునకు దేవతలొసంగిన వరంబునం జేసి తృష్ణా
శనంబులవలన నిరపేక్షులైయుండిరి; అంతభరతశత్రుఘ్నులం గొలిచి
కాంభోజదేశాధీశుండగు నీలుండును, యవనపతియగువృషభుండును,
సౌరాష్ట్రనాయకుండగు సంవరణుండును, బర్బరనాథుండగు ప్రదీ
ప్తుండును, కాశ్మీరరమణుండగు భరతుండును, మలయాళభర్తయగు
త్రిభంగుండును, కోసలాధీశ్వరుండగు భీముండును, పాంచాలవరుండ
గు నీలకేశుండును, విదర్భపాలుండగు స్మితాస్యుండును, ద్రవిడభర్త
యగు సుధీష్టుండును, గౌళ, కర్ణాట, పుళింద, లాట, కొంకణ, చెంక
ణ, మత్స్య, గాంధారరాజులును జతురంగ బలంబులుగొలువ ద్వాద

శాక్షౌహిణులతోడ నయోధ్యానగరంబుడాసిన వారిని వేర్వేరనాదరించి, తగినవిడుదులనుండఁబంచి, తానునుమఱునాఁడు విద్వత్కవిగాయకవశిష్ఠ సకలపురోహితభూసురానేకాశీర్వాదంబు లెసంగ నుత్సవంబంది, సూర్యసిద్ధాంతులచే శుభముహూర్తంబుదెలిసి, భేరీమృదంగఢక్కాపణవశంఖాది నినాదంబులు భోరునఁగలంగ భరతాది సోదరులును, కుశలవాదిపుత్రులును, విజయాదిపౌత్రులును, సుమంతాది మంత్రులును, విభీషణాదిరాక్షసులును, హనుమత్సుగ్రీవజాంబవంతాదివానరభల్లూకప్రభువులునుగొలువ సకలమనుజదనుజవనచరసేనామధ్యంబునకరుగుదెంచి, అఖిలశాఖామృగంబులరావించి, అయిదేసివెల్వాలకు నొక్కొక్కరాజు నేర్పరింపవలెనని కుముద, గవాక్ష, నీల, గవయ, గంధమాదన, గోముఖ, జ్యోతిర్ముఖ, మైంద, ద్వివిద, పనస, ఋషభ, శరభ, నల, గజ, కేసరులను ముఖ్యవానరులకుఁ బదునేగురికిఁ బట్టంబులుగట్టి, వారికెల్లయుద్ధసమయంబుదెలుప జాంబవంతునినియోగించి, యుందఱుఁగాపాడుమని హనుమంతునిఁబ్రతిష్ఠించి, అమ్మహాసేనకుదండనాయకునిగా సుగ్రీవునభిషిక్తుంజేసి పట్టంబుగట్టి, యువరాజపట్టంబున కంగదుంబాటించి, అందఱనొక్కపోఁజుగాఁజేసి, అమ్మహావ్యూహంబునకుఁ జుట్టును రాక్షసద్వాదశాక్షౌహిణులనుండ నాజ్ఞాపించి, సకలదేశాధిపచమూసముదయంబు నవలోకించి, తద్బలంబు మూఁడుమొనలుగా నేర్పరించి, అమ్మూఁడింటికి భరతశత్రుఘ్న లక్ష్మణుల నధిపతులుగా సమకట్టి వారికిబాసటగాఁ బుత్రపౌత్రాదులనిలిపి, వారికిఁదోడుగానుత్తమతురంగ సహస్రంబులనేర్చి, వానికిఁబ్రాపుగా గంధదంతావళంబులంబూన్చి, వానికిసహాయంబుగా రథసముదయంబును నిలిపి, వానికింగావలిగా భటసముదయంబులనియమించి మఱియును॥ ౭౭॥

క॥ మానవవానరదానవ। సేనలనడిపింప నాసుషేణునిఁ, దేజో।
భానుని, ధైర్యస్థైర్యని। ధానునిరావించియతనిఁ దగ మన్నించెన్॥ ౭౮॥

క॥ మన్నించి రాఘవేశ్వరుఁ। డన్నిదళంబులకుఁదత్తదధినాథులకున్।
ఎన్నఁబతిత్వముమీఱఁగఁ। బన్నుగసురలలరఁబట్టభద్రుండయ్యెన్॥ ౭౯॥

క॥ అప్పుడు సంతోషంబునఁ। గుప్పలుగొనఁ గుసుమవృష్టి గురిసిరి సురలుం। జప్పుడుగ మొఱసె భేరులు। తప్పక కాహళులు శంఖతతులవిమ్రోసెన్॥ ౯౦॥

సీ॥ అమ్మహారవముచే నాకాశమల్లాడెఁ; బ్రహ్మాండమటు పట పటనఁ బగిలెఁ;। నమ్మహాభరమునకహిరాయఁడోర్వక తలవంచుకొనె రసాతలమునందు;। నమ్మహాభీషణం బరసి మైసగముగా శివుఁడును జాలిఁ గృశింపఁ దొడఁగెఁ;। నమ్మహాఘాటికి నఖిలదిగ్గజములు మొనదప్పి యొక్కొక్క మూలదాఁగెఁ;। గాలమరయుచునుండెఁ బంకజభవుండు,। తలఁకి యప్పుడు మృత్యువు తల్లడిల్లె;। వారినిధులెల్లఁ బిండలివండులయ్యె;। నస్తగిరిశృంగమున వ్రాలెనంతనినుఁడు॥ ౯౧॥

సీ॥ ఉర్వీశ్వరుఁడును గాలోచితకృత్యముల్ సలిపి సంగరమహోత్సాహమునను। బంతంబుతో జాంబవంతుని రప్పించి 'తగవాని' వలనఁ బ్రతాపలంక। కరిగెడు మార్గంబు, నమ్మార్గమునఁగల మహిమంబులును, హనుమంతు తెఱఁగు,। నతని లావునఁ జతురబ్ధిలంఘన మొనరింపవచ్చుటయును, సొంపుమీఱఁ। దెలిసి యమ్మహామహు విడిదికిని బనిచెఁ। దమరు నంతట సీతాగృహమునకేగి। యచటఁ దమ్ములు దానును నారగించి। విడియములు చేసి యసదృశవిభవములను॥ ౯౨॥

వ॥ తదనంతరంబ తమగురుండగు వసిష్ఠుని రావించి, అతండును, దానును, సహోదరులును, శతకంఠునిఁ దృణీకరించు వనచరవ్యూహమహిమంబులును, రాక్షసబల పరాక్రమంబులును, సకల దేశాధీశుల ప్రతాపంబులును వక్కాణించుచునుండ నాసమయంబున సీతామహాదేవి తనజీవితేశ్వరుండగు రఘునాయకుని పలుకులఁ గరుణారసంబులొలుకఁ గడకంట నవలోకించి మృదు మధుర వచనంబుల మెల్లన నిట్లనియె॥ ౯౩॥

సీ॥ ప్రాణవల్లభ! మున్ను బంక్తికంధరుతోడఁ బోరునప్పటి భవద్భూరిబాహు। బలపరాక్రమములు, బాణసంధాన చాతురియును, దదుపసంహరణములును,। రథగతిక్రమము, సారథిచమత్కృతియును, సు

త్త్రరపరిత్యక్తరోన్నతియును। గడు చిత్రమని చెప్పఁగా విని యిఁకమీరు వెలయఁగ యుద్ధంబు సలుపునపుడు। చూడఁగాఁగోరిన ప్రాక రక్షోగ ణేంద్రుఁడు। డెప్పుడు వయించునోయని యెదురుచూతుఁ। గావ్యమెల్లనుఫ లియింపఁగలిగె నేఁడు। మీజయముఁగాంతుననుఁగొనియాజికరుగ॥ ౮౪॥

ఉ॥ పూనిశితాస్త్రుఁడున్, యమునిపోలికమీరును సంగరంబులో। నేనుఁగుతోడ నేనుఁగు, మృగేంద్రముతోడమృగేంద్రమున్, దవో। గ్రానలమున్దవానలము, నద్రియునద్రియు ఢాయునైవడిన్। సేనలలోనఁబో రెడివిశేషముచూచెదఁ జిత్తగింపవే॥ ౮౫॥

చ॥ అనవరతంబుశోభన గృహంబునకున్, మఘమాచరించుచుండా। వు నకును, సద్వ్రతంబులను బొందుగసల్పెడిసీమకున్, శ్రుతుల్। వినఁజనుచో టికిన్, సకలవిశ్వభయప్రదయుద్ధభూమికిన్। వనితలతోడఁగూడి చనవ చ్చుటయుంగవె పార్థివనాయకా!॥ ౮౬॥

చ॥ అనవిని రాఘవుండు హృదయంబున నద్భుతమందియంది, యీ। వనజదళాక్షి కీకలహవాంఛజనించుటకేమి హేతువో। వినుమవియెన్నఁ డిట్టి యవివేకపు యాత్రకు సమ్మతింప ది। ట్లనుకొననేల? దైవకృతమం తయుఁదప్పునె యెన్నిభంగులన్॥ ౮౭॥

వ॥ అనియిట్లు డోలాయమానమానసుండై వెండియు నిజాంగనం గాంచి తదీయశరీరసంజనిత తేజోవిశేషంబు మధ్యాహ్నమార్తాండ మండలంబును ధిక్కరించి సకలబ్రహ్మాండంబులు పిక్కటిల్లఁ దన కన్ను గవకు మిఱుమిట్లుగొలుపఁ దలయూఁచి, యిట్టిసహాయంబున శతకం ఠునిఁదృణలీల సాధింపవచ్చునని వెండియు జానకి నిజాకారంబు వీక్షిం చి లోకంబులఁగలుగు రాజకుమారికాజనంబుల యట్లు భావింపుచు మ నుజవేషుండుగావున నమ్మహామహిమావిశేషంబులు తెలియనలవిగాక భరత శత్రుఘ్న లక్ష్మణుల మొగంబులుచూచి వారును వశిష్ఠుండును వి నుచుండ సీతామహాదేవికిట్లనియె॥ ౮౮॥

సీ॥ చిలుకపల్కులువిని యుబుకు కోమలివి మర్త్యమతార్భటంబులు వినఁగఁగలవె?। ఎమరెవ్వరాడిన మదిఁ గుందు సుగుణవు ప్రత్యర్థిభావ

లు పడఁగఁగలవె? వెన్నెలకాకకు వెఱచెడి యబల వత్యుగ్రబాణాగ్ని కినోర్వఁగలవె? స్ఫటికంపుసోపానపంక్తులనొంటిమై నిలలేవు రథము పై నిలువఁగలవె? ఏలపలికితి, వీబుద్ధి యెట్లుపుట్టెఁ? గలహగతులేడ? నీవేడ? గమనమేడ? శతముఖుఁజంపి వానిదేశమునఁగలుగు వస్తువు లు నీకుఁ గొనితెత్తు వలవదుడుగు॥ ౮౯॥

సీ॥ ఆరూఢమధురవీణారవంబులుగావు ప్రతిభటాభీలహుంకృతు లుగాని। కళ్యాణసమయసత్కాంతావ్రజముగాదు భయదరాక్షసక దంబములుగాని। కొలఁదివాసించు కుంకుమగంధమదిగాదు మఱి రక్త జంబాలమయముగాని। పర్యంకమల్లికాప్రసవమార్గము గాదు చండభ ల్లపరిపంచంబుగాని। తలఁపసుఖకేళిగాదు యుద్ధంబుగాని। మురియుట లుగావు ఘనమృత్యుముఖముగాని। నాతి! మున్నిట్లు చని మోసపోతిఁ గాదె। రాకకూడదు వికచనాళీకనయన!॥ ౯౦॥

సీ॥ నావినీతనమాట నాథుఁడనుగ్రహించుటయు లేకున్న నించుకత లంకి। బాష్పారుణితనేత్రపద్మమై మోమఱవాంచి యల్లననేల వ్రాసి కొనుచుఁ। బతిమోముచూచుచుఁబటుకుచోపరిదివ్యచేలాంచలము గండ సీమనొత్తి। పలుకుదునోయని పలికినఁ దా మళ్లి పలుకునోపలకఁడో యను లుకననుచు। భయము,భక్తియు,నుద్దండభండనప్ర। యాణవాంఛయుఁ దనహృదయమునఁబెనఁగ। నావసిష్ఠుఁడు మఱఁదులునతిముదమున। వి నఁగఁ గ్రమ్మఱఁబలికెనవ్విభునితోడ॥ ౯౧॥

గీ॥ ధరణినాయక! వినవయ్య తావకీయ। మహితభుజ పర్వతంబుల మఱువునందు। నిలిచిచూచెదఁబోరుమీనేర్పునేను। సమరయాత్రకు భం గంబుసలుపఁదగునె?॥ ౯౨॥

వ॥ అనిమఱియునసేక ప్రకారంబుల జనవరునిమనసు రంజిల్లంజే సి పదంబులం బడిన లేవనెత్తి రఘువరుండు నిజగురు ముఖావలోకనం బుగావించి యిందుకేయ్యది తెఱంగన్న సకలవిద్యాగరిష్ఠుండగు వశి ష్ఠుండు నిజతపోమహిమంబువలన భూతభవిష్యద్వర్తమాన ప్రవర్తనం బుల తెఱఁగు లెఱుంగుం గావున జానకీప్రభావంబు దెలిసి, యమ్మహాశక్తి

వలన శతకంఠుని మరణంబును, రామునిజయంబును నిశ్చయంబుచేసి
యేకాంతంబుననిట్లనియె॥ ౯౩॥

గీ॥ రామ! మీరామ గోరెడి రాక కనుము। తించి చనుమావధూటి
యేతెంచినపుడె। యమ్మహామూర్తి వలన శతాస్యుఁడీల్గు । జయము చే
కూఱు మీకును సత్యముగను॥ ౯౪॥

మ॥ అదియెట్లన్నఁ దదీయదైత్యవరుఁడాయబ్జాసనుంగూర్చి సాం।
ద్రాదవన్ ఘోరతపంబుచేసి, మఱిబాగొప్పంగ మెప్పించి, సా। రదయా!
శాంతవిచార! నాకుఁబురుషప్రాయంబుచేఁ జావులే। దదిసత్యంబుగ ని
ష్మటందును వరంబాభీలతం గైకొనెన్॥ ౯౫॥

ఉ॥ కాన నభేద్యుఁడైన శతకంఠుఁడు జానకిచే నణంగునుఁ। గాని
మఱ్ఱాండుశౌర్యులనుగైకొనఁ; డంగనచేతఁజచ్చుటల్। మానవనాథ! సి
ద్ధమది; మావచనంబులు కల్లగావు సు। మ్మానలినాక్షిఁదోడుకొని యా
హవభూమికిఁ బోవు టొప్పగున్॥ ౯౬॥

సీ॥ ఏతల్లి దాసదాసీతతుల్ బ్రహ్మసదాశివ విష్ణులుఁ దత్సుతులును।
పరఁగ నేతరుణి నివాళిపళ్లెరములు బంధుర కైరవపద్మహితులు। ఏయ
మ్మబోనవుటిండ్లనఁజెలువొందఁ దలపోయఁగా సప్తజలనిధులును। ఏమ
హాశక్తికి నెల్లబ్రహ్మాండంబు లనవరతంబును నాటపట్లు। ఒనర నేసతి
యార్పుల నుదయమైరి। మూడుమూర్తులు, నీజగన్మాలమెద్ది। యప్ప
రంజ్యోతి సీతగా నాత్మఁ దలఁపు। కేవలాంగనగాఁ జూడకీవు నృపతి!॥ ౯౭॥

వ॥ ఈపరమరహస్యంబు బాహ్యంబుగాకుండ నీచిత్తమందునునిచి
సీతాసమేతుండవై యుద్ధంబునకరిగి శతకంఠునిం బరిమార్చి గొబ్బున
మరలి రమ్మని యాశీర్వదించి వెండియు వసిష్ఠుండు రామచంద్రున
కిట్లనియె॥ ౯౮॥

గీ॥ అంతఫల్గునియెల్లిదినాంతమైనఁ। గమలమిత్రుఁడు గగనమధ్య
మునఁగదియ। జైత్రయాత్రకు నప్పుడే చనఁగవలయు । మనసు రంజిల్ల
మాకును జనవరేణ్య!॥ ౯౯॥

గీ॥ ఆర్తరక్షక! యిట్టిమహార్తమందుఁ । గదలి శతకంఠుఁ బరి

మూర్పకదనమునను। అస్త్రశస్త్రాధిపతుల నీయాత్మఁదలఁపు । సేననెల్లను బురికొల్పు మానవేంద్ర!॥ ౧౦౦॥

వ॥ అనినవిని రామచంద్రుండును సాంద్రతరాశ్చర్య మానసుండై జానకీప్రయాణంబునకు సమ్మతించి సంభ్రమింపుచునుండె; వశిష్ఠుండును గృహంబున కరిగె; తమ్ములును మిత్రులును దమతమ విడుదులకుం జనిరి; రఘునాయకుండును సుఖనిద్రం జెందె; అంత నుషఃకాలంబున మంగళపాఠకులరుదెంచి వీణానాదంబుల నింపుసొంపుగా భూపాల, దేశాక్షి, దేవగాంధారి, మలహరి, నారాయణి, వసంతాదిరాగంబుల ననురాగంబు గావించి, వాసమిత్రంబులు, నయనంబులు, కాలంబులును, లఘుముఖడోలాదివితానంబులును, లవుర సౌరవ రవంబులును, మధుర మందర మధ్యమ తారకంబులును, రాయిస్థాయిరవంబులును, సరిగమపధనిసాది స్వరభేదంబులును, కళికో, త్రికళిక, జంపె, మట్టిమ, అటతాళ, ఏకతాళ, త్రిపుట, రూపక ముఖానేక తాళంబులును దెలిపి యిట్లనిరి॥ ౧౦౧॥

సీ॥ సమరతలోత్సాహ! జయగుణసందోహ! మేఘకోమలదేహ మేలుకొనుము;। మునిజనవనచైత్ర! వనరుహదళనేత్ర! మిత్రవంశపవిత్ర! మేలుకొనుము;। దళితశంకరచాప! కలితజయాటోప! మృదుభాషణకలాప! మేలుకొనుము;। వితతశుభాచార! విమతరాడ్గజవార మృగనాయకకిశోర! మేలుకొనుము;। అనుచు రావణకుంభకర్ణాదిదైత్య। సంహృతిస్తవగీతముల్ సలుపఁగలరి। భానువంశుండు తనముఖపద్మమలర। మేలుదేరంగ నొయ్యన మేలుకొనియె॥ ౧౦౨॥

శా॥ ఈరీతింపగ మేలుకాంచి, వసుధాధీశుండు కాలోచితా। చారంబుల్ గడతేర్చి, భూసురనమస్కారంబులుం జేసి, త। త్కారుణ్యాంబున దీవెనల్ గొనుచు సంగ్రామప్రయత్నంబునన్। భూరిప్రస్ఫుటసత్కిరీటముచటం బూనెన్ముదంబొప్పఁగన్॥ ౧౦౩॥

క॥ అన్నరవరుని శిరంబునఁ। జెన్నలరెఁ గిరీటమపుడు జిగిమించుచుఁ బూ। రోన్నతగిరిశిఖరంబున। సన్నిహితపతాకికఁబోలెఁ జర్చింపంగన్॥ ౧౦౪॥

వ॥ అదియునుగాక మఱియు ననేకచిత్రమణిభూషణపరంపరలు, దివ్యాంబరంబులుధరియించినంగనుంగొని సీతామహాదేవితనపతివ్రతాధర్మంబే భూషణంబుగాని కొండొకయలంకారంబులుగలవేయని సమరప్రయాణప్రయత్నంబుననుండెనంత॥ ౧౦౫॥

గీ॥ దేవభూదేవతతులు నుతింప, యాత్ర। కావశిష్ఠుండు నిదిసమయంబనంగ। బరగ రాక్షసలోకగర్భములువగుల। నప్పుడు చఱపించె జైత్రప్రయాణభేరి॥ ౧౦౬॥

మహాస్రగ్ధర॥ అదరెన్ బ్రహ్మాండభాండం; బరుదుగ జలనంబుం దెసప్తాంబురాశుల్;। చెదరెన్నక్షత్రసంఘుల్ జిగిబిగిc; బరమేష్ఠిన్భయంబందెనాత్మన్;। బెదరెన్ దిగ్దానదంతుల్; బిఱబిఱc దిరిగెన్ భీషణంబై కులాద్రుల్;। వదలెం గాలుండు జీవవ్రజములc గెడపన్ వచ్చె నిర్యాణమంచున్॥ ౧౦౭॥

క॥ తదనంతరమున రాఘవుc। డాదవినమోదమున శుభముహూర్తముతోడన్। సుదతియుc దానును గడు నె। మ్మదిc జేసెను దల్లులకు నమస్కారణంబుల్॥ ౧౦౮॥

క॥ చేసినcగొడుకును గోడలిc। గోసలరాజేంద్రతనయకుశలతమెఱయన్। భాసిల్లుచు దీవింపcగ। నాసుదతుల వీడుకొని రయంబున వెడలెన్॥ ౧౦౯॥

క॥ భరతశతుఘ్నులక్ష్మణు। లరుదుగ దీవింప వెడలి రగ్రజుతోడం। గరమొప్పc బుత్రపౌత్రులు। నరిగిరి రయమునc గనత్సురాధిపులలరన్॥ ౧౧౦॥

వ॥ ఇవ్విధంబునc బుత్రపౌత్రనిచయంబును, సకలబంధునివహంబును దనతోడ నడువ నంతఃపురంబు దా నభిజిన్ముహూర్తంబున వెడలి, సుమంత్రాదిమంత్రులనయోధ్యాపుర పరిపాలనంబునకు నియోగించి, పురుషమధ్యంబునం జనుసమయంబున॥ ౧౧౧॥

సీ॥ శ్రీరస్తు భూపాలశేఖరా! యని సర్వగీర్వాణజనము లాశీర్వదింప। శుభమస్తుసౌజన్యచూడామణీ! యటంచు విప్రవర్గములు దీవింప

చుండ। నెలమినసహస్రగ్రహైకాదశస్థానఫలమున్ననుచు జ్యోతిషులు చెలం
గ। నభ్యుదయపరంపరాభివృద్ధిగఁ గవీశ్వరులు గవిత్వలక్షణముఁ దెలు
పఁ। గాంతలభ్రింకషోజ్జ్వలకలితభర్మ । హర్మ్యరమ్యాగ్రముల నెక్కి
యలరుకొనుచు। నగుచు దూర్వాక్షతప్రసూనములుచల్లఁ। బూర్ణకుం
భద్వయంబును బూగడఁగనుచు॥౧౧౨॥

ఉ॥ హాటకకేతనంబును, జయప్రదషోడశరత్నచక్రముల్,। కోటి
మహోగ్రఘంటికలు, ఘోరశరాసనతూణయుగ్మముల్, । హాటకమై
నసారథియు, నద్భుతవర్మ భయంకరస్ఫురద్। ఘోటసహస్రముంగల య
కుంఠితదివ్యరథంబుఁ గన్గొనెన్॥ ౧౧౩॥

చ॥ కనుఁగొనిఘంటికాపణవకాహళభేరిమృదంగవాద్యముల్। వన
ధిపరీత భూస్థలి నవక్రత నిండుచు భోరుగొల్పఁగాఁ। దనగురుఁడా వశి
ష్ఠుఁడు ముదంబున మున్నెయనుగ్రహింప న। య్యినకులనాథుఁడెక్కెఁ
దనయింతియుఁ దాను సురాళిమెచ్చఁగన్॥ ౧౧౪॥

గీ॥ రాజదేవేంద్రుఁడైనట్టి రాఘవుండు। రథముమీదను జూపట్టె
రమణితోడఁ। ద్రిపురములుగూల్ప నసదృశతేజమునను । గౌరితోఁగూడి
చనెడి శ్రీకంఠుఁడనఁగ॥ ౧౧౫॥

వ॥ ఆసమయంబున॥ ౧౧౬॥

శా॥ మేఘాభాంగుఁడు, కార్యవేది, దళితామిత్రుండు, యుద్ధక్రి
యా। శ్లాఘాయుక్తుఁడు, సత్కృపాకరుఁడు, సౌజన్యుండు, బ్రహ్మాండ
భాం। డాఘాతప్రతిమానతీక్షణతరోద్యద్బాణుఁ, డాఖండితా । ఘౌ
ఘుఁ, డాభరతుండు దాడివెడలెన్ హాళిన్ ముదంబొప్పఁగన్॥ ౧౧౭॥

శా॥ సుత్రామప్రతిమానవైభవసుఖస్తోముండు, భాస్వన్మహాగ్రా
త్రుం, డాశుగపూర్ణతూణధరుఁ, డుగ్రద్వేషిసంహారక । క్షాత్రప్రా
భవుఁ, డప్రతిద్వయుఁడు, సంగ్రామప్రచండుండు, త। చ్ఛత్రుఘ్నుం
డును వేడుకన్వెడలె నిచ్చన్ రాముఁడప్పొంగఁగన్॥ ౧౧౮॥

మ॥ పుడమిట్టట్టుచలింప, దిక్కరిచయంబుల్ మ్రొగ్గ, నొక్కమ్మ
డిన్। జలధివ్రాతములింక, భీషణధనుర్జ్యాఘోష గావింపుచుం । బిడు

గుల్వాలినబాణముల్ గలిగి యాభీలప్రతాపంబుతో। వెడలెన్ లక్ష్మణుఁ
డల్లనల్లన సురల్ వేడ్కఁ నందనుంజూడఁగన్॥ ౧౧౯॥

సీ॥ తమతండ్రులట్టుల తమకంబు శౌర్యంబుఁ గలిగి వర్ధిల్లెడి ఘను
లువీరు। వాల్మీకిదత్తదుర్వారబాణౌఘయశరధులు గలిగిన జయులు వీ
రు। సీతావధూగర్భసింధుసంభవములై మహిమీఁదఁ గనుపట్టు మణు
లువీరు। శతకంఠవరచమూసముదయంబులఁ జంపఁ దొడరినయట్టి మృ
త్యువులువీరు। చూడుఁడని నిర్జరులు కడు చోద్యమందఁ। దల్లిదండ్రులు
ముదమందఁ దామదంతి। యుగముపైనెక్కి వెడలి రత్యుగ్రులగుచుఁ।
గుశుఁడు, లవుఁడును రిపుగజాంకుశములనఁగ॥ ౧౨౦॥

గీ॥ తాతరాముండు ముదమందఁ, దండ్రి కుశుఁడు। గారవంబున
సెలవులఁబాఱనవ్వ। డంబుగానొక్క యుత్తమాశ్వంబునెక్కి। వెడలె
విజయుండు రౌద్రుఁడై మృదానికరణి॥ ౧౨౧॥

వ॥ ఇవ్విధంబున రాజపరమేశ్వరుండును, పరమేశ్వరకాంతాస్మ
రణకారణశరీరప్రకాశుండును, శరీరప్రకాశనిర్జితకోటిసూర్యుండు
ను, సూర్యాస్త్రవభుజపరాక్రమవంతుండునునగు రామచంద్రుండుసాం
ద్రకళామహిమంబునఁ బూర్ణిమాచంద్రుని ధిక్కరించుచు సకలసన్నా
హంబునఁ బట్టణమధ్యంబునంగదలునప్పుడు కోమలమేఘంబు కఱంగట
భాస్వత్తటిల్లతయునుంబోలెఁ జెలంగుచున్న జానకీదేవి నీక్షించి మిం
చిన మోదంబున నప్పురపురంధ్రిజనంబులు గుంపులుగూడి యొండొరుల
మొగంబులు గనుంగొనుచునిట్లనిరి॥ ౧౨౨॥

గీ॥ పొలఁతి కుచయుగళంబుతోఁ బోరుటకును। గాదెచక్కని సౌ
వర్ణకలశతతులు। నొక్కలై, చిక్కపడి, చాలఁదుక్కబట్టి। సుత్తెపె
ట్లకు లోనయ్యెఁ జోద్యముగను॥ ౧౨౩॥

గీ॥ మధ్యమకేసరికిఁ దగు మధ్యమంబు। పిరుదు పులినంబునకు గ
ట్టి బిరుదుచూడఁ। బదములంబుజములకు నాస్పదములగును। రామసౌం
దర్యవిభవాభిరామగాదె॥ ౧౨౪॥

గీ॥ లోచనభ్రాన్తనద్వయలోలమధ్య। కైతవములు వహించుచుఁ

గలితసింహ। కుంభమిథునధనుర్మీనకులములిప్పుడు। కన్యయలదుండుటా
శ్చర్యకరముగాదె॥ ౧౨౫॥

వ॥ ఇట్లుపురసతులభినుతింప రామభద్రుండుసంభ్రమంబునఁబ్రొద్దు
గ్రుంకునంతకు సాకేతపట్టణప్రాకారద్వారంబులు గడచి, కరదీపికా
సహస్రంబులతో సకలరాక్షసవనచరమనుజసేనామధ్యంబునకరిగి య
చట విభీషణకల్పితంబైన పటకుటీరంబున విడిసె; భరతశత్రుఘ్నలక్ష్మ
ణులును, కుశలవాదితనయులును, విజయాదిపౌత్రులును దనచుట్టును
విడిసిరి; వారికింబ్రాపుగా ద్వాదశాక్షౌహిణులతో దేశాధిపులుండిరి;
వారికి రక్షకుండై సుగ్రీవుండు డెబ్బదిరెండు వెల్వలతోఁ బరివేష్టించి
యుండె; తద్బలంబునకు వలయాకారంబుగా విభీషణుండు తనసేనల
తోఁ గాపయ్యె; అన్నిబలంబులకు హనుమంతుఁడాదరువై తద్బలంబు
నకు, రసాతలంబును నక్షత్రమండలంబును ముట్ట నాభీలంబుగా వాలం
బువెంచి వాటంబుగాఁ గోటఁజేసి ద్వారప్రదేశంబున మృత్యువుంబో
లి కడంగియుండె; అఖిలజీవంబులును దమతమ మనుకుఁజేరె; అవ్వే
ళ భేరీమృదంగాది తూర్యఘోషంబులును, ఉభయబల సింహనాదంబు
లును, సమస్తహయహేషారవంబులును, గంధసింధురబృంహితధ్వా
నంబులును, రథనేమినిష్ఠురస్వనంబులును, భల్లూకఘుర్ఘురధ్వనులును,
కార్ముకగుణటంకారంబులును బుంఖానుపుంఖంబులై యొకటఁ పెట్టున
నఖిలబ్రహ్మాండకోటరంబులు ఘుమఘుమాయమానంబులుగా నిండి విల
యకాలంబున బడబానలముఖంబులకు నులికి మొలపెట్టు సప్తార్ణవం
బుల ననుకరించె; అది ప్రళయసమయంబునుంబోలె విభీషణప్రగల్భం
బై, సంగ్రామవర్తనంబునుంబోలె శత్రుఘ్నప్రశస్తంబై, నాట్యంబు
నుంబోలె భరతకలితంబై, పవిత్రస్థలంబునుంబోలెఁగుశాభిరామంబై,
భారతరణంబునుంబోలె విజయప్రసిద్ధికరంబై, సరోవరంబునుంబోలె
నీలకుముదసంశోభితంబై, శృంగారవనంబునుంబోలెఁ బాటలపనసరం
భాలంకారంబై, అలకానగరంబునుం బోలె సకలరాజసంచయంబై
యుండెనంత॥ ౧౨౬॥

సీ॥ బలువిడిఁ దమ్ముల నలరించు రసికుండు, మూడుమూర్తులకును

మూలదుంప,। ఘనులచే నర్ఘ్యములఁ గొనెడి మహాత్ముండు, నెట్టన దీప్తులపుట్టినిల్లు,। ఎన్నంగ సమవర్తిఁ గన్న జగత్కర్త, చక్రరక్షణములు సలుపురాజు,। సతతప్రసన్న దీక్షాగుణాఢ్యుండు, విప్రనమస్కరణప్రియుండు,। శ్రీరఘూద్వహు నిజవంశకారణుండు,। భూజనంబుల రక్షించు పుణ్యమూర్తి,। నిరుపమ ధ్వాంత శుష్కవనీదవాగ్ని,। అర్కుఁ డుదయించె నరుణసంపదరుఁ డగుచు॥ ౧౨౬॥

వ॥ అంతకుమున్నె రాముండు సంధ్యాదిక్రియలు దీర్చి, గంధమాల్యాంబరాభరణంబులు ధరించి, విభీషణ సుగ్రీవాంగద హనుమత్ప్రభృతుల రావించి, వారివారికిందగినకట్నంబులును భూషణంబులును ముదంబున నొసంగి, యుగ్గాగ్నేయముహూర్తంబున సేనల నడువ నియోగింపుండని సుషేణునింబిలిచి మన్నించి మార్గంబు సూపనియమించి, తన తమ్ముల నవలోకించి కుశలవవిజయులును మీరును సకలనృపతులంగదలింపుఁడనిన నమస్కరించి తమతమబలంబులకుం జాటింప వారును, కరవాల ముసల ముద్గర పట్టిస ప్రాస త్రిశూల గదా పరిఘ భిండివాల కఠార ఛురార కఠోర ధనుర్బాణంబులు గైకొని నీల, నల, హార, సంపాతి, అవక్ర, వక్రజిహ్వ, శూలముఖ, రక్తవదన, ఏకపద, కుటిలకేశ, ఉలూఖ, మహాగర్భ, వికృతపార్శ్వాదులగు రాక్షసులును, గవయ, గంధమాదన, గోముఖ, జ్యోతిర్ముఖ, పనస, నల, నీల, అంగద, వేగదర్శి, గవాక్ష, మైంద, ద్వివిద, జాంబవదాది మహాకపినాయకులును, నీల, యవన, పృథు, సంవరణ, ప్రదీప్త, భరత, త్రిభంగ, భీమ, నీలకేశ, సుధీష్ట, స్మితాస్యప్రముఖ నిఖిల దేశాధిపతులును, గజ హయాందోళన స్యందన బృందంబుల నెక్కి, తమతమ వెంట చతురంగబలంబులు గొలువ, ఛత్రచామరాది నానాలాంఛనంబులు మెఱయ, భేరీమృదంగ శంఖపణవాద్యనేకవాద్యంబులు మొరయ, నేలయీనిన తెఱంగున భూమియందును, వియత్తలంబునందును, పర్వతంబులయందును, తటాకంబులయందును, దిక్కులయందును బట్టుచాలక నెనుబది యోజనంబులపొడవును, నంతియ వెడల్పును గలిగి నిరంతరంబుగా నఖిలబలంబులు నడువం జొచ్చెఁ; భరత శత్రుఘ్న లక్ష్మణ కుశలవ విజయా

దులును, విభీషణ సుగ్రీవాంగదులు నలువదిసహస్రంబులతో రామచంద్రునిఁ బరివేష్టించియుండిరంత॥ ౧౨౮॥

సీ॥ ముఖమూర్ధ్వలోకాంతమునఁగల యజువక్త్రమునసున్న చెలియతో ముచ్చటాడ। హస్తముల్ ప్రాక్పశ్చిమాచలంబులతోడ నెయ్యంబుమీఱంగ వియ్యమంద। నాభిలవాలాగ్రమాధ్రువమండల సీమతో నందంద చెలిమిసేయ। శాతరోమావళుల్ సరభసలీల నక్షత్రపంక్తులకు బెజ్జములుసేయఁ। బృథుశరీరంబు జగమునఁ బిక్కటిల్లఁ। దనదురవళికి మృత్యువు దల్లడిల్ల। హుంకరించినఁ గులగిరులులికిపడఁగఁ। మించి హనుమంతుఁ డప్పుడే తెంచి నిలిచె॥ ౧౨౯॥

గీ॥ ఘోరవాలంబు దలపోయ మేరువయ్యె। భూరి తారావళులు మొలపూసలయ్యెఁ। గమలినీనాయకుఁడు బొడ్డుఘంటయయ్యె। ననుచు రాఘవునకుఁ దోచె నట్టివేళ॥ ౧౩౦॥

గీ॥ తోచినను దనచిత్తము తొంగలింప। గాడ్పుపట్టిని సిండారఁ గాఁగిలించి। చెలఁగిసేనలనొకదరి చేర్పనిచ్చె। యనుచునమ్మినవాఁడె నిన్ను నిలతనయ!॥ ౧౩౧॥

గీ॥ అనుచు సీతయుఁదాను నొయ్యనరథంబుఁ। గరుణనెక్కినఁగని తురంగములవిడిచి। దేవతలు పుష్పవర్షముల్ దివిరికురియఁ। దన శిరోమధ్యమునఁదాల్చెఁ దద్రథంబు॥ ౧౩౨॥

గీ॥ మఱియు శత్రుఘ్న భరతలక్ష్మణులుఁ, గుశల। వాదిపుత్రులుఁ, జౌత్రులు, నర్కసుతుఁడు,। నావిభీషణుఁడును, మిత్రులతనిభుజము। లందు, వీపందునుండి రందందనిలిచి॥ ౧౩౩॥

ఉ॥ డంబుగ సేనలందఱు విడంబముమీఱఁగ రోమరోమకూపంబుల, నద్రిఁజీమగమి బ్రాకినచాడ్పున నెక్క, నిక్కుచుం। బంబినవేడ్కనుండిరి; శుభస్ఫుటభాషల సన్నుతింపుచున్। అంబరచారులెల్లను జయంబుగనిచ్చిరి దీవనల్ వెసన్॥ ౧౩౪॥

వ॥ ఇట్లాఖిలవాలగంభీర దోస్తంభ విజృంభమాణుండై హనుమంతుండుగొని చనిన, భేరీ మృదంగ కాహళ కఠోర భూరిభాంకార బధి

తీకృత బ్రహ్మాండ కోటియుండైన రాముండును గ్రహంబులలోనఁ బ్రకాశించు భాస్కరబింబంబునుంబోలె సకలసేనలలోనఁ దేజరిల్లుచు, రవి గ్రుంకినంతఁ దపసానదీతీరంబున విడిసి, మఱునాఁడచ్చటువీడ్కొని, సుషేణుండు ముందఱ నడవఁ గ్రమక్రమంబున మహావనంబులును, తటాకంబులును, పర్వతంబులును, దేశంబులునుం గడచి, త్రిజగద్భయంకరంబుగా క్షీరసముద్రాభిముఖుండై రాఁదొడంగె; అంతనక్కడఁ బ్రతాపలంకారమణుండగు శతకంఠుండు సకలపురోహితామాత్యబాంధవ రాక్షసలోకంబు గొలువ, నిఖిలామర దిశారమణ సముదయంబు గొలువ, నభ్రంకష సింహాసనంబునఁ బేరోలగంబుండు సమయంబున॥ ౧౩౫॥

క॥ చారులు, దిగనర్గళసం। చారులు, నిజనాథహితవిచారులు, స్వకులా। చారులు, రయములు మీఱఁగ। నారయఁగా నేగుదెంచిరవు డయ్యెడకున్॥ ౧౩౬॥

క॥ అరుదెంచి రాక్షసేంద్రుని। చరణంబులుగాంచి మ్రొక్కి, చయ్యనసుచితం। బెఱిఁగి సభయెల్ల వినఁగను। సరగునఁ దా మిట్లనిరి శతముఖుతోడన్॥ ౧౩౭॥

క॥ అయ్యా! మీపంపున మే। మయ్యాతావులకు నేగి యచ్చటివార్తల్। నెయ్యంబున నరయుచుండఁగఁ। జయ్యన విపరీతమైన చందము వొడమెన్॥ ౧౩౮॥

క॥ రావణుసిఁ దునిమినట్టి మ। హావీరుండగణితంబులగు బలములతో। దేవతలు సంతసిల్లఁగ। మీపలనన్ దాఁడి వెడలె మేదిని యదరన్॥

క॥ మున్నిట్టికపులఁ జెప్పఁగ। విన్నారము, వానికన్న విస్తారముగా। నున్నవి బలము, లొకండొకఁ। డన్నిజగంబులను మ్రింగు నలిగినఁ గణఁకన్॥ ౧౪౦॥

క॥ పేరుకొని యిసుకలైనను,। దారావళులైన, వర్షధారలనైనం। ద్ధోరముగనెన్నఁదగుఁగా। కా రాముని బలములెన్న నలవియె మాకున్॥

క॥ అందునఁ బొదలుచు మారుత। నందనుఁ డనువాఁడు మేరునగము

నుబోలెన్। సందడిగఁ బెరిఁగి సేనల। నందఱు నెత్తుకొని మృత్యువై యి
టవచ్చెన్॥ ౧౪౩॥

క॥ చెప్పిన దేవర మనసున। కిప్పలుకులఁ గోప మొదవు; నే మెటులైనం। జెప్పక యుండుట తగ దిఁక। నప్పవనజు నెదుర నోప రమరులు కూడన్॥

క॥ అటువంటివారె మీపై। నిటవచ్చెడి శూరు లెల్ల; నెవ్వరితోడం। గటకటఁ బోరఁగఁ దగుఁ? మీ। కెటువలె మదిఁ దోచునొక్కొ యెఱుఁగ ముదేవా!॥ ౧౪౪॥

క॥ ఎవ్వరికిని గనఁబడక యె। యవ్వీరుల నరయుచుండ నవుడా కశ
పి తాఁ। గ్రొవ్వున నార్చెదు నాకగిరి। జువ్వనఁ గబళించి నలిచెఁ జూ
ర్ణముగాఁగన్॥ ౧౪౫॥

క॥ వానికి నికోటులు, నీ। దానవులును దృణముగాఁగఁ దలఁచిరి మెట్లో। కాని యశక్యమ్రుఁ గార్యము। కానంబడె నది తరింపఁగా నెత్తె ఱఁగో॥ ౧౪౬॥

క॥ ఉగ్రింతై యాసేనకు। సుగ్రీవుండనెడువాఁడు సారిదిగ మీతో। విగ్రహము చేయఁ బొదలుచు। నుగ్రనితై వడిఁ బతిత్వ మొప్పఁగఁ బూనెన్॥

ఉ॥ ఇట్టిబలంబుతోడఁ బరమేశ్వరుఁడైనను ధిక్కరింపుచున్। నెట్టన రాఘవుండనెడు నిష్ఠురవిక్రముఁ డెన్నిరీతులన్। గట్టుతుదం జెలంగు హ
రికైవడి నాహనుమంతుమీఁదటన్। గట్టిగ నెక్కి వచ్చె నవకంబుగఁ ద
మ్ములు దన్నుఁ గొల్వఁగన్॥ ౧౪౭॥

ఉ॥ వారల, లక్ష్మణుండనెడివాఁడు ధనుర్గుణటంక్రియల్ మహో। దారత మిన్నుముట్ట, వివిధస్ఫుటభల్లపరంపరంబుతో। ఘోరతరాహ
వంబునను గూల్తు శతాస్యు నటంచు నన్నతో। సారెకుఁ జెప్పుచున్ యమునిచందమునం గనుపట్టెన య్యెడన్॥ ౧౪౮॥

శా॥ శౌర్యప్రాభవ మేర్పడన్ భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ మిమ్ము
లన్। ధైర్యంబొప్పనదల్చి మండుచు, వివాదప్రౌఢిబాణాసనా। చా
ర్యుల్ వీరని దేవతల్ వొగడఁగా, సంగ్రామమ్ముం జేయఁ దా। మార్య
త్వంబులు పూని రాఁదొడఁగి రత్యంతప్రతాపంబులన్॥ ౧౫౦॥

ఉ॥ రామునినందనుల్, పటుపరాక్రమవంతులు, దేవదత్తసం। గ్రా

మజయోజ్ఞు, లుగ్రరిపుఖండనశీలు, రనేకసాయక। స్తోమవిశాలతూణిక
ణశోభితబాహులు, తంద్రిఁగొల్చుచున్। హామికవచ్చి రకుశలవాఖ్యు
లు దానవవంశవర్ధనా!॥ ౧౫౧॥

ఉ॥ భీషణశౌర్యుఁడై మన విభీషణుఁడు న్నృపుఁగొల్చి, మిమ్ములన్।
దూషణచేయుచుం, గణఁకతో నసురావళి తన్నుఁగొల్వ, దు। ర్భాష
ల మర్మకర్మములు పాయక తెల్పుచు, నంతకంతకున్। రోషము బెంచు
చు న్విలయరుద్రునిక్రైవడివచ్చె నందులన్॥ ౧౫౨॥

ఉ॥ అవియటనుండనిమ్మొకమహాద్భుత! మారఘురాముముందటన్।
నవజలదంబుచెంగటఁ గనంబడు తీఁగెమెఱుంగురంగునన్ । సవినయలీల
నెన్నఁదగు జానకిపేరిటనొప్పుకాంత దాఁ। దివిరి నిజేశుతోడ నరుదెం
చుచునున్నది రాక్షసేశ్వరా!॥ ౧౫౩॥

ఉ॥ ఆననుఁగొప్పు, నాసుమహితాస్య ధగద్ధగ,లాకుచద్వయం,।
బానగ, వావెడందనయనాబ్జదళద్దళ, లాసునాసికం,। బానదు, మావ
ళిత్రయము, నాకుచదేశనిగన్నిగక్రమం,। బానడ, లామిటారములు,
నౌర! యొయారము దానికేతగున్॥ ౧౫౪॥

వ॥ అనిమతియు ననేకప్రకారంబుల నెఱింగింప శతముఖుండు
ను గోపారుణితలోచనుండై తనకనుసన్నయెఱింగి పనులు సలుపు ది
శారమణుల నవలోకించి॥ ౧౫౫॥

సీ॥ పనిచెద రంభ మీపాలికి ననవిని బలభేదిఁ బొమ్మని సెలవుచే
సెఁ। బచనంబుచేసితిఁ బాకయత్నములెల్ల నన నగ్నిఁ గనుసన్న నప్పు
డనిచె। రావదేమిర యింత కావరమాయని మొగిదిట్టి యమునిపై మొ
క్కలించె। సొంపారఁ దనమనసునవచ్చి నైరుతి వరుణులఁ బొండని క
రుణఁబుచ్చెఁ। గొలువుకూటంబులూడ్చితిఁ గోరిచూడఁ। బంపుడనవిని ప
వనునిఁబనిచి, రత్న। రాశులంపిన నలకాధిరాజుమెచ్చి। నొనరనీశాను
నాకమూల నొదుఁగఁజేసి॥ ౧౫౬॥

గీ॥ కొలువుచాలించి రాక్షసకులవరేణ్యుఁ। డండజను వారిదిక్కు
లకనిచిలేచి। యంతిపురసౌధమధ్యసింహాసనమునఁ। బరఁగఁ గూర్చుండి
పడవాళ్లఁబనిచి యప్పుడు॥ ౧౫౭॥

వ॥ తనప్రధానులంబిలువంబనుప, వారలును దగినవాహనంబులెక్కివచ్చి ద్వారప్రదేశంబున డిగ్గి దనుజవల్లభునకు వేర్వేరఁ బ్రణమిల్లి యుచితాసనంబులంగూర్చుండినం గని శతకంఠుండిట్లనియె॥ ౧౫౮॥

సీ॥ రాఘవుండను మహీరమణుండు నాతోడ నాహవంబొనరింతు ననుచు ననుజ। తనుజబాంధవులును దరుచరనిచయంబు మీఱి యింతింతను మేర లేక। వచ్చుచున్నాఁడట, వారినందఱం దానె హనుమంతుఁడను ధీరుఁడచటఁదాల్చి। యరుదెంచుచున్నవాఁడట, విభీషణుఁడును మనమర్మములు దెల్పుకొనుచు నృపుని। పజ్జ రాక్షసచతురంగబలముతోడఁ। బూనియరుదెంచెనట, యేమిబుద్ధి మనకుఁ?। జెప్పుఁడు మీచెప్పినట్ల నేఁజేయువాఁడ। ముట్టివచ్చినకార్యంబు మట్టుపడునె?॥ ౧౫౯॥

సీ॥ నావిని చిఱునవ్వు నవ్వుచుమంత్రులు బలికిరి దానవభర్తతోడ। యుద్ధమెవ్వరితోడ నొదవునోయనుచును మామనసులనెప్డు మలయుచుండుఁ। గానిమ్ము మీపంపు గైకొనిపట్టుక నరవానరాదుల నలిచి వైచి। వంశహీను నమిత్రవాదిని నవ్విభీషణుఁ జంపి, హనుమంతుఁ జక్కఁజేసి,। రాఘవుని దేవి జానకీరమణి దెచ్చి। కానుకిత్తుము మీకు నక్కజముగాను। మమ్మెఱుంగవె? మృత్యువుఁగమ్మఁగలము। సంగరంబునకింతవిచారమేల?॥ ౧౬౦॥

సీ॥ పెఱికితెత్తుమె శేష భీకరదంష్ట్రలు? పుడిసిలింతుమె యంబుధులనెల్లఁ?। దొడచేత లోఁ జేతఁ బుడమియునాకాశమునుతుమే పొడిపొడియగుచురాల?। మ్రింగివత్తుమె పోయి మృత్యువునైనను? కూలద్రొబ్బుదుమె దిక్కుంభితతుల?। బంధించివత్తుమే పవనునిఁ జలమునఁ? బగులవేత్తుమె కులపర్వతములు?। తృణముమాత్రము రాముని తేజమెంత?। వారిసైన్యంబులననెంత? వారిదెచ్చు। మారుతాత్మజుఁ డననెంత? పోరఁగూల్పఁ। దమకు నిమిషంబుపట్టదు దానవేంద్ర!॥ ౧౬౧॥

వ॥ అనియిట్లు ప్రగల్భవచనంబుల దనుజేంద్రుని మనసు రంజిల్లంజేసి మఱియును స్వచ్ఛందంబుల గదలు సాఁచుచుఁ బరిఘంబులు ద్రిప్పుచు ముసలంబులూఁచుచుఁ బరశువులెత్తుచుఁ దోమరంబులు సూఁచుచుఁ జాపంబులం గుణధ్వనులు గావింపుచు శరంబులేర్చుచు మిన్నువాగు

ల నార్చుచు ననేకరాక్షసులు సమరంబునకత్తాయుచు నిల్చిన నచ్చేరువంచి, యగడ్తలుచక్కఁజేయించి, రసాతలంబుముట్ట బలంబునింపించి, నవప్రాకారంబులు సవరింప నియమించి, సకలద్వారంబులఁ గార్చిచ్చులంబోలిన దానవులం బదికోట్లనుంచి, మొగసాల నఱువదిలక్షలతోనుండుమని స్థూలకంఠుని నియోగించి, కిన్నర గంధర్వ సిద్ధవిద్యాధర గరుడ నిర్జరపన్నగాదుల కభేద్యంబుగావించి, కొలువుచాలించి, ప్రధానులంబంచి, తానును దనతల్లియగు చిత్రగంధిపాలికింజని తద్వృత్తాంతంబంతయు నివేదించి యిట్లనియె॥ ౧౬౨॥

ఉ॥ వచ్చెడివాఁడు మర్త్యుఁడట, వానికిఁదోడట కోఁతిబారొగిన్,। వచ్చి చతుస్సముద్రము లవార్యత వారట దాఁటి యీడకుం। జెచ్చెర నేగుదెంతురట, సేనలు దామును ఘోరమైన కా। ర్చిచ్చు పయింబడన్ శలభసేనగడంగినయట్లు కాదపే?॥ ౧౬౩॥

చ॥ అదియునుగాక పఙ్క్తిగళుఁ డారఘురాముని దేవిఁదెచ్చితాఁ। దుది సుఖవృత్తిలేక మఱిదుఃఖింగె; రఘూద్వహుఁ డిప్పుడుం దగన్। సుదతిని గూడివచ్చెనట; చోద్యముగా నటుగాన వానిపె। ల్లదరఁగఁజంపి సీతఁగొనుదందము మెచ్చఁగ శాశ్వతంబుగన్॥ ౧౬౪॥

చ॥ అనవిని భీతినొంది తనయాత్మజుఁ గన్గొని చిత్రగంధి యి। ట్లను వకటా! తనూభవ! దురాత్ముల కైవడి నిట్టివాక్యముల్। కనికరమింతలేక పలుకందగునా? రఘురాముభార్య నీ। జననిసుమయ్య! యన్యసతిచాడ్పునఁ జూడకు మెన్నిభంగులన్॥ ౧౬౫॥

ఉ॥ రాముడు మోక్షకర్త, యలరాముని దేవి రమావధూటి, యా। రాముఁ జెనంకిగా జె మన రావణముఖ్యనిశాటులెల్ల సం। గ్రామమునం దుఁగూలుట, పరామరిసింపుము మర్త్యవేషుఁడై। భూమినిఁబుట్టెఁగాని రఘుపుంగవుఁ డాదిని విష్ణుఁ డేసుమీ॥ ౧౬౬॥

వ॥ అనిమఱియు ననేకవిధంబుల నతండవతారంబులుసలుపువిధంబులును, మహిమంబులును, తక్కినప్రకారంబులును, సీత యాదిపరంజ్యోతియగుటయును, తదీయ సామర్థ్యంబును నెఱింగించి వెండియు నిట్లనియె॥ ౧౬౭॥

గీ॥ ఘనుని రాముని మానవుఁ గాఁదలంప। వలవ; దాతఁడు పూనిన వార్ధులెంత?। కోటలన నెంత? నీవను మాటలెంత?। అతనికివియెల్ల నద్భుమే? యక్కటకట!॥ ౧౬౮॥

గీ॥ వెలయ నజునివరముల గర్వింపవలవ। దట్టి బ్రహ్మను బుట్టించు నతఁడె యితఁడు। అట్లుగావున నాదేవుఁడలిగెనేని। పద్మజుని యీవు లెందుకుఁబనికిరావు॥ ౧౬౯॥

వ॥ అదియునుంగాక వరంబులనుకూలంబులైనను నీవు విరించిని గోరునప్పుడు పురుషులచేఁ జావులేకుండ నడిగితివి గాని సతులఁ దలంప నేరవైతివి; అదియెప్పుడు నాహృదయంబునఁ దవిలియుండు; రామఁడు సీతాసమేతుఁడై యరుదెంచు కారణం బేమొకో తెలియఁగరాదు; ఆ యమ్మ మహామాయగాని సామాన్యమానవకామినిగాదు; యిక్కోలాహలంబుమాని యప్పురాణపురుషుండగు రామచంద్రుని కెదురుగాఁ జని శరణుచొచ్చి బ్రతుకుట మహాకర్తవ్యంబని పెక్కుదెఱంగులం దెలుప, రోగికిఁ బథ్యంబు రుచింపని తెఱంగున నమ్మాటలు చెవిసోఁకక చూత మెట్లయిన నేమిభయంబని దిగ్గన లేచి చని సమరప్రయత్నంబున నుండె నంత రామచంద్రుండును నక్షత్రనిచయంబుల నడుమఁ జెలువమరు సంపూర్ణచంద్రుని ధిక్కరింపుచు సకలసేనామధ్యంబున రాఁదొడంగెనని వినిపింపఁ బార్వతీమహాదేవి యటమీఁదివృత్తాంతం బేమయ్యెనని నిజేశుండగు మహాదేవునిం బ్రార్థింపుచునుండె నంత॥ ౧౭౦॥

గద్య॥ ఇది శ్రీమచ్ఛేయకూర్తి నివాస, లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష సంప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణ, సుమహితాంధ్రగీర్వాణభాషాప్రవీణ, సంగీతలక్షణధురీణ, సకలవిద్వన్మిత్ర, త్రేయసగోత్రపవిత్ర, ధర్మనార్యపుత్ర, నిఖిల మహీసురాశీర్వాద ప్రవర్ధమాన భాగధేయ, సకలనృపవిధేయ, వినయవిధేయ, మర్దననామధేయ ప్రణీతంబైన

సీతావిజయంబను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# సీ తా వి జ య ము.

## తృతీయాశ్వాసము.

గీ॥ శ్రీకరణకార! రాజ్యలక్ష్మీవిహార!। హార గోక్షీర హీర నీహార తార। తారకాధీశ తార భూధర తుషార। సారకీర్తివిహార! పోచమనృపాల॥ ౧॥

వ॥ అవధరింపుమంతఁ బార్వతీదేవికి మహాదేవుండిట్లనియె; అట్లు సకలగుణాభిరాముండును, రమణీయఘనశ్యాముండును, సామాదిశ్రుతసంపన్నుండును, ఆపన్నజనకల్ప మహీజాతుండును, మహీజాధినాథుండునగు రఘువల్లభుండు హనుమచ్ఛిరోమధ్యంబున సకలసేనాసమేతుండై వచ్చివచ్చి॥ ౨॥

మహాస్రగ్ధర॥ కనియెన్ రామక్షితీశాగ్రణి యచట మహిమాత్యంతదీపింపఁ జంచ। ద్ఘనసర్పగ్రాహనక్రగ్రకమఠ విలుఠద్గాథ పాఠీనకల్లో। లనటచ్ఛైవాలభాస్వల్లసదసిత కల్హార రాజీవషండో। త్కటనదుద్ధూతాస్యద్రుక్చక్ర బకముఖ రుతాక్రాంతభద్రున్, సముద్రున్॥ ౩॥

గీ॥ అలరి యీరీతిఁ గనుఁగొని యనుజతనుజ। దనుజ మనుజ వనచర సంతతులుగొల్వ। నఖిలవాద్యధ్వనుల్ మిన్ను నదరఁ జేయ। రాఘవుఁడు వచ్చె దుగ్ధాంబురాశికడకు॥ ౪॥

వ॥ ఇట్లు రామభద్రుండు సుధాసముద్రతీరంబుఁ దోరంబుగాఁ జేర మారుతనందనుండు సంతుష్టాంతరంగుండై తనశిరోభాగంబున, వీపున, దేహంబుననుండిన రాఘవసీతాదులను, భరతశత్రుఘ్నులను,

లక్ష్మణవిభీషణులను, సుగ్రీవాంగదప్రముఖుల నందఱ వీక్షించి, రఘువరునకుఁ బ్రదక్షిణంబు గావించి నమస్కరించి, పురోభాగంబునఁ గరంబులు మొగిడ్చియున్న మరున్నందనునవలోకించి, తననయనంబులఁ గరుణారసహర్షంబులు దొరుఁగ సరససమధురవచనంబుల నిట్లనియె|| ౫||

గీ|| అన్న పవనజ! నీమహాత్మ్యోన్నతంబు| పెంపుసొంపెక నెట్లు నుతింపవచ్చు?| నేమొసంగినఁ దీఱెడి నీఋణంబు?| అనుచు దీవించె శుభదవాక్యముల నపుడు|| ౬||

సీ|| సీతయుఁ దనవిభు చెవిసోఁక హనుమంతు నెలమిమై వీక్షించి యిట్టులనియె| నవ్వేళ రావణుండట్లు వనంబునఁ గఠినదైత్యస్త్రీలఁ గాపువెట్టి| బాధ గావింప, నత్యంతఁ బాయునట్టిదుఃఖంబున వ్రాలి దేహంబు మఱచి| ప్రాణంబులెల్ల వెళ్లెడుసమయంబున నరుదెంచి, రాము జయంబుఁ జెప్పి| జీవములు నిల్పి, రక్కసు శిక్షఁ జెలఁచి,| పతినిఁ గూర్చెదననిచాలఁ బ్రతినఁ జేసి,| మరలఁ జని నాయకునకు నేమనుటఁ జెప్పి,| యబ్ధిబంధించి, సకలసైన్యములఁ దెచ్చి|| ౭||

గీ|| శాత్రవులనెల్లఁ జంపించి, జనవరేణ్యు| చే విభీషణుఁ గరుణింపఁ జేసి, పిదప| నన్ను నావిభుఁ గూర్చితివన్న! యెచటఁ| గన్న నీవంటి బంధుండు గలఁడె మాకు?|| ౮||

చ|| అనవిని మోదమంది మరుదాత్మజుఁ డానృపపత్నిన్, ధరాసుతం| గనుఁగొని యేను మీకుహిమఁగాదె తరించితి నెల్లభారముల్;| వినుతికి నెంతవాఁడ? నవివేకిని, మర్కటుఁడన్, మహాత్మ! మీ| యనుమతిఁ జేసి యెట్టిపనులైనను సాధ్యముగాక తక్కునే|| ౯||

ఉ|| ఎల్లనిలింపవర్గములు, నెల్లనిశాటులు, నెల్ల రాజులున్,| ఎల్లవనేచరుల్ వొగడ, నెల్లమునీంద్రులు సంతసిల్లఁగా,| నల్లనమీరుచూడఁ జతురబ్ధుల వాలము సాఁచి యందుపైఁ| బెల్లుగ సేననెల్ల నడిపింతుఁ, దలంకకు రాఘవేశ్వరా!|| ౧౦||

చ|| అనవిని రాముఁడిట్లనియె నద్భుతసంభ్రమముల్ పెనంగఁగా| ననిలజ! నీవుగల్గ నలుకందఁగ నేటికి! నెల్లసేనలన్| ఘనముగఁ జేర్పుమా

క్కడరి గ్రిమ్మకాన, నవ్వలికార్యమెల్ల నే। నొనరఁగఁ జక్కఁబెట్టెద మదుగ్రశరంబుల నాహవంబునన్॥ ౧౧॥

ఉ॥ ఈవనధుల్ దరింపఁజను నెల్ల తెఱంగుల, నందుమీఁదటన్। దేవ మునీంద్రులన్ ధరణిదేవతలున్ జయసిద్ధిగా వెసన్। దీవెనలీయ దైత్యనివధించెద, మానుల నెల్లఁ బ్రోచెదన్;। దేవ బుధప్రియాత్మసఖుఁ దీరని కార్యములెవ్వి చెప్పుమా?॥ ౧౨॥

ఉ॥ ఎవ్వఁడు విప్రవర్గముల కెగ్గొనరించు నతండిహంబునన్। దవ్వగుఁ; జేయు కార్యము వృథాయగు; మోక్షఫలంబు దూరమౌ;। యెవ్వఁడు విప్రవర్గమున కెగ్గొనరింపఁడతండిహంబునన్। మవ్వముగా సుఖించును; క్రమంబున మోక్షఫలంబులుంగనున్॥ ౧౩॥

ఉ॥ కాన మహీసురావలి నకారణ మీశతకంతుఁ డేఁచును। గాన జయంబులేదు; మృతిగల్గుట సిద్ధమె యెన్నిభంగులన్;। మానిజనప్రియంబు గరిమన్మన కెప్పుడుఁ గల్గుఁగావునన్। దానన చేసి యుద్ధమునఁ దప్పదు గెల్పు హనూమదాహ్వయా!॥ ౧౪॥

గీ॥ జాగు సేయకుమిఁక, సురల్ సన్నుతింపఁ। బనుపు బలముల నెల్ల, శుభశ్చ శీఘ్ర। మనెడివాక్యము నిజమని యాత్మ నిలుపు,। ప్రతిన చేపట్టి కీర్తులు బడయుమనఘ!॥ ౧౫॥

మ॥ అనినన్ జువ్వున మిన్నుముట్టి ధృతిమై నందంద లంఘించి, చ। య్యన రామాంఘ్రియుగంబునం బడి తదీయాజ్ఞావిశేషంబునం। దనపై నిర్జరులందఱుం గుసుమముల్ దట్టంబుగాఁ గుర్వ, నా। య్యన నాక్సైనర విప్రత్రముఖ్యకపు లాహాయంచు దీవింపఁగన్॥ ౧౬॥

శా॥ దేహంబభ్రముసోఁకఁ బెంచి సితవార్ధిన్ డాసి, సైన్యావళుల్। హాహాకారము సేయ, రాఘవుఁడు దా నానందముం బొంద, నుత్సా। హంబొప్పఁగ భూరివాలమప్పు డుద్దామప్రతాపంబునన్। బాహుల్ ద్రిప్పుచు దుగ్ధవారినిధిపైఁ బ్రత్యర్థులుల్కన్ వెసన్॥ ౧౭॥

వ॥ ఇవ్విధంబున బలవంతుండగు హనుమంతుండు దిగంతవిశ్రాంతయశస్సాంద్రుండై, కృతాంతునిపోలిక నంతకంతకుఁ బంతంబున ధి

క్కరించుచుఁ దనవాలంబు యోజనశతద్వయంబు పొడువును, నేఁబది యోజనంబులవెడల్పునుంగలుగ నికరించి కలశాబ్ధిపైఁ జఱపి, బ్రహ్మాము రేంద్రులును, గరుడ గంధర్వ యక్ష రాక్షస కిన్నర కింపురుష సిద్ధ వి ద్యాధర బృందంబు లందంద నవలోకింపుచు నక్కజంబుగాఁ బెక్కువి ధంబుల నుతింప, గదాహస్తుండై మేరునగంబుచందంబునఁ దత్తీరంబు నఁ దోరంబుగాఁ గదలకనిల్చి చెలంగుచు నెల్లదళంబులఁ గదలుండని పెద్దయెలుంగునఁబలుక, రామభద్రుండును మహాశ్చర్యంబున సీత మొ గంబును, లక్ష్మణుదిక్కును జూచుచు ననేకవిధంబుల వినుతింపుచు, సు గ్రీవాంగద జాంబవత్సుషేణాదులు ముందఱఁ దోఁకపై వీఁకనడువఁబు డమిఱేఁడును జానకీసమేతుండై పుత్రపౌత్రసహోదరనిచయంబు పరి వేష్టించి యరుదేర జయజయధ్వనులతోఁ జనుచుండె; వెనుకొని సకల దళంబులు రాఁదొడఁగె నాసమయంబున॥ ౧౮॥

సీ॥ వనధిలోపల గుభుల్లనఁ గొందఱుఱికి యొయ్యనఁజనిరటుచల్లు లాడుకొనుచు। గగనభాగమున నొక్కటఁ గొందఱరిగిరి మేటివేల్పుల చేత మెప్పుఁగొనుచుఁ। గుప్పించి దాఁటఁగాఁ గోరికొందఱు పెల్లు లం ఘింపఁదొడఁగిరి లఘువుమెఱసి। పవనజువాలంబుపైఁ గొందఱేగిరి పె క్కుచందంబులనిక్కుకొనుచు। రథములును,గంధకరులుఁ, దురంగతతు లుఁ। బొంకమొప్పఁగ నేగె, నిశ్శంకతోడ। నెసఁబొగడుచు నందందనా డుకొనుచు। నడువఁజొచ్చిరి కొందఱందముగనపుడు॥ ౧౯॥

గీ॥ సీతకవ్వేళ రాముండు చెయ్యిసాఁచి। ఘనఝషగ్రాహ కరకు ట కచ్ఛపములఁ। జూపుకొనుచును వేడ్కతో సుమహితాండ। జాళి ని ష్ఠురకలకలంబచటవినుచు॥ ౨౦॥

శా॥ ఈరీతిం గపిసైన్యముల్ గొలువఁగా, నింపొందు సీతావధూ। టీరత్నంబును, దమ్ములుం, దనయులున్ రీవిం ముదంబందఁగా,। శ్రీరా ముండసమానవిక్రమమునన్ క్షీరాబ్ధి దాఁటప్వలన్। ధీరోదారత నిల్చె నిర్జరతతుల్ దీవింపఁగాఁ జెచ్చెరన్॥ ౨౧॥

ఉ॥ చేరిరి వానరోత్తములు, చేరిరి జాంబవదాది ముఖ్యులుం,। చే

రెవిభీషణుండుఁ దనసేనలతో, సకలక్షితీంద్రులుం। జేరిరి, ఘోటకంబులును సింధురబృందములున్ రథంబులుం। జేరె, మరుత్సుతుం డొకఁడుచిక్కి సమస్తదళంబులచ్చటన్॥ ౨౨॥

మత్తకోకిల॥ మారుతాత్మజుఁ డిట్టిరీతి సమస్తసేనల నొయ్యనన్। భూరివాలముమీఁదఁబుచ్చి, యపూర్వవిక్రమశీలుఁడై। ధీరతం దనతోఁక మెల్లనఁదీసి, పువ్వులవానబృం। దారకుల్ గురియింపనిల్చె ముదంబు నెక్కొన నత్తఱిన్॥ ౨౩॥

చ॥ రఘుపతి తన్నుఁజూడఁగఁ బరాక్రమహారయవించు, ధీరసా। రఘునశరీరుఁడైన కపిరాయఁడు చేరువనున్నకొండపైఁ। లఘుగతినెక్కి నిక్కి కుతలంబువడంకఁగనార్చి, దోర్బల। ప్రఘటితకీర్తిశాలియని భానుజముఖ్యులు సన్నుతింపఁగన్॥ ౨౪॥

చ॥ నగుమొగమెత్తి, భానునిఁజెనంకఁగఁ దోఁకఁగదల్చి, బాహువుల్ దగఁజళిపించి, యంఘ్రులుచితస్థితిఁ గూడఁగఁబెట్టి, జువ్వనన్। నగముపణంకఁదూఁగి, వదనంబు బిగించుచు రామచంద్రు, భూ। రిగుణుఁదలంచి దాఁటె బలుతెక్కలనొప్పు సురాద్రికైవడిన్॥ ౨౫॥

చ॥ అపుడు సమస్తలోకములు నల్లలనాడెఁ; భయంబు పెంపుచేఁ। నపుడు మహానిలంబు జగమంతయునిండెఁ; దలంచిచూడఁగా। నపుడు పయోనిధుల్ గలఁగె; నల్లన దేవతలాశతానను। డపుడె యణంగెనంచు ముదమందుచునుండిరి మాటిమాటికిన్॥ ౨౬॥

ఉ॥ పావనియున్ వనేచరులు ప్రస్తుతిసేయుచుఁదన్నెదుర్కొనన్। వావిరినేగుదెంచి, తనవల్లభుఁడైన రఘూద్వహున్, ధృతి। గ్రావకులేంద్రుఁజూచి ప్రాసగంబ్రణమిల్లి, కరాబ్జయుగ్మమున్। ఠీవిగఫాలమందు ఘటియింపఁగఁజేయుచు నిల్చె ముందటన్॥ ౨౭॥

ఉ॥ అంతటరాముఁడుం బటుదయారసముబ్బఁగఁ జూచి యాహనూ। మంతుని, శాంతునిన్, సుజనమండనచారువనీవసంతునిన్। వింతగఁ గాఁగిలించి, కడువేడుక దీవనలిచ్చి, నాఁటికిం। బంతముతోడ నిల్చెఁ దనపజ్జను సీత చెలంగుచుండఁగన్॥ ౨౮॥

వ॥ ఇవ్విధంబున రఘుకులేంద్రుండు సకలసేనాసమేతుండై నాఁటికచ్చటనిల్చి, మఱునాఁడు ఘృతసముద్రంబును, మూఁడవనాఁడు దధినిధియును, నాలుగవనాఁడు సురాంభోనిధియును గ్రమక్రమంబున హనుమదాఖీలవిశాలవాలంబుపైఁ గడచి, జానకియుండానును బవనసుతుని శిరోమధ్యంబున రథంబుపైఁ దేజరిల్లుచుఁ బ్రతాపలంకాలంకార ప్రాకారద్వారకవాట పరిఘాచమత్కార భర్మహర్మ్యప్రాసాద గోపుర శాతకుంభకుంభగంభీరవారణ రథతురంగభటబృందంబులంగల విశేషంబులు నక్కజంబుగాఁ బెక్కుచందంబుల నవలోకింపుచుఁ జనునప్పుడు, సకలదిక్కులయందును బిక్కటిల్లుచు, భూనభోమధ్యంబున నిరంతరంబుగానిండి బలంబులరుదెంచి శతకంఠునిపురంబుడాసి, కాహళమృదంగ ఢక్కాముఖబహువిధతూర్యనాదంబులు ఘోరుకలంగ, మనుజదనుజశాఖామృగ వాహినీసమూహంబులతో రఘునాయకుండు విడిసె; బలంబులునుం దగినయెడలనుండిరి; విభీషణ సుగ్రీవాంగద ముఖ్యులు రామునిచేరువనుండిరి; భరతశత్రుఘ్నలక్ష్మణకుశలవవిజయాదులు సేనాసమేతంబుగా సీతంబరివేష్టించి, రామునిం గొలిచియుండిరి; రఘువరుండును బట్టణంబు నెట్టన ముట్టడివేఁయనూహించి విభీషణ సుగ్రీవాంగదజాంబవన్మరున్నందనానుజానుమతంబున॥ ౨౯॥

గీ॥ దక్షిణద్వారమున నీవు దక్షిణేశు। కరణి, వానరబలమసంఖ్యాంబుగొలువ। మెండుకొని పట్టువదలకయుండుమనుచు। నంగదునిఁబంపె నప్పుడత్యద్భుతముగ॥ ౩౦॥

గీ॥ వివిధభంగులఁ బడమటి గవనియందుఁ। గ్రూరభల్లూకములు నూఱుకోట్లుగొలువ।నప్రమత్తుఁడవై యుండుమనుచుజాంబ।వంతునటఁ బంపెఁబటుబలవంతముగను॥ ౩౧॥

గీ॥ అగచరోత్తములరయనూఱర్బుదములు। నేర్పుతోఁడుత మిముఁ గొల్వఁదూర్పుదెసకుఁ। జనుఁడు మీరని గోముఖపనసవృషభ। శరభులనుబంపె సంగరోత్సాహమునను॥ ౩౨॥

గీ॥ అంతమిగిలినసైన్యంబునల్లనొక్క। మూఁకగావించి వారినిమ్ము

లనొసంగి। కదలుమనుచును శతుీవుల్ కళవళింప। నుత్తరంబున సుగ్రీవునని చెనపుడు॥ ౩౩॥

చ॥ వరుస విభీషణుంగొలిచి వచ్చిన దైత్యులఁ గొమ్మకొమ్మ కొ। క్కురుఁబురికొల్పి, వారలనుగావఁ బ్రధానులఁజూపి, వెల్లభూ। వర నివహంబులంబిలిచి వాహినులల్పము లైనచోట మీ। రరయుచునుండుఁ డీయనుచు నల్లనఁదానియమించె నెంచఁగన్॥ ౩౪॥

ఉ॥ అందఱ నన్నిదిక్కులల రయంబుగ నేర్పఱపం, గణంకతోఁ। గొందఱగడ్డలూడ్చుచును, గొందఱు కొమ్మలు కూలవేయుచుం,। గొందరు దత్కవాటములఁగుంజరయూథము రీతిఁదోయుచుం,। గొందఱు గర్భముల్వగులఁ గొవ్వుననార్చుచునుండిరత్తఱిన్॥ ౩౫॥

సీ॥ ఆసమయంబున నవనీశుఁడగు రామచంద్రుఁ డల్లన విభీషణు నిఁజూచి। యమ్మహాకుశలుని యనుమతిఁ గైకొని మంతుకెక్కిన హనుమంతుఁబిలిచి। సేనలమన్నను జేర్చితివిచట నీకృప నెల్ల పనులు దిగ్విజయమయ్యె। నిటమీఁది కార్య మేనెన్నిభంగులనైన ఘటియింపఁ జేయుదుఁగాండములను। గాననింతట నాశతకంఠుబుద్ధి। వెట్టిరూపున మెఁగునో యెఱుఁగరాదు। రాయబారంబు తరుచరరాజ! నీవు। పోయివచ్చుటఁగార్యంబు పొసఁగుననుచు॥ ౩౬॥

గీ॥ ఎల్లి పుష్యమి యాత్రకు నిదిజయంబు। రమణనీ పేరఁ జంద్రతారాబలములు। గలిగియున్నవి చని శతకంఠుఁజూచి। మమ్ము నెఱిఁగించి చయ్యన రమ్ము పొమ్ము॥ ౩౭॥

గీ॥ వనజసంభవుఁ డొసఁగిన వరములకును। మదిమదింపకు మనిప ల్కుఃమతి మదించి। పోరనాచేతదగ్ధులైపోయినట్టి। దశముఖానేక దైత్యులఁదలఁపుమనుము॥ ౩౮॥

గీ॥ లీలఁబురుషుల చేఁ జావు లేకయుండ। బ్రహ్మఁగోరితినని వాఁడు బలికె నేని। మించియిచటికి నేఁ వరు దెంచినట్టి। రాకతలపోయు మనుమయ్య! యోకపీంద్ర!॥ ౩౯॥

గీ॥ వెఱచె నేనియనిప్పుడే శరణుచొచ్చి। మనుట మేలని యెఱిఁగిం

ఘవనచరేశ!॥ శరణుచొచ్చినవెనుక నా ధరణిసురలఁ। జేయుదుండగము
లు మదిఁజేర్పననుము॥ ౪౦॥

క॥ చనుమని పంచిననలరుచు। హనుమంతుఁడు, రిపుకృతాంతుఁ డ
నుపమవిద్యా। ధనవంతుఁడు, బలవంతుఁడు। జనవల్లభు చరణపంకజ
ములకు నెఱఁగెన్॥ ౪౧॥

వ॥ ఇవ్విధంబున నమస్కరించిన నమ్మహాత్ముండు దీవింప నచట వీ
డ్కొని, తానరిగెడి మార్గంబుననున్న సుగ్రీవున కెఱింగించి, అనుపవ
చ్చిన విభీషణునునిచి, సకలవానరదానవ మానవనిచయంబులు జయజ
యధ్వనులు గావింప నరిగి, ద్వారంబులంబలిసియున్న మహాదానవులఁ
బరికింపుచు నదృశ్యశరీరుండై నవప్రాకారంబులు గడచి, తనమహాకా
రంబుఁ గొందలుగని పలుచెడి విధంబుఁజూచి నవ్వుచు, నరయవచ్చిన
వారలహుంకరింపుచుం జనిచని పట్టణంబువీక్షించునప్పుడు॥ ౪౨॥

గీ॥ అలరునప్పురిరమ్యహర్మ్యాగ్రశాత। కుంభకుంభవ్రజంబులఁగొ
మరుమిగులు। ప్రకటజాంబూనదాంభోజముకుళములను। సరసమగున
ట్టి మానససరసిఁబోలె॥ ౪౩॥

గీ॥ ఇట్టిపట్టణంబు నిందుప్రతిష్ఠవడి। నేలుచుండకీతఁ డేలక్రొవ్వె?। ఘ
నతకలుగుటకును వినయంబు భూషణ। మదియులేమి జన్మహానిగాదె?॥

వ॥ అనిమెచ్చింపుచు మఱియునుంజనిచని మరకత నీలప్రవాళ మౌ
క్తికవైడూర్య పుష్యరాగాద్యనేక రత్నఖచితాభ్రంకష సింహాసనం
బున నూఱుతలలు, నిన్నూఱుకరంబులును, మిన్నుముట్టిన పొడువునుంగ
లిగి, గరుడగంధర్వ సిద్ధవిద్యాధరకిన్నర కింపురుష దేవదానవోరగాష్ట
దిశారమణ శిరశ్శోభితంబగు తలాటంబుఁగాలంద్రొక్కి నిక్కుచుఁ, జె
లులువట్టినదేవ భూదేవయోషాసముదయంబులు కన్నులనశ్రువులొలు
క నులుకుచుం దగినపనులుసలుపఁ, బ్రధానులుందానును గొలువున్నశ
తముఖు నవలోకించి మహాద్భుతంబు నొంది, రావణునకు నితనికి ననే
కాంతరాంతరంబని తలపోయుచు నవార్య ధైర్య గాంభీర్య ధుర్యుండై
డాసి, తదీయసింహాసనంబునకుఁ బురోభాగంబునఁ దనవాలంబు దివి

సోఁకఁబెంచివీఁకంబుట్టితదగ్రంబున నమ్మహాదానవేంద్రునికంటెఁబొడువుగాఁ గూర్చుండిననతని దారుణాకారంబు శతకంఠుండు గాంచి యాశ్చర్యంబును, భయంబును, నభిమానంబును, గోపంబును బురికొనంగఁ జింతించి యమ్మహావీరునకిట్లనియె.॥ ౪౫॥

శా॥ ఏరా! యోరి వనేచరాధమ! భయంబింతైననున్లేకప్రా। కారంబుల్ వెస దాఁటు టెట్లు? మఱి వీఁకం దాఁటి దుర్భీషణా। కారం బొప్పఁగ వచ్చు టెట్లు? తగ నల్కన్వచ్చి నాముందటన్। ధీరత్వంబున నిల్చు టెట్టు? లివి చింతింపన్ మహాశ్చర్యముల్॥ ౪౬॥

శా॥ ఎవ్వాఁడంపిన నెట్లు వచ్చితివి? నీవెవ్వాఁడ? వెవ్వానికిన్। మవ్వంబై యుదయించినాఁడ? విట కేమార్గంబునన్వచ్చితీ?। వెవ్వండిట్టి రూపాసంగ? మఱి పేరేమందు?! విన్పింపరా। యివ్వీటంగల దానవుల్ గదు నినున్హింసింతురిట్లుండినన్॥ ౪౭॥

ఉ॥ ఎవ్వనిఁగొల్తు? వాతఁడన నెవ్వఁడు? దోర్బలమొప్ప యుద్ధమం। దెవ్వనిగెల్చె? నింకతఁడు నెక్కడకెక్కడ కేగుదెంచెనో?। జువ్వన మత్ప్రితాపములు చూడఁగ నూరకె నిన్నుఁబంపెనో?। యివ్విధమెల్లఁ జెప్పఁగదరా, దివిఁబూచెదవింతగర్వమా!॥ ౪౮॥

వ॥ అనినవిని మహాశూరుండగు మరుత్కుమారుండు నిశ్శంక నిరాతంక మనఃపంకజుండై ప్రతాపలంకారమణుండగు శతముఖునిం జూచి యుఁ జూడనివిధంబున నిరాకరింపుచు నిట్లనియె.॥ ౪౯॥

గీ॥ ఓరి దనుజాధముఁడ! వినరోరి రాము,। నప్రతిద్వంద్వశౌర్యు, నాహవవినోదుఁ,। బరమధార్మికు, జానకీప్రాణనాథుఁ,। ద్రిభువనాధీశు నధికులు దెలుపవినవె?॥ ౫౦॥

సీ॥ ఎఱుఁగవే రావణు శిరములుపదియును ధరణిపైఁగూల్చు ప్రతాపమహిమ?। యెఱుఁగవే కలనిలో నలఘుబలోదీర్ణు, నకుంభకర్ణు గీటణఁచువిధము?। తలఁపవే యింద్రజిద్దారుణాద్రినిఁగూల్చు భూరిదోర్దండదంభోళిఘనత?। తెలియవే లంకకుఁ దవిలి విభీషణుఁ బట్టంబుగట్టిన పటువివేకి?। నట్టి శాత్రవసంహారుఁ, డారఘూద్వ। హుండె మాస్వామి;

యతనికి నూఁడిగములు। సేయుచుందుము నేమొదల్ చేసి పెక్కు। వనచరులము, మహీసురావనచరులము॥ ౫౧॥

క॥ నాతండ్రి వాయుదేవుఁడు,। నాతల్లి దలంపనంజనాదేవి, మదా। ఖ్యాతంబు హనుమఁ డందురు,। భూతలపతిఁ గొల్తుజయముఁ బొందెడి కొఱకై॥ ౫౨॥

సీ॥ ఏలికపనిబూని యేలంక కరుగుచోఁ గంధి దాఁటితినొక్క కాల్వకరణి। వనమెల్ల బెఱికి రావణుకుమారుని నక్షు ధాత్రిఁగూల్చితిఁ దృణమాత్రముగను। దశకంఠుపుర మెల్లదగ్ధంబు చేసితి దివిజులో హాయని ధృతినుతింపఁ। బట్టవచ్చినవారిఁబట్టపురాజునై పెలుచదండించితిఁ బెక్కుగతుల। మరలివచ్చుచు లంకిణి యురము ద్రొక్కి। జలధిలంఘించి జానకి జయముచెప్పి। నట్టిశూరుండ, నిప్పుడునట్లె నిన్నుఁ। జూచిపోవచ్చినాఁడ రా నీచహృదయ!॥ ౫౩॥

ఉ॥ వంచనలేక మోచికొని వచ్చితి సేనలనెల్ల వేగ; దాఁ। టించితి నాల్గువార్ధులును శ్రీవిగ వాలముమీఁద; వాఁడె యే। తెంచె రఘూద్వహుండు తనదేవియుఁ దానును నిన్నుఁ జంపఁగా;। నెంచఁగ నీకు దిక్కు ధరనెవ్వఁడు? చూడుమిఁకోరిదుర్మతీ!॥ ౫౪॥

చ॥ అనవిని యప్పుడిట్లనె శతాస్యుఁ డిదేమిర యోరి! దూత నే। మనఁ జనదంచునున్నఁ బలుమాఱును రాముఁడు గీముఁడంచు న। మ్మనుజకులాధమున్ వినుతిమాఱొక్కనిచేసెద, విట్లు వాఁడుచే। సిన పని నా భటుండొకఁడు సేయు నిమేషములోనఁ జూచినన్॥ ౫౫॥

సీ॥ క్షుద్రమానవుఁ జెప్ప సుకృతాత్ముఁడనుచును బెక్కులువలికెదు వెట్టికోఁతి!। యెట్టిధార్మికుఁడు రా యింతినిఁ దాటక నణఁచి పిన్నప్పుడె స్త్రీహత్యఁ జేసె। నొకపాపిఁ తవిలువంచి వికలంబుగావించి యిలమహాదేవునకిగ్గుచేసె। నాతికై నిష్కారణంబుగా నవ్వాలిఁ బడనేసె నత్యంతపాపమొదవ। నట్టికాంతాజనాంతకు, నట్టిశైల। జాధిపద్రోహి, నట్టి మహాఘచిత్తుఁ। జెప్ప నేముఁన్న, ఇఁకనీవు చేరినట్టి। వార్త విన్పింపఁగ దళోరి వదరులేల?॥ ౫౬॥

సీ॥ అనవిని మది నాగ్రహంబంది శతకంఠుతోడ నిట్లనె మరుత్సు
తుఁడు గదిసి। యాదిదేవుని, దేవతారాధ్యు, ననఘాత్ము, శ్రీరాఘవుని
నిందచేసితేని। యాయువు దుఱుంగు నీకనుమాన మింక లేదు, దివిజులు చె
లఁగి నిద్రింతురింకను। అంతంబునకు రావణాసురుఁడును రామునిటువ
లె దూషించి యిలనుగూలెఁ। గాన నీకును నెడలేదు కాలమింకను। నర
వరునిచేత నీమరణంబు నిజము। దురితవర్తివి, దేవతాద్రోహివరయ।
నిన్నుఁ గనుఁగొన్న దోషంబు నిష్ఠురాత్మ!॥ ౫౭॥

ఉ॥ నీవెటువోయెదింక? మఱి నేర్పున నీకెఱిఁగింపనేల? సీ। తావి
భుఁడెల్ల సేనల ముదంబున ముట్టడివేయఁబంచి, న। న్నీవిధితోడ నీహృ
దయమెల్ల నెఱింగియు వేగరమ్ము నే। నావలికార్యమెల్ల విశిఖావళిఁ జ
క్కఁగఁ జేతుఁబొమ్మనెన్॥ ౫౮॥

గీ॥ పురుషవర్గంబుచేఁజావుఁబొరయకుండ। వరముఁ జేకొంటిననే
డికావరమువలదు। మించిజానకితోడ నేతెంచినట్టి। ఢాకతలపోయుమ
నిచెప్పె రామవిభుఁడు॥ ౫౯॥

వ॥ అదియునుగాక బంధుమిత్రుల నాదరింపుచు, నాశ్రితులకు ని
ల్లుచూఱలిచ్చుచుఁ, బుత్రపౌత్రుల నలవరింపుచు, నరుచిపరిహారంబు
గా భుజింపుచు నిమ్మాడుదినంబులు సుఖియింపుమని యెఱింగింపుమని
యె; వెనుక నెడగలుగనేర దెన్నిభంగులఁ దనప్రాణంబు లఱచేతనుని
చి సంగరంబున కరుగుదెమ్మని పలికె; పిదపఁ గరుణాసముద్రుండు గా
వున నేరాఁ గ్రమ్మఱంబిలిచి శతముఖుండును సంగరంబునకు భయంబు
నొంది శరణుచొచ్చెనేని కాతునని యెఱింగింపుమనియె; అత్తైఱంగైన
నీవుచేసిన గోబ్రాహ్మణమునులబాధలు క్షమియించెదఁ జెప్పుమని పం
చినవచ్చితి; ఇచ్చట నిన్నుంబురికొల్పు తుచ్ఛరాక్షసుల నమ్మకుము; అ
తండాదినారాయణమూర్తి గాని నరుండు గాఁడు; ఇన్నియువిచారించి,
వైరంబు విసర్జించి, శరణుచొచ్చి బ్రతుకుము; అది సహింపక యున్న
యుద్ధంబున కరుగుదెమ్ము; పురుషులచేఁ జావులేదని తలఁచితివేని రా
మచంద్రుని వెంట జానకీదేవి చనుదెంచుటెల్ల భవన్నాశనంబునకుఁ గా
రణంబు; తదీయప్రభావంబు దెలిసెదనని తలంతువేని మీతల్లిఁ జిత్రె

గంధి నడుగుము; అమ్మహాదేవిచేత నీవు ద్రుంగుట సిద్ధంబని యనేక ప్రకారంబులఁ బలికిన నులికిపడి ప్రళయకాలాగ్ని చందంబున మండుచు, నూఱుమొగంబులు ముడివెట్టుచు, హనుమంతునిఁ జంపనిశ్చయించి, దూతధర్మంబు విచారించి, యవ్వేళకు నదరుడిగి యాస్థానంబునంగల మహాదానవు లద్భుతంబున వినుచుండ నిట్లనియె॥ ౬౦॥

శా॥ ఓరీ మర్కటా! మద్భుజాబలము పెంపూనంగ శంకించుచున్। ధీరంబెల్లను వీడి భృత్యులగతిన్ బృందారకుల్ గొల్వ, నా। హారాగ్నుం డగు మర్త్యుఁ జెప్పుచు భయంబందందఁ బుట్టించి నీ। వారూఢిన్ బహుభాష లాడెద వహా! ప్రాణంబులే యొల్లవో॥ ౬౧॥

సీ॥ పేర్చి పైఁబడఁబూని పెరిఁగి నల్దిక్కులనడరెడు కార్చిచ్చు నుడుపనేర్తు। సమయంబువచ్చిన జంఝానిలమునైన నెత్తి మెదలఁగనీక నిలుపనేర్తు। నాహవంబున జయంబనుకూలముగ మంత్రసిద్ధి జపంబులు సేయనేర్తుఁ। గడువేడ్కరథములఁ గరితురంగంబుల నడిపింప నేర్తు నర్ణవముమీఁద। నన్నియునుగాక పరమేష్ఠియిచ్చినట్టి। వరములున్నవి, జముసైన సరకుసేయ,। నట్టి యసమానబలశాలినైన నన్ను। జానకీరాము లెదిరింపఁజాలఁగలరె?॥ ౬౨॥

వ॥ అదియునుంగాక॥ ౬౩॥

సీ॥ మద్భీమతరనామ మహనీయమంత్రంబు సకల భూతగ్రహోచ్చాటనంబు। మద్బాహుదండంబు మత్తారినృపకుమారాచలాభీలవజ్రాయుధంబు। మచ్చండకోపంబు మానితబ్రహ్మాండభాండంబులకు నెల్లఁ బ్రళయకరము। మన్మందహాసంబు మనసిజకమలభవామరావళికెల్ల నమృతవృష్టి। సకలలోకంబులకు నేనె చక్రవర్తి। నట్టి నాయుద్ధతికి నిల్చి యధమునుఁ డైన। జనవరుండును, నబలగు జానకియును। దురము గెల్చెదరనుట యద్భుతముగాదె?॥ ౬౪॥

ఉ॥ ఇన్నియుఁ జెప్పనేల? వినుమీక్షణమందున నిన్నుఁ జంపి, రే। పున్నతవృత్తి నేగి నృపునుక్కణఁగించి, తదీయకోమలిం। బొన్నసుగంధిఁ దెచ్చి బహుభోగపరంపరఁ దేలుచున్ సుఖం। బెన్నఁగఁ గందు దైత్యా

లు భళీయని సన్నుతిచేయ వానరా!॥ ౬౫॥

ఉ॥ చిక్కితి వెందుఁబోయెదవు? చేకొని మ్రింగెద నిన్ను, రాము నిన్; దిక్కిఁక నేదినీకనుచుఁ దీవ్రరయంబున నాగ్రహించుచుం; బెకలిని శాటకోటులను బిల్చి వనేచరుఁ దుంపుఁడన్న, వా; రుఱ్ఱన నేగుదెంచి పటుహుంకృతి సేయుచు రాఁగ నుగ్రుఁడై॥ ౬౬॥

ఉ॥ ఓరి శతాస్య! నేనొకఁడ నూరక చిక్కితినంచుఁ బట్టఁగాఁ; గో రితి, చూచుచూడుమని గొబ్బున రాముఁదలంచి, వాయువున్; సారె కుఁజేరి, వాలము విశాలముగా రవిసోఁకఁజెంచి, దు; ర్భారశరీరుఁడై పెరిఁగె భగ్గున మంటలు మోముపుట్టఁగన్॥ ౬౭॥

ఉ॥ వెఱచిరి కొందఱత్తఱిని వీనిమహాకృతిఁజూచి, కొందఱుం; బఱ చిరి సందుసందులను, బల్విడి కొందఱు భీతిఁబోవలే; కఱచిరి, కొంద ఱప్పుడు శతాస్య! మముంగరుణింపుమంచుఁ బె; ల్లఱచిరి, యిట్టిరీతిఁగ డునాకుల మొందిరి దానవుల్ వెసన్॥ ౬౮॥

క॥ శతముఖుఁడును హనుమంతుని; హతమంతయుఁ జూచి భయ ము పల్లడిగొనఁగా; మతినడలుచుండెఁ దక్కిన; హితులును నిర్విణ్ణులై రి హృదయములులుకన్॥ ౬౯॥

మ॥ హనుమంతుండపుడుగ్రుఁడై దనుజలోకాధీశ్వరున్ డాసి, క్రో; వ్వననన్బట్టఁగఁ బూని తిప్పుడుమదం బువ్విళ్లనీ కేలఃయం; చును ఘోరాశ నిఁబోలుముష్టిహతిచే స్రుక్కంగ నద్దానవేం; ద్రుని నేలంబడఁ గూలఁగాఁ బొడిచె రుద్రుంబోలి లీలాకృతిన్॥ ౭౦॥

గీ॥ ఇట్లుపొడిచినఁ బడితలలెల్లబగిలి; యబ్బురంబుగ నెత్తురు లుబ్బి పాఱ; నపుడుమూర్ఛిల్లె; నతనిసింహాసనంబుఁ; జూర్ణముగఁదన్నెనసురు లుచోద్యమంద॥ ౭౧॥

గీ॥ తన్నియంతటఁబోకయద్దనుజవరుని; ద్రొక్కియున్నతలాటంబు దున్సితివిచి; మేపునను గొని, మెప్పటిరూపుతోడ; నచటవీడ్కొనిరఘు పతినాత్మదలఁచె॥ ౭౨॥

వ॥ ఇత్తెఱంగున రఘునందన చరణారవింద మకరందబిందుపరం

పరాస్వాదనానందేందిందిరుండై, మరున్నందనుండు తనకు నెదిరినదై త్యులంబరిమార్చుచు, సింహనాదంబు సేయుచుఁ గపిసేనాభిముఖుండై వచ్చివచ్చి, పురోభాగంబున సకలదళంబులతోనున్న సుగ్రీవునింగాంచి, యతనికిఁదద్వృత్తాంతంబుజెప్పి సంభావనలుగైకొని, అచటవీడ్కొని,సకలకపినాయకులు దన్నెదుర్కొని గాఢాలింగనంబు గావించి పెక్కుదెఱంగుల నభినందింప రయంబున నరుదెంచి, అనుజత్రయపుత్ర పౌత్రపరివేష్టితుండై జానకియుం దానును దనరాక కెదురుచూచుచున్న రఘువరుంగాంచి, వందనంబులు గావించి, అనేకవిధంబుల సన్నుతించి, ప్రతాపలంకాపురికిఁ దానరుగుటమొదలుగా శతకంఠుని తలలు పగులఁబొడుచుట తుదయునుంగా నంతయు నెఱింగించి, రేపు లగ్గకుదయుచేయవలయుననిన, హర్షించి యక్కునంజేర్చి సీతయుందానును బహుభంగుల దీవింపుచునుండెనంతనక్కడ॥ ౭౩॥

క॥ దనుజేంద్రుఁడంతకంటెను। మునుపడఁ దనమూర్ఛదెలిసి, మునుకొని సింహా। సనమును బొడియగుటకు వ్రతి। తనదు తలాటంబుఁ బోవ దానికినడలెన్॥ ౭౪॥

క॥ అడలి తనయిరుగెలంకుల। నడలుచుఁ గనుపట్టు బలునిశాటుల, హితులం,। గడుమంత్రుల నొగిమొగములు। ముడివడఁగాఁ జూచి భయదముగ నిట్లనియెన్॥ ౭౫॥

క॥ ఓయి సచివేంద్రులారా!। మాయురె! యిపు డొక్కకోఁతి మాత్రమెయిట్టుల్। చేయఁగ నిందఱు నేమియు। జేయఁగ లేరైతి, రేమిసేయుదుఁజెప్పుఁడా?॥ ౭౬॥

క॥ ఏలాగునమ్ముదును మీ। రీలాగున బిఱుకులగుచు నిట్లుండఁగ? నే। నేలాగు రామఁదునుముదు?। నేలాగున బంటులుగను నేలుదుమిమ్మున్?॥

క॥ అనిమనమునఁ గోపంబును,। ఘనతరశోకంబుఁ బెనఁగఁగాఁ, జింతాంభో। ధిని మునుఁగుచున్న దనుజేం। ద్రుఁ గనఁగొని మంత్రి యెల్లఁ దొడఁబడి కినుకన్॥ ౭౮॥

క॥ ఏమప్పుడ మేమఱుచో। నామర్కటుఁ డేగఁగాక, నటుచూ

డుము త। దా్రిమునిఁ జంపి, పఱాతని। కోమలిఁగొనివచ్చి నీకు గొబ్బు
ననిత్తుమ్॥ ౭౯॥

క॥ మాయట్టిమంత్రులుండఁగ। నీయదవదయేల నీకు? నిప్పుడె మ
స్తుం। బాయక పంపుము, యుద్ధము। చేయుదు మెడపళను నీదు చిత్త
ము రాఁగన్॥ ౮౦॥

క॥ వనజజుఁడొసఁగిన వరముల। ఘనత విచారింపఁ దగదె? కదిసి
ననీకున్। వనచరులన, నరవరులన। విను తృణమాత్రింబుగాదె వివరిం
పంగన్॥ ౮౧॥

క॥ సురలెల్ల నీకు వెఱచుచు। సొరిదిగ సేవింతురనఁగ, సురలు ప
నుపఁగా। నరుదెంచు బేలరాముని। సరకుంగాఁ గొనఁగఁదగునె? సంగ
రధుర్యా!॥ ౮౨॥

క॥ దనుజేశ! నీవుగడఁగినఁ। గనుఁగొనఁగా మృత్యువైనఁ గళవళ
పడు, న। వ్వనచరులును గినచరులును,। మనుజుఁడు గినుజుండు నిన్ను
మార్కొనఁగలరే?॥ ౮౩॥

క॥ అనిమంత్రులు బహుభంగులఁ। దనమదిఁ బురికొల్ప, నసురధ
వుడు మహారో। షనయనమనస్కుఁడై య। ద్దనుజుల మన్నించి చని
యెఁ దల్లి యెదుటికిన్॥ ౮౪॥

క॥ చనితల్లికి సాష్టాంగం। బొనరింపఁగఁ జూచి పుత్రు, నొయ్యా
నవిలస। ద్ఘనగాత్రుని, నుతమిత్రునిఁ। గనుఁగొని దీవించి చిత్రగంధిట్ల
నియెన్॥ ౮౫॥

గీ॥ అన్న! నీమొగమదియేమి విన్ననగుచు। నున్నదిప్పుడీ? వెన్నుఁడు
నుల్లమునను। వంతఁజెందవు, నేఁడిది వింతవాడమె। నేమి యెఱిఁగిం
పు నాతోడ నెద్దియైన?॥ ౮౬॥

సీ॥ అలిగెనో యుష్మదహంకారములు చూచి యుగ్రుఁడై యిపు
డు మృత్యుంజయుండు। మునులనేఁచితివని వనజసంభవుఁడొండె శపి
యించెనో కడుసాహసమునఁ। గింకరుల్ దానును శంకలేకకృతాంతుఁ
డురువడి దండెత్తెనో కడంగి। వరశరణాగతవజ్రపంజరుఁడగు రాముఁ

డే తెంచెనో భీమముగను। వీఁక నెఱిఁగింపు, విన్నయందాఁక నాకుఁ। గ
డుపులోపలఁ జెయివెట్టి కలచినట్టు। లున్నదిప్పుడు నీమోము విన్నదన
ము। గన్నయప్పటినుండి యక్కజముగాను॥ ౮౭॥

సీ॥ నావిని శతకంఠుఁడనియెఁ దల్లికి హనుమంతుండువచ్చిన మా
ర్గమెల్ల,। వచ్చి రామునిఁజెప్ప వాదించుతెఱఁగును, వాదించి కఱఁగిం
చు వైఖరియును,। బట్టంగ దైత్యులఁ బంపువెట్టుటయును, బంపువెట్టిన
వారిఁ బదరుటయును,। డంబుగాఁ దనదు రూపంబు చూపుటయును,
జూపి తన్నాఁగఁబొడుచుటయుఁ, బొడిచి। తనదుసింహాసనము గూలఁద
న్నుటయును,। బూని బిరుదుతలాటంబు వోవుటయును,। మఱలి వనచ
రుఁడేగిన మహిమమ్ములును। జెప్పినను విని, తల్లి మూర్ఛిల్లి తెలిసి॥ ౮౮॥

గీ॥ అన్న శతముఖ! మీతండ్రి యద్భుతంపు। వార్త నారదుచే విని
వచ్చి మున్ను। నాకెఱుఁగింప నెఱుఁగుదు, నీకునట్టి। గోప్యమంతయు
నెఱిఁగింతుఁ గోరివినుము॥ ౮౯॥

వ॥ జ్యోతిర్మయమగు నొక మహాశక్తి చతుర్దశ భువన నాయిక
యై ప్రవర్తిల్లుచుండి, తనస్వరూపంబగు ఓంకారస్వరూపంబున బ్ర
హ్మవిష్ణుమహేశ్వరుల నుదయింపఁజేసి జన్మపోషణలయకారులం గమ్మ
నినియోగించి, వారలకు సుఖంబులు గలుగుమని తనకళలచేమువ్వురు క
న్నియలంబుట్టించి, అందుశారదయను చెలినజునకు, లక్ష్మియను తరుణి
నచ్యుతునకు, గౌరియను నారి శివునకు దయచేసి ప్రపంచంబు నడుపు
చు, నందుఁదనపూర్ణకళయగు లక్ష్మినింబిలిచి యతిరహస్యంబుగా నిట్ల
నియె; త్రేతాయుగంబున నీదుభర్తయగు విష్ణుండు రాముండై రావణు
వధార్థంబునకు నటింపఁగలఁడు; తత్కాలంబున నీవు జనకునకు నుద
యించి జానకీనామంబున రామునితో మెలంగఁగలవు; రావణుమరణా
నంతరంబున శతముఖుండను నొక్క రాక్షసవరుండుపుట్టి పురుషులచేఁ
జావులేకుండ బ్రహ్మచేవరంబులుగొని తరుణులం దృణీకరించు; తన్నిమి
త్తంబున రామునివెంటనీవు చనియతనికి శక్యంబుగానిసమయంబున శ
స్త్రాస్త్రంబులుధరియించియుద్ధంబుచేయుము; అట్టియెడ నేవచ్చినీయం

దునావహించి నీచేతశతముఖునిం జంపించెదఁ జనుమనిపంచిన భవన్నాశనంబునకుఁ గారణంబగుచు సీతయననుదయించినయది యనిమత్రి యునిట్లనియె॥ ౯౦॥

సీ॥ సృష్టిపైవిష్ణుండు దుష్టనిగ్రహమునకై రాముఁడైపుట్టెనమరుల
లర। వలనొప్పనవ్విష్ణువక్షస్థలంబునఁ జెన్నొందుశ్రీదేవిసీతయయ్యె। స
రవినాతఁడుపూనుశంఖచక్రంబులు భరతశత్రుఘ్నులై పరఁగిరిప్పు। డా
శౌరిపర్యంకమైయుండు శేషుండుసౌమిత్రియైనమించె జగమునందుఁ।
గానరాముండుమనుజుండు గాఁడు, చూడ। నతనిఁగొలిచెడు కపులెల్లన
మరవరులు। గానిశాఖామృగంబులుగావు, నీవు। వారితోడుతవైరంబు
వలవదుడుగు॥ ౯౧॥

గీ॥ బ్రహ్మదేవునివలనలోఁబడినయట్టి। వరముమాత్రన గర్వింపవల
వ,దట్టి। బ్రహ్మ నీతండెపుట్టించెఁ బరఁగఁ, గాన। మించి తనతండ్రిపూ
న్కిఁదప్పించఁగలఁడె?॥ ౯౨॥

గీ॥ కాన రాఘవునెదురశక్యంబుగాదు। తవిలివారలపైవిరోధంబు
మాని। శరణుచొరుము,దురాత్ములఁజాడఁబోకు,। జగతిబెబ్బులిపైఁగో
లఁజాఁపఁదగునె?॥ ౯౩॥

సీ॥ అనిరామువిక్రమం,బతనితమ్ములలాగు, తనయులవిధమునుఁ,ద
రుణిసీత। మహిమంబులును, హనుమంతు తెఱఁగును, సుగ్రీవుఘనతఁ,
దత్సైతులగతియు,। బలములచలమును, గెలువరాకుంటయుఁ, దెలుచ
విభీషణుభేదములును,। దమనిజశక్తియు, ధర్మసంఘటనయుఁ, బాడి
యుఁ,గీర్తిసంపాదనమును। దెలిపియును,బుజ్జగించియుఁ, బలువిధము
ల। మనసుఁగలఁచియు, నీతిగాదనియు, భయము। లొదవఁజేసియు, బ
హుగతులూరడింప। నాగ్రహింపుచునుడుగక యసురవలికె॥ ౯౪॥

ఉ॥ రాముఁడువిష్ణుఁడంచును బరాక్రముఁ డంచును నెన్నఁజొచ్చి;
తా। రాముఁడువిష్ణుఁడైనఁదన రామను రావణుఁడుగ్రశూరుఁడై। ప్రే
మనుగొంచుఁబోవఁగ నభేద్యశరంబుఁగూల్పరాదె?యా। రామునిచా
పమైపెఁణె, పరాక్రమముంగనవచ్చెనిందులన్॥ ౯౫॥

ఉ॥ చూనుపఁగ విష్ణుఁడేడ? మనుజుండననేడ? మృషోక్తిచేత నా। మనసు కరంగఁ బల్కినను మర్త్యునకై భయమంద నేర్తునే?। యనుపమ యుద్ధమందు సురలౌనని మెచ్చ నృపాలుఁ జంపి, యా। తని తరుణీలలామను సతంబుగఁ గైకొను దెల్లకాలమున్॥ ౯౬॥

చ॥ అనుటఁ బ్రధానులన్, దొరల నాప్తుల మంత్రుల నక్కడక్కడన్। ఘనముగనుంచి, మించి పటుకాండపరంపరలేర్చి, సాహసం। బునఁ జతురంగముల్ బలిసిపొంగుచునుండఁగ, రాముఁదల్చుచుం। గనలుచునుండె దండి శతకంఠుఁడు చండతరాగ్నికై వడిన్॥ ౯౭॥

శా॥ రాముండుంబటుభేరి కాహళమహారావంబుమీఱంగ,నుద్దామస్థైర్యగుణాభిరాముఁడగుచుం దర్పించి,సైన్యంబులన్। వేమారుంబురికొల్పి,సారెకును మౌర్వీనాదముల్ పెల్లుగా। భూమింబిక్కటిలంగఁ జేసి,దినరాట్పుత్రాదులంబిల్చుచున్॥ ౯౮॥

శా॥ లగ్గల్వట్టుఁడుపొండుపొండని మహోల్లాసంబునంబంప,వా। రగ్గాఢధ్వనిమెండుగావినిమహోగ్రాకారులైకొమ్మలున్।నుగ్గుల్ సేయుచు,నయ్యగడ్తలును మిన్నుల్ముట్టఁగాఁబూడ్చుచున్। లగ్గల్వట్టిరిదేవసంఘములు చాలఁబొంగిదీవింపఁగన్॥ ౯౯॥

చ॥ జడిగొని పర్వతంబులుఁ గుజంబులు దెచ్చి కణంగి కోటలం। బొడిపొడిచేసి, యందుగల భూరినిశాచరకోటులన్ ధరం। బడపిడికిళ్లఁ జేనడఁచి, బాణపరంపర నుగ్గుచేసి, బ। ల్విడిని వనేచరుల్ దనుజవీరులతో ననిసేయఁబూనుచున్॥ ౧౦౦॥

వ॥ మఱియుననేక ప్రకారంబుల సకలకపివరులును లగ్గ యగ్గలంబుగాఁబట్టుచుండ వారితోడనే విభీషణు సైన్యంబులు వనచరభల్లూకశార్దూలరూపంబులం దలపడిరి; మనుజబలంబులును బట్టణప్రాసాదతోరణకుడ్యాదుల నమోఘబాణంబులం-బఱపి నేలంగలుపుచునుండిరి;శతకంఠునిబలంబులు నింతింతని గణుతింప నలవిగాకుండఁ గదిసిపూర్వపశ్చిమ సముద్రంబుల తెఱంగునఁ గోలాహలంబు సేయుచుఁ బిడికిళ్లం బొడుచుచు గదలనడఁచుచుఁ గఠినపదంబులందన్నుచు దీర్ఘదంతంబులం

గఱచుచు మోఁచేతులఁ దాటింపుచుఁ బలువిధంబులఁ బెనంగుచు గజంబులకుంభస్థలంబులు పగుల మోదుచు హయంబులం బడవ్రచ్చుచు రథంబులు భగ్నంబులు గావింపుచు రథికులం గూల్చుచు సారథులం ద్రుంపుచు భటులనందఱం ద్రెంచుచు నపారయుద్ధంబు గావింప, వనచరభల్లూకశార్దూలమనుజబలంబులెల్ల విఱిగిపాఱె, క్రమ్మఱం బురికొని దైత్యులమీఁదం గదిసి గదలు ద్రుంచియు ముసలంబులు పొడిగావించియుఁ జాపంబులు విఱిచియు నఱచేతులం జఱచియు గళంబులు ద్రొక్కియు నింగికి ముట్టనిక్కియు నఖంబులం జీరియుఁ గుంభికుంభంబులం బగులం బొడిచియు నలుకలు మీఱియుఁ బ్రతిపక్షులం దఱిమియు వాలంబుల మెఱిమియు ముష్టిహతులం గ్రుమ్మియు వాలరోమంబులం జిమ్మియు గుఱ్ఱంబుల నదిమియు గుంజరంబులం ద్రుంచియు రథంబుల నుగ్గుచేసియు రథికులం ద్రోచియు సారథులం జంపియు శరంబులం ద్రెంచియుఁ బెక్కుచందంబుల నుక్కుమెఱసి యక్కపివరులు పోర, వారలం గని హర్షించి, రామలక్ష్మణభరతశత్రుఘ్నులును దనుజులపై నందంద నలిగి యాగ్నేయసాయకంబులు పఱపినఁ గూలు నేనుంగులును నేనుంగులతోడనే వ్రాలు హయంబులును హయంబులతోడనే పొడియగు రథంబులును రథంబులతోడనే మడియు రథికులును రథికులం గని పొరలు సారథులును సారథుల దురవస్థలం జూచి తలంకు భటులును విఱుగు విండ్లును నుఱుమగు శరంబులును బఱియలగు గదలును దునియలై పడిన ముసలంబులును భిన్నంబులగు పట్టిసంబులును నుగ్గులగు ప్రాసంబులును దుత్తుమురులైన శూలంబులును బడిన భిండివాలంబులును దన్నుకొని నెడి దైత్యులును జచ్చినవారి దాపునఁ జచ్చినయట్ల కదలక యుండు రాక్షసులును గతజీవులైన దనుజులును జొత్తుపాపలవలె నెత్తుటం జొత్తిల్లు నిశాచరులును నవయవంబు లేర్పడక తునిసిన నక్తంచరులును శోణితప్రవాహంబులును బ్రవాహంబుల నీఁదులాడు భూతభేతాళశాకినీఢాకినీగణంబులునుం గలిగి యైదహోరాత్రంబులు చరణతలఘట్టనోద్ధూతధరాపరాగంబుచేఁ ద్రికాలంబులును, సూర్యచంద్రికాజాలంబులు నేరుపఱపరాకుండఁ బోరి కపులు సింహనాదంబులు చేసిన, దేవతలును పుష్పవర్షంబు గురియించి యభ్రతలంబుననిల్చి

యాశ్చర్యంబునొందుచుఁ జూచుచుండిరి; బ్రహ్మాదేవ్యందును బ్రళయ స
మయంబు గాఁబోలునని కాలంబు లెక్కింపుచునుండె; ఏనును రజతప
ర్వతగహ్వరంబున నీతోడంగదలక యుంటిననిచెప్పినఁ బార్వతీదేవి మ
హాశ్చర్యమానసయై యటమీఁద నక్కలహం బేమయ్యెనని వినుచుండె
నంత॥ ౧౦౧॥

క॥ హతశేషులైనదానవు। లతిరయమునఁగడుభయాత్ములై నల్దిశ
లన్। గతిచెడి యఱచుచుఁబాఱిరి। మతిసంతసమంది కప్రులు మలయుచు
నార్వన్॥ ౧౦౨॥

క॥ గిటగిటమనుచును నెత్తుట। దొటదొప్పగదోఁగి, యపుడు తొ
ట్రుపడఁగాఁ। గటకటయనుచును, గుండెలు। తటతటనదరంగ, వివిధ
దైన్యములొందవన్॥ ౧౦౩॥

సీ॥ అదెవచ్చె నగచరు, లిదెడాసిరనుచును, గడుశరీరంబులు గం
పమొంద। నల్లదెకొల్లగా భల్లూకతతిమించి పొంచి యున్నారంచుఁ
బోకమరలి। మేదినీధరములుఁ బాదపంబులుఁ దమమీఁద వచ్చెనటంచు
మెలఁగి తొలఁగి। యెందుఁబోవుద? మింక నేదిదిక్కని తమచేష్టలు దఱి
గి మూర్ఛిల్లి, తెలిసి। పుడమిమీఁదను జదికిలఁబడుచు, నప్పు। టికిని లేచు
చు, నుఱుకుచు, తీవిమెరసి। కొలువులోపలఁ గూర్చున్న ఘోరవిమత।
లుంఠనపాత్రభవుని, శతకంఠుఁగనిరి॥ ౧౦౪॥

శా॥ ఇమ్మాడ్కిన్ శతకంఠుఁగాంచి, మదిలో నేర్పున్ భయంబుం
దగం। గ్రమ్మన్ఁసాగిలిమ్రొక్కి, యకంపుల రాకల్ మళ్లి వీక్షింపుచున్,।
దిమ్ముంజేకొని పిల్చినంబలుకక, కెంతే ఖిన్నులై సారెకుం। దమ్ముం గావు
మటంచు నిల్చినను దద్దైత్యేంద్రుఁడాశ్చర్యుఁడై॥ ౧౦౫॥

గీ॥ ఓరి దానవులార! మీకల్లములను। వగవనేటికి నేనుండఁగావలవ
దుడుగుఁ। డేమివృత్తాంతమంతయు నెఱుఁగఁజెప్పుఁ। డిప్పుడే చని విద
లింతునెల్ల రిపుల॥ ౧౦౬॥

గీ॥ అనుచుఁ బలుమఱు నుడువఁగా నపుడుకొంత। మాట పొందె
ఱిఁగియును, నేవఁఱకయతని। కభిముఖంబుగాతోనిల్చి, యఖిలమంత్రి। వ

రులు విన నిట్లు పలికిరి వానితోడ॥ ౧౦౭॥

సీ॥ దనుజేంద్ర! మేము మీపనుపునఁజని లగ్గపట్టిన వనచరప్రకర ములును। బెక్కువిధంబుల నుక్కునఁబోరాడి నెఱితప్పి మఱిచాల నేలఁ బఱచి। వెండియుఁ బరికొని విపులవాలంబులఁజుట్టియు ముట్టియు నె ట్టుకొనుచుఁ। గఱచియుఁ జఱచియుఁ గఠినశైలంబుల నడఁచియుఁ బొ డిచియు నలుక మెఱసి। యుండునంతటఁ, బ్రళయకాలుండు వోలె। రా ఘవుండగ్నిబాణపరంపరలను। గప్పినను మనసైన్యంబు గలఁగి తలఁగి। పాఱఁగాలేక దగ్ధులై పడిరి యచట॥ ౧౦౮॥

సీ॥ స్తనితభాషుఁడుచచ్చెఁ; శార్దూలవదనుండు మడిసెఁ; రక్తాక్షుఁ డు మహిఁగూలెఁ;। గతజీవుఁడయ్యెఁ బింగళనేత్రుఁ; డవనిపైఁ గూలె నగ్నిముఖుండుఁ; గుంజరాంగుఁ। డీల్గెఁ; గరాళుండు నిలఁగుప్పింకెఁ; గ పిలదంతుఁడుచచ్చెఁ; శూలుండు పుడమిఁగలిసెఁ;। జితుప్రిందుఁ గరకాశ గాత్రుండు మొదలైన బంటులు పీనుఁగు పెంటలైరి;। యేము గొందఱ మిటకు నీకెఱుఁగఁజెప్పఁ। జావునకుఁదప్పిరాఁగ నీజాడఁగంటి,। మనురవి లయంబు సమకూఱె నకట! మీకు। క్షేమిచెప్పుదు మవ్వార్త లేము నొ డివి॥ ౧౦౯॥

చ॥ అనవిని యట్టహాసము రయంబునఁ దానొనరించి, నేతదోఁ। గిన యనలంబుచాడ్పునను గెంటకమండి, సమస్తలోకముల్ । మునుకొ ని మ్రోంగఁబూను పెనుమృత్యువురీతిని హుంకరింపుచుం,। దనదుప్రధా నులన్ హితులఁ దప్పక కన్గొని వారికిట్లనెన్॥ ౧౧౦॥

ఉ॥ వింటిరెమంత్రులార! మనవీటి నిశాటులఁ బంపి, కోఁతులం। గంటకమొప్పఁజంపి, నృపకాంతుని రాముని నేలఁగల్పి, నా। కంటకమె ల్లఁబాపి, కలకంఠిఁ, బల్లవపాణి, జానకిన్। వెంటనె తోడితెండనుచు వేగనపంపిన శౌర్యహీనులై॥ ౧౧౧॥

చ॥ మడిసిరి దైత్యులంచు, నొగిమాత్రుల మానవ వానరావళిన్। విడువక చంపివచ్చి, ఇఁకవీరల నేమనువాఁడ, నిప్పుడే। తడయకపోయి రాఘవునిఁ దమ్ములతోఁడుతఁజంపి కోఁతులం। బొడవడఁగించివత్తు, నిఁక బూమెలుగాదె బలంబుఁబంపినన్॥ ౧౧౨॥

చ॥ కదలఁడు నాసహాయమున గంధగజాశ్వరథాదులేర్పడన్। వదలక శత్రులందునిమివత్తము; వచ్చి ధరాసుతామణిన్। గొదకొని తెత్త మిట్టియెడఁ గోఁతులు గీఁతులు నాకునడ్డమే?। కదనమునం దెదిర్చినను ఖండలుచేతు సురేంద్రుఁడైననున్॥ ౧౧౩॥

చ॥ అనవిని మంత్రులెల్లఁ బటుహుంకృతిమీఱఁగ లేచినిల్చి యో। దనుజవరేణ్య! నీవనుపఁ దారొక్క నరాముఁడనంగ నెంత? పె। ల్లనలమునైనమ్రింగెదము, యాజినిమృత్యువునైననోర్తు, మ। వ్వనచరులేమిలెక్క? జయవర్ధన! ఘోరతరారిమర్దనా!॥ ౧౧౪॥

సీ॥ భండనవేది యేర్పఱచి, పతోక్రోధాగ్ని దరికొల్పి, పటుశరస్తంభమునను। బఱఁగ విభీషణుఁ బశువుగబంధించి, కపిసమిధల నవకముగ వేల్చి,। వెలఁగుచు నసిపత్త్రస్రుక్స్రువంబుల నేర్చి, రక్తమాజ్యంబుగాఁ రమణచేసి,। తనయసహోదరతతులతో రాముని బూర్ణాహుతిగ వేల్చి, భూరిజలధి నవభృథస్నానములుచేసియలరుసోమ। యాజివైయుండుమీవు, మేమపుడు హోత। లనఁ జెలంగుదు, మీయుద్ధమనుమఖంబు। చేసిననుగాని త్రిజగత్ప్రసిద్ధిగాదు॥ ౧౧౫॥

మ॥ అనియిక్కైవడి మంత్రులాడఁగఁ, దదీయాలాపముల్ మెండుగా। విని దైత్యేంద్రుఁడు మిన్నుముట్టి, సకలోర్వీభాగముం గంపిలన్। మనుజేంద్రుం దృణలీలఁ ద్రుంతునని దుర్మార్గంబునం దల్చె; నెం। దఁ నోగింజచ్చెడివారికన్యజనవృత్తుల్ గానఁగావచ్చునే?॥ ౧౧౬॥

మ॥ మఱియుం బెక్కువిధంబులం గనలుచున్ మత్తేభముం బోలెమై। మఱచెం బ్రోద్ధతుఁడై నిలింపతతి పల్మాఱున్ భయంబందఁగా। శిరముల్ నూఱిట దివ్యసన్మకుటముల్ చెన్నొందఁగాఁ బూని భా। సురమార్తాండశతంబురీతి ముఖముల్ సొంపార భాసిల్లఁగన్॥ ౧౧౭॥

ఉ॥ ఆరయనింద్రపావకయమాసురపశ్చిమరాణ్మరున్మహా। దారకుబేరముఖ్యభయదస్ఫుటఘోరతరంబు గండపెం। డేరము వామపాదమున దీవిగఁ బెట్టి, కరంబులన్నిటన్। భోరున నస్త్రశస్త్రములు పూని రణంబునకుత్సహింపుచున్॥ ౧౧౮॥

చ॥ దనుజులునూఱుకోట్లుతనుదట్టముగాఁ గొలువంగ, దివ్యకే। తన
మణిచక్రషోడశ సుధాకరవద్వివిధాతపత్రవే। గనయసహస్రచిత్రతుర
గప్రకటా సమసూతఘంటికా। స్వనయుతవిస్ఫురద్రథము చయ్యననె
క్కెజగంబుకంపిలన్॥ ౧౧౯॥

ఉ॥ అప్పుడువారిధుల్గలఁగ, సప్తదిగంతమదేభయూథముం। దెప్పి
ఱిలేకమూర్ఛిలె, మదిన్భయమందుచులచ్చివిష్ణుఁడున్। గుప్పునఁగౌఁగిలిం
చె,నదిగో మనపాలిఁటి మృత్యువండఱు। జప్పరిసేయవచ్చెనని చయ్యన
డాఁగిరిదేవసంఘముల్॥ ౧౨౦॥

చ॥ పదువురుమంత్రులున్ యముభంగిని దండములుగ్రచిత్తులై। వ
దలకపూని, భేరులరవంబులుమిన్నులు ముట్టగంధదం। తిదశకరాజినె
క్కి,నలుదిక్కులుద్రవ్యులుగాఁగ నార్చుచుం। బొదలుచునాశతాననుని
భోరునఁగొల్చిరితేజరిల్లుచున్॥ ౧౨౧॥

చ॥ హరిరఘురాముఁడంచును, రమామణిజానకియంచు,వానరుల్।
సురవరులంచు; గెల్పులికిఁ జొప్పడవంచు,రణంబు సేయకే। మరలుమ
టంచుఁదల్లిపలుమాఱును దూతలఁబంప, నాత్మలో। నిరుపమవిక్రమస్ఫు
రణనెట్టుకొనన్వినఁడయ్యెనత్తఱిన్॥ ౧౨౨॥

క॥ నానాముఖములననఱచెడి। సేనామధ్యమునఁ జంద్రశేఖరుమా
డ్కిన్। మానుగ శూలము భుజమునఁ। బూనుక రణకాంక్షవెడలె భు
వనములులుకన్॥ ౧౨౩॥

సీ॥ ఆవేళఁగంకగృధ్రావళిపురివిచ్చియాడఁగాఁదొడఁగె శతాస్యు
మీఁదఁ,। గరము నెత్తురువానగురిసె సేనలమీఁదఁ, బిడుగులువడఁజొచ్చెఁ
బుడమివణఁక,।వరదులంతంతకువాపోయెఁదలలెత్తి, వెసఁగొన్ని గొడు
గులువిఱిగిపడియె,। నెదురుగానేతెంచెనేప్రుమైఁబెనుగాలి, మురువేదితు
రగముల్ వేఁతలుడిగెఁ,। గడువిలాపించియొఱలె నాకాశవాణి,। చెలఁగి
యుద్ధంబుగావచ్చెఁ జెవులపోతు,। మఱియుముందటనొకమహామలినమైన। విధవరాలేడ్చెఁ బోయిన విభునిఁ దలఁచి॥ ౧౨౪॥

మ॥ అవియెల్ల న్వెసఁ గాంచియున్ వికృతకోపావేశుఁడై పూని

శాం। తివిధుల్ దానోన్నరించి, మానసమునన్ ధీరాత్ముఁడై, భేరికా। వివి
ధానేకమృదంగనాదము మహోర్విం బిక్కటిల్లంగ భై। రవమూర్తి ప్ర
తిబింబమై తరుచరవ్రాతంబులన్ దగ్గఱెన్॥ ౧౨౫॥

శా॥ ఈరీతిం గడుడగ్గఱం గపులు దైత్యేంద్రున్విలోకించి, కం। భీ
రంబుల్విడి హస్తకీలితధరాభృత్పాదపశ్రేణి ని। స్సారంబొప్పఁగవైచి,
దానవమహాసైన్యంబు పెల్లార్వఁగా। మేగల్దప్పి వణంకుచుం బఱచి రె
మ్మెల్మూలి యాడాడకున్॥ ౧౨౬॥

సీ॥ గిరిగహ్వరములకేగిరి మోహరంబులువిడిచి కొందఱుకపులడఁగు
కొనుచు। రూపముల్డాఁచివిరూపముల్గైకొని వ్రాలిరికొందఱువసుధ
మీఁద। దండముల్గొనియుఁ దద్దండముల్పనికిరావని కొందఱసురులవి
నుతిఁజనిరి। రామచంద్రుండెపరామరి సించునటంచు నల్లనశరణసిరికొం
ద। ఱిట్టితెఱఁగునవానరు లెల్లదిశల। బఱవ వారలఁగనుఁగొని భానుసు
తుఁడు। వారలకు రాముఁగేల నొయ్యారముగను। జూపి యిట్లనె సైన్య
ముల్చోద్యపడఁగ॥ ౧౨౭॥

సీ॥ ఈరఘునాయకుం, డినవంశరత్నంబు, జగదేకవీరుండు, శౌర్య
ఘనుఁడు,। వరశరణాగతవజ్రపంజరుఁడు, దానవసంహారుఁడు, ధరా
నాయకుఁడు,। జానకీహృదయరంజనచరిత్రుఁడు, పవిత్రుఁడు, వికచాబ్జ
నేత్రుఁడు, కృపాత్ముఁ। డీశతకంఠునినిప్పుడేతృణలీల మడియింపుచున్వాఁ
డుమనకునితఁడు। దాపుఁబ్రాపునుదల్లియుఁదండ్రియగుచు। నుండమీకేల
భీతిల్లియుఱుకుచుండ। రందురందురయంబున రాముకడకు। ననుచుమఱ
లించెఁదనదుసైన్యములనెల్ల॥ ౧౨౮॥

మ॥ మఱలింపంగపిసైన్యముల్గిరివరక్ష్మాజవ్రజంబుల్మహోగ్రరయ
గ్రంబులఁబూని, పెల్లుగజగత్కంపంబుగానార్చి, యో। ధరణీనాయక!
మమ్ముఁబంపుమసురన్ ధాత్రీస్థలింగూల్చి మీ। చరణంబుల్ గనుఁగొందు
మంచును రణోత్సాహంబునన్బల్కఁగన్॥ ౧౨౯॥

శా॥ రాముండున్ముదమంది, వచ్చెడిమహారక్షోగణాధీశ్వరో। ద్దా
మప్రాభవమున్, శతద్వయవిదోర్దండప్రచండత్వమున్,। మోమూల్నూ

బును, దస్మశ్రప్రకరసంభూతానలజ్వాలలున్। వేమఱుం గని కోపమున్ భయము నావిర్భూతమై చూచుచున్॥ ౧౩౦॥

మ॥ నరనాథుండు విభీషణుం బిలిచి యన్నా! యీ మహాకారుఁడీశ్వరుఁడో? చండకృతాంతుఁడో? యనలుఁడో? చర్చింపఁగా మృత్యువో? ధరపై నెవ్వఁడు వీఁడు? పీనిఁ గని చిత్తం బంతయున్ భీతిలెం, గర మొప్పన్ వనుపింపుమా యెఱిఁగెదన్, గర్వంబు పోకార్చెదన్॥ ౧౩౧॥

మ॥ అనినన్ దేవ! మహానుభావ! విను వీఁడాఖిలతన్ ధైర్యశౌర్యనయుండై నశతాననుండు, బహుమాయావర్తనుం, డస్త్రవిద్యానిపుణుండు, వీని యుద్ధమునఁ బోరాడం గశక్యంబుగా దునరేశాగ్రణి! యెట్లో కాని వరరాడ్దుర్వారుఁ డీతం డిలన్॥ ౧౩౨॥

మ॥ దనుజాధీశుని యంగమందుఁ గల రక్తం బింతయు ద్ధాత్రిపై నొనరంగాఁ బడెనేని నూర్వ్యురుశతాస్యుల్ సంభవంబై రణంబునకి ట్టాడుదు రిందు కేమి తెఱఁగో? పోరాడ నెట్లోర్తురో వనచారుల్? వనజాతజాతు వరగర్వం బెట్లు నాశిల్లునో?॥ ౧౩౩॥

గీ॥ ఇతని చేత నుమనబలం బెల్లఁ ద్రుంగు నితనిఁ గెలువంగఁ జొప్పడ దెవ్వరికిని నుర్విఁ బురుషులకి తేఁడ జేయుండు గాన నెట్లు జయమందునో మనకెఱుఁగ రాదు॥ ౧౩౪॥

వ॥ అనిమఱియుఁ బెక్కు చందంబుల విభీషణుండు శతకంఠుని ప్రకారంబు లెఱిఁగించి నృపవరా! యుద్ధంబు సేయునెడ నద్దానవేంద్రునిపై నాగ్నేయబాణంబు లేమఱక యేయుచుండుము; దానం జేసి రక్తబిందువులు ధరం బడనేరవు; అందువలన ననేక శతకంఠోద్భవంబు మిథ్య యగునని యెఱిఁగించి, తత్తత్ప్రిధానుల మహిమంబు లెఱింగించి, వారివారికిం దగిన తూరుల నేర్పరించి, యింక నాలస్యంబు దగదనుచుం జెప్పి, హనుమంతుని వీక్షించి మహాత్మా! యిట్టి సమయంబున నెల్లై నంగెలుపు సమకూఱం జేయు మదియునుంగాక నాపైని దానవుండెప్పుడు విగ్రహింపుచునుండుఁ గావున నన్ను నేమఱక కాపాడుమనిన నోడంబడి రాముని సాన్నిధ్యంబున వాలంబు ద్రిప్పుచునుండె; భరతశ

త్రుఘ్నలక్ష్మణ కుశలవ విజయసుగ్రీవాంగదులును మిన్నువగుల నార్చుచుఁ బరివేష్టించి యుండిరి; రాముండును ధనుర్గుణటంకారరవంబుల దిశలు బగిలింపుచు నమోఘశరంబు లేర్పరింపుచు సీత కభయంబు దెలుపుచు, లక్ష్మణుం బురికొల్పుచు ననేకవిధంబుల విజృంభించుచునుండె; అంతనుభయబలంబులుందలపడి శరవర్షంబులు గురియింపుచు, శైలంబులు ఱువ్వుచుఁ, బాదపంబులనడఁచుచు బహుగతులం బోరఁ జొచ్చిన, దేవగంధర్వ విద్యాధర గరుడకిన్నర కింపురుషాదు లభ్రతలంబున నిల్చి యమ్మహాకలకలంబాకర్ణింపుచుఁ జూచుచుఁ బరమాశ్చర్యంబు నొందుచుండిరి; బ్రహ్మదేవుండును మనంబున వగచి, యిట్టివరంబులేలయొసంగితి వద్దురాత్మునిచే నఖిలకపి నరరాక్షస ప్రళయంబు సమకూఱుచున్న యదియని యింద్రాదులెగ్గింప విన్ననై యుండె; ప్రళయకాలావసానంబున నొదవు సకలభువన సంహారంబు ననుకరించి యుభయకటకంబులయందును భీభత్సంబై యుండెనంత॥ ౧౩౫॥

సీ॥ ఈపాటిమాంసంబు లెన్నఁడు లేవని మేచియుప్పొంగు పిశాచములును। బాటించి దాఁటించి మేటినై యాడకాడఁ దాండవములాఁడు ఢాకినులును। ఢాకినీగణముల డాసి మెదడుఁ ద్రావి యొకిలింపుచుఁ జను శాకినులును। శాకినీకులముల దీకొని నెత్తుట నోలలాడి చను భేతాళతతులుఁ। గదిసిపురివిచ్చియాడెడి కాకములును। గేరికాకులగమకించు గృధ్రములును। గలిగి, కావిరి దిశలెల్లఁగప్పి, దివము। సంధ్యయును రేయుఁ దెలియనశక్యమయ్యె॥ ౧౩౬॥

శా॥ అరిందమసైన్యముల్ ధరణిపై నందందఁ గూలంగఁ, దాఁ। క్రూరక్రోధమనస్కుఁడై దివిజులాఘోషింపఁ గాలానలా। కారంబొప్పఁగ దీర్ఘజిహ్వుఁ డురుసంగ్రామంబు గావింపుచో। నారూఢిం గపిసేనపైఁ గవిసె నుద్యత్ప్రాభవంబేర్పడన్॥ ౧౩౭॥

వ॥ కవిసిన నుగ్రరాక్షసునిఁ గన్గొని రాము ననుగ్రహంబునన్। వివిధశరంబులేయుచును వేగమునన్భరతుండొగిన్మహా। గ్రవిశిఖమానిశాచరుఁడుగ్రగఱ్ఱునసేసినదానినొంచి, భై। రవరవమేర్పడంగణఁగి రాక్షసుఁ గన్గొని యప్పుడిట్లనెన్॥ ౧౩౮॥

ఉ॥ ఓరినిశాచరుండ! వినుముగ్రరణంబుననిల్చి నేర్పుతోఁ। బోరుము
చూచెదన్, యముని ప్రోలికి నిన్నుఁ దృణాకృతి న్మహో । దార శిలీము
ఖంబుల హతంబుగఁజేసి,వనేచరావళిం। జేరి ముదంబు నెక్కొనఁగఁజే
తు నిమేషములోన నిచ్చటన్॥ ౧౩౯॥

చ॥ అనవిని దీర్ఘజిహ్వుఁడు దురాగ్రహుఁడై భరతున్, ధనుర్గుణ।
స్వనబధిరీకృతాఖిలదిశావలయుంగని యోరి!చూడరా। మనుజకులాధ
మాధమ!సమర్థునకున్బహుభాషలేలరా?।కనదసిధారచేఁగదిసిఖండలు
చేయుదునిన్నుఁజూడరా॥ ౧౪౦॥

చ॥ పడిననినుంగనుంగొని నృపాలుఁడు రాముఁడువచ్చెనేని యు। ప్ప
డమినిఁగూల్తు,నందులకుఁబోరవిభీషణుఁడడ్డనేనిబ।ల్విడి మెడఁద్రొక్కిచం
పెద నవీనబలంబున, వానికై యజుం। డుడుగకవచ్చెనేని తగనుక్కణఁ
గించెద నొక్కవ్రేల్మిడిన్॥ ౧౪౧॥

ఉ॥ నావిని రాఘవానుజుఁడు నవ్వుచు నొక్క యమోఘబాణ
మా। దేవతలెల్ల దీవెనలుతీవ్రముదంబున నిచ్చిమెచ్చఁగా। వావిరినారిఁ
బూని, కులవర్ధనుఁడై తగనిండఁదీసి,యా। రావముమీఱనేసె బవరంబు
న దైత్యునిజిహ్వ ద్రెవ్వఁగన్॥ ౧౪౨॥

శా॥ జిహ్వానష్టమునొంది దానవుఁడు కస్త్రిం దోఁగి, యుద్ధక్రియా।
ఒంహుండై పరిశయాగ్ని కైవడిని వైరంబొప్పఁగా మండుచున్। సింహ
ధ్వానముచేసి,యఃబ్భరతుపై శీఘ్రంబునంజండరా। ద్రాహ్వాస్త్రంబొగి
నేయఁబూనిన, నతండాఖిలశౌర్యంబునన్॥ ౧౪౩॥

శా॥ ఆటోపప్రబలప్రతాపచటులోగ్రాకారుఁడౌచు,న్నరా। ఘూ
టాగ్న్యస్త్రశరంబునం దను మహీకాంతుండు మెచ్చంగన। క్రాటాధీశుని
హస్తముల్ దునిమె, ధైర్యప్రౌఢిమన్ వేల్పులున్। సూటిన్ సన్నుతిసేయ,
వానరబలస్తోమంబు పెల్లార్వఁగన్॥ ౧౪౪॥

ఉ॥ నాలికయుం గరంబులుఁ దృణంబులరీతినణంగఁ,బావక। జ్వాల
లుచూపులం దొలఁగఁ జయ్యనమండుచు, నట్టహాసమా। భీలతఁ జేయు
చున్,భరతుఁ బెల్లుగ్రమింగెదనంచు మృత్యువుం। బోలిమహోగ్రతం గవి

సిపొంగివనేచరులెల్లభీతిలన్॥ ౧౪౫॥

ఉ॥ అర్కకులేంద్రుఁడున్ దనుజునల్లనఁజూచియమోఘవృత్తిమైఁగ
ర్కశభల్లమొక్కటిముఖంబున మంటలుగ్రమ్మఁబూనుచో। మార్కొని
యార్చియేసినను, మత్తనిశాచరు మస్తకంబొగిం। బేర్కొనిత్రుంచి నేలఁ
బడ బిట్టుగఁ ద్రోచె భయప్రదంబుగన్॥ ౧౪౬॥

గీ॥ అట్లుభండనముననవనిపైఁబడుదీర్ఘ। జిహ్వుపాటుఁజూచి శిఖి
ముఖుండు। కణఁగివిలయకాలకాలభైరవుఁబోలి। బలిమిమెఱసికలిసె భ
రతుమీఁద॥ ౧౪౭॥

గీ॥ అన్నమీఁదఁగవియునట్టిదురాత్మునిఁ జూచిబలములెల్లఁ జోద్య
మంద। శత్రుభీష్ముఁడైన శత్రుఘ్నుఁ డొగి నేసె। నర్ధచంద్రబాణ మతని
మీఁద॥ ౧౪౮॥

గీ॥ శిఖిముఖుండు దానిజీర్ణంబుగావించి। యతనిమీఁదఁబఱపె నైం
ద్రశరము। దాని నడుమఁ ద్రుంచి దైత్యుపై సురగాస్త్ర। మేసె దను
జసేనలెల్లనులుక॥ ౧౪౯॥

మ॥ సరగన్గారుడబాణమేసి యురగాస్త్రం బుచ్చిపోఁజేసి, యీ।
శ్వరబాణత్రయమూఁచి దుర్మదమునన్ శత్రుఘ్నుపైనేయ,నా। శర
ముల్ దేహముగాఁడిసొమ్మసిలి గర్జాతర్జనల్ మీఱఁగా। నసుదారంగుపితా
త్ముఁడై ప్రళయకాలాభీలతం బొంగుచున్॥ ౧౫౦॥

మ॥ నరనాథానుజుఁ డంత నుగ్రుఁడగుచు న్నారాయణాస్త్రంబు
విం। టరయంబొప్పఁగఁబూని నిర్జరులు మింటన్ సన్నుతింపంగ,నా। బ్బుర
మేపారఁగనార్చి వేయు, నది యాభూమంతటన్నిండివి। స్ఫురదగ్నిప్రక
రంబులీనుచు రిపుక్షోభంబు గావింపుచున్॥ ౧౫౧॥

మ॥ చనుదేరన్ భువనంబులెల్లనదరెన్, సప్తాచలంబుల్ భయం। బు
ననందందవణంకె, నింకెసకలాంభోధుల్, గతుల్ దప్పిరి। య్యినచంద్రుల్,
వెసగ్రొక్కెదిగ్గజచయం, బేపారఁగాలాగ్నిచ। య్యనవావిర్భవమయ్యెఁ
దచ్చటులదివ్యాస్త్రప్రయోగంబునన్॥ ౧౫౨॥

గీ॥ అమ్మహాకాండమీక్షించి యాసురవరుఁడు। బిట్టువణఁకుచు నటు

మొఱవెట్టుచుండ । వచ్చిచిచ్చులుగురియుచు వానిశిరము । ధరణిఁబడఁ
ద్రోచె దైత్యులుతల్లడిల్ల ॥ ౧౫౩ ॥

గీ॥ శిఖిముఖుఁడు కూలుటకు వానిసఖుఁడు కినుక । నుగ్రుఁడై స్థూలకం
ఠుఁడత్యుగ్రశూల । మపుడు హస్తంబునను బూని యమరులడల । రూఢిఁ
బోరాడఁగవిసె శత్రుఘ్నుమీఁద ॥ ౧౫౪ ॥

సీ॥ స్థూలకంఠుని బాహుశూలంబు వీక్షించి లక్ష్మణుండతనిపై లా
వుమెఱసి । యడ్డంబువచ్చిసాయకపరంపర లేయ నసురమహారోషమంది
కినిసి । యాలంబులోఁగూలుమని శూలమపుడేసె, నేసినభువనంబులెల్ల వడఁ
కె, । భూనభోమధ్యమద్భుతముగా ననలంబునిండె, భయంబుందెన్నఁ బవ
రుండు, । నప్పుడెడఁజొచ్చి హనుమంతుఁ డాత్రిశూల । మెల్లసైనికు లల
రంగ నేపు మెఱసి । పద్మజాండంబు పటపటఁ బగుల నార్చి । విపులబాధు
ర్యుఁడై పట్టి విఱిచివైచె ॥ ౧౫౫ ॥

గీ॥ వరుస నమృతంబు గురిసిరి వాయుసుతుని । మీఁద నమరులు; దీ
వించె మేదినీశుఁ; డపుడు సౌమిత్రి సంభ్రమంబంది మాకుఁ । బ్రాణ
బంధుండవగుదని ప్రస్తుతించె ॥ ౧౫౬ ॥

గీ॥ వెండియును లక్ష్మణుఁడు మహోద్దండుఁడగుచుఁ । గౌశికుఁడు
దనకిచ్చిన కాండమొకటి । వింటసంధించి పెల్లార్చి విపులరోష । మొద
వ నాస్థూలకంఠుని నుర్విఁగూల్చె ॥ ౧౫౭ ॥

గీ॥ స్థూలకంఠుఁడు గూలినఁ జూచి కుపితుఁ । డగుచు యోజనహ
స్తుఁ డాహవమునందు । మెఱయ సౌమిత్రినొగిఁబట్టె మెదలకుండ । నత
ని చేతులు దెగవేసె నకళంకుండు ॥ ౧౫౮ ॥

గీ॥ హస్తముల్ పోవ యోజనహస్తుఁడపుడు । ఉశునిమిత్రింగెదననిమ
హాకోపమెసఁగఁ । దివిరి వక్త్రంబు దెఱచి యేతేరనప్పు । డరయఁ దూ
ణీరముగ నేసె నకళంకుండు ॥ ౧౫౯ ॥

గీ॥ మించి పదములు వేగమె తుత్రించివైచి । యఖిల వానరసేన లం
దంద నార్వఁ । దనదుచాపంబునను మహోద్దండశరముఁ । దొడిగి యోజ
నహస్తునిఁ బుడమిఁగూల్చె ॥ ౧౬౦ ॥

చ॥ కనలుచు నక్కుశాహ్వయునిఁ గాంచి దురాగ్రహుఁడౌచు దు
ర్ముఖుం। డనియెడువాఁడిటోరి మనుజాధిపనందన! నన్నుఁజూడరా। తు
నిమెదనిన్ను నిట్టెయని తోరముగా నరుదేర వానిఁ గ। న్గొని లవుఁడు
గ్రుఁద్దై పఱపె ఘోరశరంబులు చిత్రవైఖరిన్॥ ౧౬౧॥

ఉ॥ అప్పటిబాణముల్ నడుమనన్నియుఁద్రుంచి లవాఖ్యుమీఁదటన్।
గుప్పన నగ్నిసాయకము గ్రూరత నేసిన దాని లీలతో। నప్పుడు వారు
ణాస్త్రమున నట్టెయణంచి నిలింపులెల్ల బా। గొప్ప జయధ్వనుల్ సలు
ప నుగ్రశిలీముఖమొకఁటేర్చుచున్॥ ౧౬౨॥

వ॥ అద్దానవుని హస్తంబులుఁ జరణంబులు ఖండించి పిదప లీలమై
వానిమస్తకంబును ఖండించె; వానిమరణంబు గనుంగొని కోపతాపం
బులుమీఱ శూర్పకర్ణుండును, రక్తాక్షుండును, పింగళాక్షుండును, గ
జోదరుండును, త్రిముఖుండును గదిసి యొక్కపెట్టునఁ గుశలవులఁజం
పంబూనిన నెఱింగి వారలమహాస్త్రంబులుసూచి రాఘవుండు ప్రళ
యకాలాంతకుపగిది హుంకరింపుచు నందఱకు నన్నిసాయకంబులుబఱ
పి తలలుద్రుంచెనంత॥ ౧౬౩॥

చ॥ పదువురుమంత్రులు న్నృపులపాలును, భృత్యులపాలునైనఁ,
దా। నదవదనొంది రోఁజుచు శతాస్యుఁడు మృత్యువుఁబోలి నిక్కుచుం।
బ్రదరపరంపరల్ కడు నభస్థలమున్ భువియున్ మహానలా। స్పదముగ
నిండనేసె బహుభంగుల వానరులెల్లఁగూలఁగన్॥ ౧౬౪॥

వ॥ మఱియును బిఱుతివియక నూఱుబాణంబుల నంగదుంగూల్చి,
యిన్నూఱుశరంబుల సుగ్రీవునొంచి, యేనూరు శిలీముఖంబుల భల్లూక
పతిని మూర్ఛిల్లఁజేసి, అఖిలవానరులను క్షణమాత్రంబునంజమురివైచి,
క్రమ్మఱ దేశాధీశులంగదిసి కొందఱఁ బదతలంబున హతంబు గావించి,
యందఱ నొక్కపెట్టునఁ దనవక్త్రగహ్వరంబులం జొనిపి, మఱియును
హతశేషులగు మనుజవనచరబలంబులఁబోకార్చి, విభీషణునవలోకించి
వీనికతంబున రావణ కుంభకర్ణ మేఘనాద ప్రముఖానేక దానవ ప్రళ
యంబు సమకూఱెఁ, గులద్రోహియైన వీనిం దెగటార్చెదనని బ్రహ్మా

స్త్రంబు సంధించి సకలలోకంబులు దల్లడిల్ల నార్చి పేర్చి యేసిన నది
విలయానల కీలాకరాళంబును, మృత్యుంజయ ఫాలనేత్ర సంభూత మ
హోగ్రంబును, వీరభద్రకోపంబును, కాలభైరవోగ్రంబును గూడ నై
క్యంబునొందినవిధంబునం జనుదెంచెనొక్కో యని గరుడ గంధర్వ కిన్న
ర కింపురుష సిద్ధవిద్యాధరామరలోకంబులు హాహాకారంబులు సేయఁ
జిచ్చులుగురియుచు వచ్చి విభీషణు నవయవంబులు బంధించి నేలంబడఁ
ద్రోచె,నంతియ కాని రాఘవు కరుణాకటాక్షప్రభావామృతసంసిక్త శ
రీరుండగుటం జేసి చంపనోపదయ్యె; అవ్విభీషణుసైన్యంబులు నాడాడం
బఱచి డాఁగిరి; వెండియు నమ్మహాదానవుండు కుశలవ విజయ భరత శ
త్రుఘ్న లక్ష్మణులతోడంగూడ రామునివధియింపంబూని యొకరూపెట్టు
నధనుశ్శతంబులు ధరించి,బాణసహస్రంబుల హనుమంతుని వివశుఁగా
వించి, శరవర్షంబు గురియుచు నట్టహాసంబు సేయుచునరుదేర సీతామ
హాదేవి యతని భీషణగమనప్రకారంబు నిరీక్షించి, తనయాదిసహమ
హిమంబాకర్ణించి, శతకంఠునికిందప్ప నెవ్వరికిం గానరాకుండఁ గనుప
ట్టిన,శతముఖుండును నరవరునిఁజంపెదనని యార్చుచు డాసి పురోభా
గంబుననున్న జానకింగనుంగొనునవసరంబున నవబ్రహ్మలును, పదునా
కొండురు రుద్రులును, పన్నిద్దఱు సూర్యులును, త్రేతాగ్నులును, ము
ప్పదిమూడుకోట్ల దేవతలునుగనఁబడిన భయంబంది, యిదినాపాలిటి
మృత్యువుగాని యాఁడుదానిమాత్రంబుగాదని నిశ్చయించి, తానరుదే
రఁ దనతల్లి రణయాత్రకు ననుగ్రహంబు సేయకుండుటకును, క్రమం
బున దుర్నిమిత్తంబులు కనఁబడుటకును, సంగరంబునఁ దనప్రధానులు
బలంబుతోఁగూడ భస్మంబునొందుటకును జిత్తంబు వికలంబైన నేఁటికి
యుద్ధంబు సేయందగదు, రేపుచనుదెంచి సహోదరసహితంబుగా
రామునిందెగటార్చెదనని ప్రతాపలంకకరిగె; రామచంద్రుండును వి
షణ్ణహృదయుండై విభీషణు బ్రహ్మాస్త్రబంధవిమోచనంబుగా బ్రహ్మ
మంత్రంబులుచ్చరింపుచు, మూర్ఛిల్లిన కపులం దనహస్తస్పర్శచే నలవ
రింపుచుఁ, దమనిమిత్తంబునకై వచ్చిన దేశాధీశులం గని వగచుచు, రే
పు మగుడి దనుజుండరుదెంచు నెట్లొకో యని చింతింపుచు, సీతకు సంగర

చాతుర్యంబులు దెలుపుచు, హనుమంతుని వినుతింపుచునుండెనని మహాదేవుండెఱింగించిన విని పార్వతీదేవి శిరఃకంపంబుచేసి మహాత్మా! శతకంఠుండు మఱునాఁడరుదెంచి నృపులతో నెట్లుపోరె? సీత యేరీతి నతనిహతంబుచేసె? నెఱింగించి సంతుష్టంగావింపుమనిన నటమీఁది వృత్తాంతంబు పురహరుండద్రిజకు వినిపింప వినఁదొడంగెనంత॥ ౧౬౫॥

క॥ కదనామరవరతనయా! । సదమలచారిత్ర! రాజసన్నుతగా
త్రా!। మదననిభరూప! సంతత । మదశాత్రవహరణ! పోచమత్మ్యార
మణా! ॥ ౧౬౬॥

గద్య॥ ఇదిశ్రీమదేయకూర్తినివాస, లక్ష్మీనృసింహకరుణాకటాక్ష సంప్రాప్తమహాకవిత్వవిద్యాపారీణ, సుమహితాంధ్రగీర్వాణభాషాప్రవీణ, సంగీతలక్షణధురీణ, సకలవిద్వన్మిత్ర, త్రేయసగోత్రపవిత్ర, ధర్మనార్యపుత్ర, నిఖిల మహీసురాశీర్వాద ప్రవర్ధమాన భాగధేయ, సకలనృపవిధేయ, వినయవిధేయ, మర్దననామధేయ ప్రణీతంబైన

సీతావిజయంబను మహాప్రబంధంబునందు

తృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# సీ తా వి జ య ము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీనీలకంఠసేవక!। దానకళాభరణ! మానధనసంభరణా!। దీ
నసురద్రుమ! సన్నుత। మానవధవవితతి! పోచమత్స్యాధిపతీ!॥ ౧॥

వ॥ అవధరింపు మత్తైలంగునఁ బార్వతీదేవికి మహాదేవుండు విని
పింపుచు వెండియునిట్లనియె; అట్లుశతకంఠుండు ప్రతాపలంకకరిగి క
లహవృత్తాంతంబును, సీతామహిమంబును, తన పరాభవంబును దన
తల్లికి వినిపింప నమ్మానినియును జింతించి తనయునకిట్లనియె॥ ౨॥

గీ॥ వలదువలదని పలుకఁగాఁ జలముమెఱసి। యనికినరిగితి, వటునీ
వు చనినపిదపఁ। గలఁగి యూపంతనొందుచుఁ గన్నుమూసి। నొకక్రొ క
లఁగంటి, నదివిను నిక్కముగను॥ ౩॥

గీ॥ రాముఁడనియెడు నాదినారాయణుండు। తోడరి నిల్చిన నమ్మ
హాతోడ నీవు। కణఁగి యెదిరింప, నదియెల్లఁ గాంచి యతఁడు। తనమ
నంబున నప్పుడిట్లనితలంచె॥ ౪॥

సీ॥ పురుషులచే పీఁడు పొలయకుండఁగఁదొల్లి వనజజుఁ డొసఁగి
న వరము లెల్ల। నిలిపెద, నిలిపి యేనేర్పునసైన నాదిపుశక్తిఁ బూని ప్రా
ర్థించి యప్పు। రంజ్యోతివలన నీరాక్షసుఁ బరిమార్తునని లోకమాత
నాయ్యనఁదలంచెఁ। దఁలఁచిన నయ్యమ్మ పలువిధంబుల రాముచే విల్లున
మ్ములుచేరి తివిసి। తానె సైకొని ఘోరయుద్ధంబుచేసి। నాహవంబున

నీతలలవసిఁగూల్చె। డాసి యడలిరి నాదుకోదండు వినుము। యిట్లు క
లఁగంటినిఁకమీఁద నెట్లొ కాని॥ ౫॥

సీ॥ ఏఁగన్నకలసత్యమింతయేకాని తప్పఁగ నేరదెల్లింటిబవరమున
ను। సీతామహాదేవిశితశరంబులచేతఁ బడునప్పుడైనను దలఁచుబుద్ధి। నీ
సేనలన్నియు నిమిషమాత్రంబున ధరఁగూలునప్పుడైనఁ దలఁచుబుద్ధి। ప
టువిశిఖంబుల బలువిడి నీతలల్ దండించునప్పుడైనఁ దలఁచు బుద్ధి। యొ
క్కకపిమాత్రుఁడిచ్చట నుక్కుమెఱసి। రూఢిఁ బిడికిటఁగదిసి నీబ్రొమ్ముఁ
బొడిచి। నీదుసింహాసనముగూల నిలిచితన్ని। యరిగె నదియైనఁ దలఁచ
వేమందునిన్ను॥ ౬॥

సీ॥ మర్కటాలికి వశమా సముద్రంబులు నాలుగు దాఁట నేనాఁ
టనైన?। నరులకుశక్యమా నవ్వుచు నీలంక యగ్గలంబుగఁ బెనులగ్గప
ట్ట?। భవదీయ దానవాపారబలంబుల నలవియే పరులకు నవసిఁగూ
ల్ప?। సురసంఘములనెల్ల చెఱువట్టిన నిన్ను నెదిరింపఁదరమె మఱెవ్వ
రికిని?। గాన రాముండు విష్ణుండుగాఁ దలంపు। నెలఁత సీతను మాయ
గా నిశ్చయింపు। హనుమఁడీశ్వరుఁడని బుద్ధియందునిలుపు। మనుము శ
రణని రఘురాము మఱుపుచొరుము॥ ౭॥

వ॥ అని మఱియు ననేకవిధంబుల భయంబు పుట్టించినంగనలి తోఁ
కద్రొక్కిన భుజంగంబు తెఱంగున, దండతాడితంబైన కంఠీరవంబు
చందంబున, ఆజ్యాహుతంబైన ప్రళయాగ్నిమాడ్కి మండి మిట్టిపడి,
మొగంబులుముడివెట్టుక, కన్నులనిప్పులురులఁ, దల్లివియని యిమ్మాటల
కు సహించితింగాక యొండొరులైనం దెగఁబూడనే, స్త్రీబుద్ధిః ప్రళ
యాంతకమనుసామెత నిజమయ్యె; నీబుద్ధి వినియెడు వెఱ్ఱియునుంగలఁ
డే? యని యాచటవీడ్కొని ప్రళయప్రచండ మహోద్దండ సప్తార్చివి
ధంబునంగ్రాలుచుఁ బటహాదిరవంబుల బ్రహ్మాండంబు ఘూర్ణిల్ల మఱు
నాఁడు సూర్యోదయకాలంబున రథంబుపై నెక్కి, కొంతచిక్కిన సై
న్యంబులంగొని విలయకాలాంతకువిధంబునఁ గదలి రాఁదొడఁగెనంత
నిక్కడ॥ ౮॥

గీ॥ రామచంద్రుండు నలసుమిత్రాతనూజుఁ। బ్రేమతోఁ జూచి విభీషణార్క। తనయ పవనజ జాంబవత్ప్రభృతి తరుచ। రేంద్రు లెల్లను వినుచుండ నిట్టులనియె॥ ౯॥

ఉ॥ నిన్న శతాస్యుఁ డిచ్చటికి నిక్కుచువచ్చి యనేకసేనలం। బన్నుగ సంహరించి మనపైఁ జనుదెంచిన, వానియుగ్రతం। గన్నులఁ బాఱఁ జూచి యొకకైవడి నుంటిమిగాని, వానితో। నున్నతవృత్తిఁ బోరుటకు నోపఁగమైతిమి నీచవర్తనన్॥ ౧౦॥

ఉ॥ ఎంతటివానికైన నొకయెక్కుడు దాడిని నొక్కవేళలన్। వింతగ బుద్ధిచంచరిలు విశ్వములో, నటుగాన దైత్యుఁ డ। త్యంతరణోత్సవంబున రయంబున వాఁడోగివచ్చె, వానితో। నెంతయుఁ బోరఁగావలయు నెల్లసురావళి సంతసిల్లఁగన్॥ ౧౧॥

ఉ॥ నావిని లక్ష్మణుండనియె నవ్వుచు నీకతిఁబల్కనేల! నా। లావును దైత్యులావును బరామరిసించెదుగాక దివ్యబా। ణావళి నద్దురాత్ముని రయంబునఁగూల్చెద, లేనినాఁటికిన్। వావిరివానిచేత నిలవ్రాలెదఁగాక తలంకనేర్తునే?॥ ౧౨॥

సీ॥ అను లక్ష్మణునిమాట కనుకూలముగ భరతుఁడు, శత్రుఘ్నుండు దండనిలిచి। చూడుమీ దేవ! మాసుమహితవిక్రమంబని చాపములు పూని రాక్షణంబ। కుశలవులిద్దఱు ఘోరయుద్ధము సేయ నట్టాడఁగాఁ జొచ్చి రలముకొనుచు। సుగ్రీవుఁ డారాముఁ జూచి సేనలతోడఁ దలఁకక నిలిచె నంతకునిరీతి। నంతహనుమంతుఁ డప్పుడత్యంతశౌర్య। వంతుఁడై మిన్నుముట్టుచు వచ్చి రాముఁ,। గంజదళనేత్రు నీకేల కళవళింప। నాశతాస్యునిఁ దృణలీల నవనిఁ గూల్తు॥ ౧౩॥

గీ॥ అనుచు సన్నద్ధులగుచు శంఖాద్యనేక। తూర్యనాదంబులఁదందఁ దొడిఁబడంగ। రథములెక్కిరి తమ మనోరథములెక్క। భాతి నార్చుచు శత్రుగర్వములు వగుల॥ ౧౪॥

సీ॥ రాముండు చటులవిక్రమశీలుఁడై వేగ హనుమంతు భుజముల యందు నిలిచి। జానకీదేవిఁ బశ్చాద్భాగమునఁ బొందుగా నిల్పి, భేరులు

ఘనతమొరయఁ। గడు ధనుర్గుణవిటంకారముల్ దిక్కులు జగతిఁబిక్క
టిలంగ సలుపుకొనుచుఁ,। బవనజుమఱుఁగునఁ బరఁగ విభీషణుఁబొంచి
యుండఁగనియమించి, 'హర్ష। మనసురతతి' జయజయధ్వనులు సే
యఁ,। గపులు పెల్లార్వ బ్రహ్మాండఘటము వగులఁ। గరలి శతకంధరుని
విలోకించుకొనుచు। ధరణిజకుఁజూపుచును బ్రమోదమునునుండె॥ ౧౫॥

ఉ॥ అంత శతాననుండు విలయాంతకుఁడై వడి హుంకరింపుచుం।
బంతముతోడవచ్చి పటుబాణపరంపరచేఁ గపీంద్రులన్। వింతగఁ గూ
ల్ప, వారలును వృక్షమహీధరసంఘముల్ వెసన్। వంతఘటింపవైచిన
ను, వాఁడవిచూర్ణముచేసె ద్రెళ్ళిడిన్॥ ౧౬॥

చ॥ మఱియును మూడుబాణముల మైందుని గీటణఁగించి, యుగ్ర
తన్। శరనవకంబుచే శరభుఁజయ్యనఁగూల్చి, పదింటనీలునిన్। ధరఁబడనే
సి, గోముఖునిఁ దప్పక యేడిటసంహరించి, తా। నరుదుగఁబద్నొకొంట
ను గవాక్షుని మూర్ఛిలఁజేసి వెండియున్॥ ౧౭॥

సీ॥ దశకద్వయంబునఁ దారకుఁబడనేసి, మొనసిజ్యోతిర్ముఖుముప్ప
దింటఁ। దివిరిఖండించి, యాద్వివిదుని నలువది శితవిశిఖంబుల హతునిఁ
జేసి,। యిషుపరంపరలచే ఋషభుని వెసఁ ద్రుంచి, గవయుని దెబ్బది
కాండములను। జక్కాగావించి, పెంపెక్కుచునొకనూఱు శరములనం
గదుఁ జమరవైచి,। జాంబవంతుని మున్నూఱు సాయకముల। నలువది
నిగ్రుచ్చి, ధాత్రిపైనొరఁగఁజేసి,। గంధమాదనముఖమహాకపుల వేయి।
మార్గణంబులుపఱిగించి మదమణంచి॥ ౧౮॥

గీ॥ పరఁగనార్చుచునిన్నూఱు బాహులందు। నస్త్రశస్త్రాళిధరియిం
చి యసురులడలఁ। గడఁగి రాముని వెదకుచుఁ గదలిరాఁగ। నప్పుడెదుఁ
జొచ్చిసుగ్రీవుఁ డడ్డుపడియె॥ ౧౯॥

మ॥ వడివాలంబున వానిచేతులణఁగం బంధింపఁగాఁ బూని, యి।
ప్పుడమెల్లన్ వణఁకంగ నార్చుచు బలస్ఫూర్తిం జనుం దేర, నే। ర్పడనద్దా
నవచక్రవర్తి కినుకం జాటించిసుగ్రీవునిం। బడఁగూలన్ వెసఁదన్నె రాఘ
వమహీపాలుండు చింతింపఁగన్॥ ౨౦॥

ఉ॥ రాముఁడు, నవ్విభీషణుఁడు, రామునితమ్ములఁ, బుత్రిలు, న్మ
హీ। జామణియున్, మరుత్సుతుఁడు సంగరవీధిఁ దకళ్ఁ-వానర। స్తోమ
ములు న్నరావళియుఁ బూర్ణములైరి, వెలుంగుచిచ్చుపై। నామినెదిర్చిచ
చ్చు శలభావళిక్రైవడి నొక్కఁ-పెట్టునన్॥ ౨౧॥

ఉ॥ చెండియు నాశతాననుఁడు వేగనరామునిపై రథంబును । ద్దం
డతఁ దోలసారథిఁ దప్పకతిట్టుచు, హుంకరింపుచుం। గాండపరంప
ఱల్ ధరణిఁగప్పుచు, గుండెలువ్రయ్య నార్చుచున్। దండిగ రాఁగ, లక్ష్మ
ణుఁడు దైత్యునిపై నెదిరెన్ మహోగ్రుఁడై॥ ౨౨॥

చ॥ ఎదిరిన రాఘవానుజుని యేపునురూపును బాణతూణముల్। స
దమలశౌర్యమున్ విమలచాపమునుంగని, యొకఁ-తీక్ష్ణ। ప్రదరము విం
టఁబూని యలక్ష్మభవాండము వ్రయ్యనార్చుచో, వదలకరోషభీషణ
వివాదముమీఱఁగ నప్పుడిట్లనెన్॥ ౨౩॥

గీ॥ పాటిపోమ్మోరి మేటివైన, బవరమందు। నెదిరిమద్బాణములకు
సహింపఁగలవె?। యిట్టిచంపెదనినుఁ జలపట్టియుంతె। నందనునివ ల్లిత
ల్లియెన్నఁటికిఁ గాంచు॥ ౨౪॥

సీ॥ ఏఁడిరాలంకపైనేగి దశాస్యుని ధాత్రిపైఁగూల్చు ప్రతాపఘను
డు?। ఏఁడిరాబాణంబు లేర్చియార్చుచుఁగుంభ కర్ణునిఁజంపు విక్రమధు
రీణుఁ?। డేఁడిరాకోపాగ్ర హృదయుఁడై యనినగ్నివర్ణునిఁజంపిన వరబ
లుండు?। ఏఁడి రాముస్సు మహేశ్వరచాపంబు భిన్నంబుగావించు భీమ
శౌర్యుఁ?। డతనిపైఁ గానినాదు సాయకము లేరు,। శరధిఁజొచ్చినఁ,ద
లచూపవెఱచియున్నఁ,। గొమ్మమఱువునదాఁగినఁ, గోరివిప్రుఁ। డైన,గి
రినున్నఁ బోనీయకవనిఁగూల్తు॥ ౨౫॥

వ॥ అనినవంత॥ ౨౬॥

చ॥ దనుజకులాధమాధమ! వృథావచనంబులు పలుకనేఁటికిలా। వు
న నెదిరించినిల్వుము, మహోగ్రశరంబులచేత నీతలల్। గనియలు సేతుఁ
జూడు, సురకాంతునివజ్రినిఁ గెల్చు మేఘనా। దునిఁ దృణలీలఁ జిత్రముగఁ
ద్రుంచు బెఱుంగవె యాజివేళ్ళడిన్॥ ౨౭॥

చ॥ అని చటులోగ్రబాణముల నాశతకంఠుని నేసె, నేసినం। గనలుచు నాశరాగ్ను లధికంబుగఁ గాల్పఁదొడంగె, నందులన్। మనమున నాగ్రహించి గరిమన్ వరుణాస్త్రము వేసి తచ్ఛరా। గ్నిని శమియింపఁజేయుచు,ననేకశిలీముఖసంచయంబులన్॥ ౨౮॥

ఉ॥ నేలయునింగియున్ దిశలునిండఁగ నేయఁ, దదాశుగానల। జ్వాలలుచుట్టుముట్టుకొని చయ్యన నయ్యరదంబు దగ్ధమై। కూలఁగఁజేసెఁ, జేసిన నకుంఠితశౌర్యఘనస్ఫుటదైకదున్। నేలకు డిగ్గఁగానటికి నిల్చితురించె మహాస్త్రవర్షముల్॥ ౨౯॥

చ॥ అవినడుమన్ హతంబుగ రయంబునఁజేసి, సుమిత్రపట్టివి। ల్లవిరళలీలనొక్క చటులాస్త్రమునం దునియించి యొక్కటన్। వివశునిఁజేయ,మూర్ఛిలి వివేకముదూఁగ వ్రాలివెండియుం। బ్రవిమల వృత్తిమైఁ దెలిసి బాణపరంపర లేర్పరించుచున్॥ ౩౦॥

ఉ॥ వేత్రాకవిల్లుపూని యొకవింతరథంబున నిల్చి, వేగబృం। దారకులుత్సహింప, నలదానవసేనలు చంచలింప,దు। ర్వారపరాక్రమస్ఫురణ రాముఁడుచూచి ప్రియంబునొంద,ర। ఘోరమణున్ రథంబుఁ బటుచూర్ణముచేసె జగంబుగంపిలన్॥ ౩౧॥

ఉ॥ అంతట దానవుండు విలయానలమున్బలె మండి, వేత్రాక। స్యందనమెక్కి చాపములు చయ్యన నూత్రాగిఁబూని యార్చి, సం।క్రం దనముఖ్యదేవతలు కన్గొని భీతిలుచుండఁ, గోపముం। గ్రందుకొనంగ నూఱువిశిఖంబుల లక్ష్మణుగ్రుచ్చెఁ జెచ్చెరన్॥ ౩౨॥

గీ॥ లక్ష్మణునిగాడి, మఱియును లఘుతరముగ। ధరణి వెసఁదూఱి, యలరసాతలము సోఁకి,। మరలఁ జనుదెంచి శతకంఠు మహితతూణి। మధ్యమున నిల్చె దైత్యులు మలసియార్వ॥ ౩౩॥

గీ॥ వెండియును శతకంఠుఁ డుద్దండుఁడగుచు। శక్తి వైచిన సౌమిత్రి జలదరింప। వచ్చి, విలుఁదుఱించి, దేహంబుసొచ్చి చింప। వ్రాలె నరదంబుపైనప్పుడాలమునను॥ ౩౪॥

గీ॥ హా మహోదార! లక్ష్మణ! యకట! యంచు। సీతయును రా

ముఁదును శోకసింధువునను। దేలి, రదిమాచి భరతుండు దివిరి యాశ(
తాస్యుపైనేసె వివిధసాయకనులపుడు॥ ౩౫॥

ఉ॥ ఏసిన నుగ్రుఁడౌచు దనుజేంద్రుఁడు నబ్బరతాహ్వయున్, ర
ణో( ల్లాసునిఁజూచి, చూడుమదె లక్ష్మణుపాలికి నిన్నుఁబంపెదన్,।భా
సురసాయకంబులను భగ్నముసేయుదుసంచుఁబేర్చి పె। ల్లేసె సహస్ర
బాణములు హెచ్చుగదిక్కులు పిక్కటిల్లఁగన్॥ ౩౬॥

క॥ ఆయమ్ములు తృణలీలల। వేయమ్ములఁ ద్రుంచి వైచి, వేగన దై
త్యుం। గాయమ్ము పగిలి పెక్కులు। గాయమ్ములు గనఁబడంగఁ గాండ
ములేసెన్॥ ౩౭॥

క॥ వెండియును దోడఁదోడనె। కాండపరంపరలు దాడిగి, కరము
లఁగలకో। దండములు నూఱు వ్రయ్యఁగ। దండిగబిట్టేసె సకలదనుజు
లు పఱవన్॥ ౩౮॥

క॥ ఆతనిశోణితకణములు। భూతలమునఁ బడక యుండ, భువన
మునిండన్। ఖ్యాతిగ మహాగ్నికల్పా। ఖ్యాతశరంబులను నేసి యాఁము
చేసెన్॥ ౩౯॥

చ॥ అవిగనిమండి దానవకులాధిపుఁడొండుశరాసనంబులన్। వివిధ
శిలీముఖంబులను వేగనపూని,యమోఘవృత్తిమై। భువివణకంగనార్చి,
రఘుపుంగవుఁ డచ్యుతమందఁ, దద్రథం। బవిరళలీల దగ్ధముగ నప్పుడు
చేసె మహోగ్రచిత్తుఁడై॥ ౪౦॥

చ॥ మఱియును వేయిబాణములు మార్కొనిమేసి శరాసనంబు
న। చ్చెరువుగఁద్రుంచి, సూతుని నశింపఁగఁజేసి, మదించితోడనే। సుర
వరులెల్లనుల్కఁబటుశూలము కేలనమర్చి యోరి! యీ( సురుచిరధా
రచేతఁ బటుచూర్ణమాగాక తలంగిపాఱరా॥ ౪౧॥

చ॥ రయముగఁబల్కివైవ జగమంతయుఁ గంపమునొందె, వార్ధు
లున్। సరగఁగలంగె, మిట్టిపడె శైలములన్నియు, రాలె ఋక్షముల్,।
వెఱవెఱనొందె లోకములు, వింతగఁ గావిరిగప్పె, చంద్రభా। స్కరు
లటుతోఁ(?)వదప్పి రతిచంచలవైఖరిఁ దద్భయంబునన్॥ ౪౨॥

సీ॥ ఈరీతి నదిరాఁగ నేపుమై నమ్ముల వానలు నిగుడించె దానిమీఁద। నదిత్రుంచి శూలమత్యంతరయంబునఁ జటులమై యురుదేవ శక్తి వైచె। నదిత్రుంచి మండుచు నదిరాఁగ మదిలోనఁ దలఁకక నిశితకుంతలము వైచె। నదిత్రుంచి వెండియు గొదకొని యేతేరఁబూని కఠారిని బొడిచె భరతుఁ। డక్కఠారిని నణఁగించి చక్కఁగదియ। నుగ్రుఁడై ముష్టిఁబొడువంగ నుక్కుమెఱసి। యదియుఁ గైకొన కాశూలమెదిరి యపయ। వములు ఛేదించి, లీలమై వసుధఁగూల్చె॥ ౪౩॥

సీ॥ హాతమ్ముఁడా! యని భూతలాధీశుండు సీతతో నడలి నిశ్చేష్టుఁ డయ్యె। నలవిభీషణుఁడును హనుమంతుఁడును బాష్పనివహానిర్గతరక్తనేత్రులైరి। చిక్కిన దానవసేనలన్నియు మిన్నుపగుల నార్చిరి మేటిమగలరీతి। నింక నెవ్వఁడు దన్ను నెదురునో యని శతకంఠుఁ డుండెను రణోత్కంఠుఁడగుచు। నంతశత్రుఘ్నుఁ డంతకాలాగ్నివోలె। హలసితనకన్నుగవఁ బెనుమంటలెగయ। మెఱసి చిచ్చులవానలు గురిసికొనుచు। సరభసంబున దానవేశ్వరునిఁ గదిసె॥ ౪౪॥

చ॥ కదిసినవానియుగ్రమును గర్వము నుబ్బును శౌర్యధైర్యముల్। కదనమహోత్సవంబును వికాసము హాసముఁ జూచి, దానవుం। డదనమహాగ్నికల్పవిశిఖావళిఁ జాపములందుఁబూని, యాత్రిదశులుతల్లడిల్ల నతితీవ్రత నేసె రఘూద్వహానుజున్॥ ౪౫॥

ఉ॥ ఏసిన యమ్ములందునియ నేసి, ధనుర్గుణటంక్రియల్ మహోల్లాసతనిండ, సంగరవిలాసమునన్ రిపుమీఁదనుగ్రుఁడై। భాసురసాయకావళి బహుభంగులనేసి, శతాస్యునందుచే। వాసిగఁ జిక్కుపాటులొదవంగఁ బెనంగెఁ బురారికైవడిన్॥ ౪౬॥

సీ॥ ఇట్టివేళనె త్రుంతు నెకవీసిననిడాసి నారాయణాస్త్ర మున్నతినిదొడిగి। యోరిదానవ! చూడరోరి యీశరమున లవణాసురుఁడు మున్ను లావుదూలెఁ। బాఱిపొమ్మోరి యీబాణంబుచే మళ్లి బ్రతికి పోఁగలవె యేర్పడఁగ నీవు। ఇదిశరించెడివెఱవిప్పుడే యూహింపుమని యార్చివేసిన నవనివణఁకె। వారినిధులెల్లఁ బిండలివండులయ్యె। దిగ్గజంబులు నటునిటుఁదిరిగిపడియె। దారుణాగ్నులు భూనభోంతరము

నిండె। శతగళుండును దానిపై శరములేసె॥ ౪౭॥

ఉ॥ వానిని నెల్లఁదుంచి, సురవర్గము నుత్సవమంద డాసి, యా। ద్దానవలోకనాయకుని దారుణభాసురమస్తకాగ్రసం। స్థానకిరీటసంఘములు ధాత్రిపయింబడఁద్రోచి, వెండియున్। వాని శరాసనంబులు రవంబులుమీఱఁగఁద్రుంచె నొక్కటన్॥ ౪౮॥

ఉ॥ అంతియకాని యాజలరుహాసనుఁడిచ్చినదీవెనం దదీ। యాంతమునొందఁజేయఁదగదయ్యె; బలాఢ్యులు చేఁబట్టినన్। ఎంతటివాఁడు పోరిన నదెక్కుడ నెక్కుడె? ధరాతలంబుపై। నెంతయు భేదకార్యమున నెమ్మెలు దూలినఁ దూలుఁగాకొగిన్॥ ౪౯॥

గీ॥ అట్లుభంజించి నారాయణాస్త్రమపుడు। మరలివచ్చుచు శతకంఠుమహితరథము। ఘనులు దివిజులు జయజయధ్వనులుసేయ। దగ్ధముగఁజేసి పొదిలోనఁ దరలకుండె॥ ౫౦॥

గీ॥ అందుకత్యంతకుపితుఁడై యసురవరుఁడు। నూఱుకరములఁ బటుగదల్నూఱుపూని। యార్చివైచిన నన్నియు నతిరయమున। వచ్చి శత్రుఘ్నుఁడాఁకె భూవరుఁడు వగవ॥ ౫౧॥

గీ॥ అట్లు సకలగదాతాడితాంగుఁడగుచుఁ। దూలివణఁకుచు నెత్తుటదొప్పదోఁగి। మెదలఁగాలేక శల్యముల్వదలియపుడు। రథముపైవ్రాలె హా! రామ! రామ! యనుచు॥ ౫౨॥

గీ॥ ఇట్లు మువ్వురు తమ్ములు నిలనుగూలఁ। గాంచి రాముండు మదిలయకాలుగతిని। యాశతాస్యునిఁ బరిమార్ప నపుడుతలఁచె। నంతలోఁగుశుఁడసురకు నడ్డుపడియె॥ ౫౩॥

గీ॥ పడినవానిఁదలుక పాటించి, దానవ। భర్త కినిసి మైదుబాణములనుగ్ర బూనియేసె, వానిభూపాలతనయుండు। తొడరిచేసెనపుడు తునియలుగను॥ ౫౪॥

ఉ॥ వేండియు నన్నిశాచరుఁడు వింతగ నకుశుమీఁద నల్కమై। గాండపరంపరంబులను గప్పిన నవ్వ్యాడఁ జొచ్చి, యాలవుం। డండజవాహురీతి దనుజావలినెల్లను ద్రుంచి, భండనో। ద్దండతరాశుగంబులను దానవనాయకుగ్రుచ్చెఁ జెచ్చెరన్॥ ౫౫॥

చ॥ శిశువులటంచునుంటి, ననుఁ జేకొని మిన్నంగఁగఁబూని వచ్చు న। ప్పశుపతియుగ్రమో? విలయభైరవయుగ్రమొ? మృత్యుయుగ్రమో?। యశనులయట్లు దాఁకి వివిధాస్త్రములేసిరటంచు విస్ఫుర। ద్విశిఖముఁ లేసె, నేసిన నవింబోడి చేసి కుశుండు వెండియున్॥ ౫౬॥

ఉ॥ క్రిమ్మట నగ్నికల్పమగు కాండశతంబు శరాసనంబునన్। సమ్మదవృత్తిఁబూని, నృపచంద్రుఁడు రాముఁడు సత్యశీలుఁడై। యిమ్మహిమించె నేని దమజేంద్రుని హస్తశతద్వయంబు వై। రమ్మునఁద్రుంచుఁగాకని తిరమ్ముగ నార్చుచు నేసెఁ జెచ్చెరన్॥ ౫౭॥

చ॥ ధరణివడంకె, వార్నిధులు తల్లడమందెఁ, గులాద్రులెల్ల డి। గ్గిరముగఁ బెల్లుగాఁ దిరిగె, దేవతలున్ భయమందె, నెల్ల డి। క్కరులు నమొగ్గె, నంతశతకంఠుఁడు చూచి యమోఘవృత్తిమై। శరనిచయంబులేసె నతిసాహసలీలల హుంకరింపుచున్॥ ౫౮॥

చ॥ దనుజుఁడొనర్చు బాణములు దక్షిణమందునఁద్రుంచివచ్చె, జు। వ్వున ననలంబు లోకమున నొక్కటనిండి, తదీయహస్తపంక్తిని విద। ళించెఁ, దోడనె యెదిర్చి లవుండనలాస్త్రసంఘముల్। కనలుచు నేసి రక్తములు గాఱకయుండ నొనర్చె వ్రేల్మిడిన్॥ ౫౯॥

చ॥ కరములు వ్రాలినన్ దనుజకాంతుఁడు బ్రహ్మఁదలంచెఁ, దల్చి నం। గరములు వెండియున్మొలచె గ్రక్కున, మొల్చినవెంటనే ధను। ర్గురుఁడనమించి యుగ్రతరఘోరశరంబులు పావకార్చులే। ర్పఱపుచు నేసె, నేసినను బాలురుమూర్ఛలనొందిరందులన్॥ ౬౦॥

చ॥ మఱియును శబ్దభేదులగు మార్గణసంఘములం దదీయపీ। వరభుజయుగ్మమేయ నిరువంకలగాడి, మహాద్భుతంబుగా। నరవరుఁడున్ మనంబున ఘనంబుగఁగంపిలుచుండ, దేవతల్। హరహరయంచుఁ జూడ విగతాయువులన్ వెసఁజేసెనుగ్రతన్॥ ౬౧॥

మ॥ తనపుత్రుల్ తనతమ్ముఁబున్ దనుజుచే ధాత్రీస్థలింగూలినం। దన నేత్రంబుల నశ్రువుల్ చెదరఁ, జిత్తంబందులన్ మందుచున్। ఘనతన్ వాయుబుమీఁద నెక్కి, తనవెన్కన్ సీత శోభిల్లఁగా। దనుజాధీశుని డాసె నెల్లసురబృందంబుల్ విలోకింపఁగన్॥ ౬౨॥

మ॥ దనుజేంద్రుండనుడాసి రాముని మహోద్దండప్రతాపంబు
నన్ । వనధుల్ పిండలివండులయ్యె, నచలవ్రాతంబులుం దూలెఁ, జా।
య్యన ధాత్రీస్థలిగ్రుంగె, దిక్కరిసమూహంబుల్ వెసన్ మ్రొగ్గె, ది। గ్గ
నఁబుట్టెన్ ధరనొక్కమ్రోఁత, యజుఁడుం గాలంబులెన్నెన్ మదిన్॥ ౬౩॥

ఉ॥ రెండుపయోధులో? తలఁప రెండుకులాద్రులొ? రెండుచిచ్చు
లో?। రెండుమదించునేనుఁగులొ? రెండుమృగేంద్రములో? యటంచు
నిం। ద్రుండును, రుద్రుఁడున్, వరసరోజభవుండునుగూడి యద్భుతా।
ఖండమనస్కులై దివిసిఁ గన్గొనుచుండిరి మాటిమాటికిన్॥ ౬౪॥

వ॥ ఈక్రమంబునఁ జాపవిద్యాగురుండగు రఘువరుండును, త్రి
లోకకంటకుండగు శతకంఠుండును మహాయుద్ధసన్నద్ధులై కదిసిన మే
రునగంబునుంబోలె హనుమంతుండట్టిసమయంబునఁ దనవాలంబు రామ
చంద్రుని ముందట నడ్డంబుగా నిలుప, నదిదనుజవరుండేయుశరంబులకు గు
రియనఁ జెలఁగె; విభీషణుండును మానవదానవ నాయకులు పెనంగు
నెడ రామునిశరంబులచే నసురరక్తంబు చెదరి క్రిందఁబడకుండ నడుమ
నడుమ నాగ్నేయ వాయువ్యాస్త్రంబు లేసెదనని పావని మఱువునని
ల్చి యుద్ధసన్నద్ధుండయ్యె; అంతవిలయసమయ మహానల కీలాకరాళం
బు చాడ్పున నూఱుమొగంబుల మంటలొదవ ననేకసాయకంబులు నృప
వరునిపైఁ బ్రయోగింప నవియెల్లను హనుమదాభీల విశాలవాల వజ్రప
ర్వతంబు సోఁకి తునియలయ్యెనంత॥ ౬౫॥

మ॥ పటుకోదండము వంచి రాముఁడమరుల్ భాసిల్లి దీవింపవి। స్ఫు
టనారాచములూని యార్చి యల రక్షోనాథుపై నేయ, నా। చటులా
స్త్రంబులు సంగిమట్టి తగనాశ్చర్యంబుగా నాటి, యొ। క్కటనన్నింబటు
చూర్ణమయ్యె దనుజాంగప్రాభవం బేమొకో!॥ ౬౬॥

సీ॥ ఒక్క దివ్యాస్త్రమత్యుగ్ర శరాసనంబునఁ బూని రఘురా
ముఁడొనరనేయ। నదిభటునకునైను, హయమునకిఱువది, కరికిబంధుర
గతిఁగలితశతము,। సారథికిన్నూఱు, చక్రంబులకువేయి, పాఁబుపారు
కేతనంబునకులక్ష,। రథికునకిఱువది లక్షలునై భూమియంతయు నిండ,

నత్యంతశీఘుఁ। 'మన్నియయునుగూడ' దనుజేంద్రుఁ డంత వేగ। నడుమనే
త్రుంచి, కుపితుఁడై పుడమివణఁక। రాముపైనేయుబాణపరంపరలను।
దక్షిణంబునవాలంబు దాఁకివిఱుగు॥ ౬౭॥

ఉ॥ వెండియు దానవేశ్వరుఁడు విండ్లొకనూఱు కరంబులందు ను।
ద్దండతఁ బూని, సాయకశతంబు దిశల్ వణఁకంగ నార్చియు। గ్రుండయి
రాముమీఁదఁ బురికొల్పి రయంబున నేసె. నేసినన్। దండిగ లోకమెల్ల వి
విధస్థితినిండె మహాగ్నిపెల్లుగన్॥ ౬౮॥

శా॥ అక్కాండంబులు కొన్ని వాయుజమహోగ్రాభీలవాలంబో
గిం। జక్కం దాఁకిహతంబునొందె, మఱిపీఁకంగొన్నిభూపాలకుం। ము
క్కల్ వ్రయ్యఁగ దూఱిపాఱె, నతివైరంబొప్పఁగాఁ గొన్ని పెం। పె
క్కన్ వచ్చివిభీషణుం దగిలె దేవేంద్రాదులీక్షింపఁగన్॥ ౬౯॥

శా॥ రామక్ష్మాధిపుఁ డందుకున్ మఱిమహోగ్రంబొప్పఁగాఁగరి
ష్ఠో। ద్దామాభీలశరంబులేర్చి, గుణమున్ దర్పోద్ధతిన్ మీటి, సం। గ్రామం
బందుల రాముఁడుండవలె, లేకన్ దానవుండుంటకు। న్నేమంబొప్పఁగ
సిద్ధముండవలె, వర్ణింపంగ రెండుండునే॥ ౭౦॥

మ॥ అనుచున్ వింటనమర్చియార్చి నిజబాహాశక్తి నుంకించి చ। య్యనఁ
బెల్లేసినఁ, దచ్ఛిలీముఖము లత్యంతప్రచండాకృతిన్। దనుజాధీశుని గా
డి, యవ్వల వినోదంబొప్ప గాఁదూఱి, వే। గనయుచ్చేరువనున్న కొండ
పగులంగాఁ దాఁకె నుగ్రంబుగన్॥ ౭౧॥

శా॥ అంతన్ మారుతిచెంత నిల్చి, పటురోషాయత్తుఁడై వింట న।
త్యంతోగ్రానలబాణముల్ దొడిగి, యాదైత్యేంద్రురక్తంబిలం। బంతం
బొప్పఁదొరుంగకుండఁబఱపెన్ బ్రహ్మాదులాశ్చర్యులై। వింతఁ జూడఁగన
వ్విభీషణుఁడు హృద్వ్యధిన్ముదంబందుచున్॥ ౭౨॥

శా॥ దానంజేసిస్వదేహరక్తమిలమీఁదం జెందకున్నన్, హరి। ధ్యా
నంబొప్పఁగ నట్టహాసమొదవన్ దర్పంబుమై నార్చుచున్,। మానంబుల్
చెదరంగఁదిట్టుచును, దుర్మార్గంబునన్హాపరా। ధీనా! యోరివిభీషణా!
తునిమెడన్ దిక్కేదివీక్షింపరా॥ ౭౩॥

వ॥ అని పెల్లార్చి సమంత్రకంబుగ మహోద్యచ్ఛక్తి సంధించి, యొ। ద్దనుజాధీశకులాపరాధు నిలమీఁదం గూల్చి రక్షించు మై। చిన, నంతంతకుఁ జిచ్చులీనుకొనుచున్ శీఘ్రంబున నంబోయి యుగ్ర। కరనబంధించె విభీషణున్ సురవర్గుల్ ఘోషింపఁగాఁ జెచ్చెరన్॥ ౭౪॥

సీ॥ అదిచూచి రాఘవుండనలాస్త్రములు వైచెఁ గంటకుండగు శతకంఠుమీఁద। నవిద్రుంచి దానవుండైంద్రాస్త్రములు వైచె నవిద్రుంచి నృపుఁ డేసె నహిశరములు। నవిద్రుంచి వాయుబాణావళి దనుజుఁ డేసిన నవిద్రుంచి యజ్జనవరుండు। నారాచతతులేసె నగుచు నద్దానవభర్త రథంబెల్ల భస్మముగను। విరథుఁడై యంత వేఱొక్క యరద మెక్కి। పృథివి వణఁకంగ విండ్లైకుఱ వెట్టఁబూను। నతని చాపంబులును విశిఖాలి వలన। ఖండలుఁగ జేసె భండనోద్దండుఁ డగుచు॥ ౭౫॥

సీ॥ చాపముల్ పోయినఁ గోపగించి శతాస్యుఁ డుఱువడి మండుచు నున్నయట్టి। శూలంబు కరమునఁ జోద్యంబు గాఁబూని బ్రహ్మాండ మంతయుఁ బగుల నార్చి। కనలుచు జనవల్లభునిఁ జంపుమని యేసె, నేసిన జలనిధు లెల్లనింకెఁ,। గులగిరులదరె, దిక్కులు వ్రయ్యలగుచుండె, నింద్రాదు లద్భుత హృదయులైరి,। యంత నదిడాసి విలయకాలాగ్నిరీతి। మండుచునురాఁగ నాహనుమంతుఁ డపుడు। వాలమల్లార్చి వచ్చెడి శూలముగ్ర। వృత్తి వెసఁబట్టి నడిమికి విఱుచుచుండె॥ ౭౬॥

సీ॥ హనుమంతుఁ డందుచే నదవదపడుచుండ, నిదిసమయము రామునిలను గూల్ప। నని నొక్క గదతోడ నడిచె గుప్పన దాని తాఁకున కొక్కింత తల్లడిల్లి। మనుజవల్లభుఁ డాత్మఁ గనలుచు నర్ధచంద్రాస్త్రశతంబు శరాసనమున। సంధించి దేవతా సముదయంబులభక్తి యొనరనాపైఁగల్గి యుండెనేని। వానిహస్తంబులను దలల్ వసుధఁగూలుఁ। గాకయని వైచె దైత్యుండు గళవళింప। నమరులద్భుతమంది హాహాయనంగ। ఖండలై కూలెఁ దలలును గరశతములు॥ ౭౭॥

సీ॥ కూలి క్రమ్మఱఁ దొంటి పోలిక మొలచెను గరములుఁ దలలు నక్కజము గాఁగ। నాశతాస్యుని రక్తమవని పైఁ దొరఁగిన మొనసి సూర్య

రు శతముఖులుపుట్టి। నెక్కడఁజూచిన నకటాడనటువంటి వికృతదై
త్యులువెల్లి విరిసియుండ। నన్నిదిక్కులఁబోర నందుకురఘురాముఁ డం
దందఁబోరుచు నడలుచుండ। నంతహనుమంతుఁ డాశూలమప్రుడుద్రుం
చి। సీతనెక్కడఁదగులునో శితశరమ్ము। లనుచు వాలమ్ముచుట్టరాఁదిగిచి
యుండె। నగుచుసురలుబ్బగా మేరునగమురీతి॥ ౭౮॥

ఉ॥ రావణకుంభకర్ణుల శరంబులఁగూల్చితినంచు,నమ్ముదు। ర్భావ
మునంబెనంగ వెసఁ బాల్పడి, తెందుల కేగువాఁడవీ?। వేవిధినైననిన్నుఁ
దునిమించి భవత్తనుమాంసఖండముల్। వావిరిమై భుజింతు, మిఁకవా
ర్ధులుసొచ్చినఁ బోవనిత్తుమే?॥ ౭౯॥

గీ॥ కొందఱిట్లనితిట్టుచుఁ, గొందఱలిగి।సాయకంబులఁగప్పుచు,శౌ
ర్యమహిమ। చూడ మనుచును నెక్కడఁజూచిననుశ। తాస్త్రమయ మ
య్యె నటసురలకట!యనఁగ॥ ౮౦॥

గీ॥ అపుడు నిర్విణ్ణుఁడై చాపమచటవైచి। చేతులాడకమిగుల నిశ్చే
ష్టుఁడగుచు। నవ్విభీషణునీక్షింప నతఁడుశక్తి। బద్ధుఁడైయున్నఁబవనజుఁ
జాలఁజూచి॥ ౮౧॥

శా॥ ఏచందంబునఁగెల్చువాఁడ? నిఁకనేనేలాగునంద్రుంతు?నీ। నీచా
త్మం డెచటంగనుంగొనినఁ దానేయున్నవాఁ, డేగతిన్। భూచక్రంబున
'నింక' నెల్లమునులంబోషింతు?నేలాగునన్। నాచేతన్మనఁగోరువారునె
పమొందన్ హేతువయ్యెంగదా॥ ౮౨॥

వ॥ అనియనేక ప్రకారంబుల విచారింప మగనివగపుఁ గనుంగొని
సీతామహాదేవి తనయాదిమరూప మహిమాసామర్థ్యంబుదెలపోసి, త
నచేతనంతయు సాధ్యంబగుట సిద్ధంబుగాఁదెలిసి, కరంబులుమొగిడ్చిర
ఘుకులసుధార్ణవ సంపూర్ణిమాచంద్ర! మదీయప్రాణనాథ! రఘునాథ!
భవన్మహిమంబునఁగొంత సేవ నేను మీచేతివిల్లును బాణంబులును బూ
నిరిపులతోడఁ బోరెదను; ఆఁడుదాననని యనుగ్రహంబు సేయకుండు
ట దగదు; ఇట్టిసమయంబున మీకునలయిక దీఱుదనుకను దిపిరివివిధ వి
శిఖపరంపరలచేఁ బెనంగెద, నావిన్నపంబాకర్ణింపుమని పెక్కుచందం

బులఁ బ్రార్థింప రామభద్రుండును దనమనంబున నద్భుతంబు నొంది, మున్ను దనతోడ వసిష్ఠుం డెఱింగించుటయును, జానకి తన్ను సెలవు దయచేయుమని వేఁడుటయును, మొదట విరించిఁ గోరునెడ స్త్రీఁ దలఁపకుండుటయు ననేకప్రకారంబులఁ దలపోసి, దనుజుండు మడియుట సిద్ధంబని మనంబునం దోఁచిననలరి, బాణాసన బాణతూణీరంబులు దీవించి యొసంగిన, నవ్వేళ నవ్విమలాంగియును బరంజ్యోతి స్వరూపంబు గైకొని, హనుమంతుని భుజంబుపై మిన్నుముట్ట నిలిచి, తన మహాతేజంబు భూనభోంతరాళంబు పరిపూర్ణంబుగా నిండ మహోద్దండ కోదండం బెక్కిడి, సకలబ్రహ్మాండభాండంబులు ఘూర్ణిల్ల గుణటంకారంబులుగావించి, తనమహామాయ నాకర్షించిననది పొడచూపిన నీవు దనుజుని రక్తబిందుపరంపరలు ధరఁ దొరంగక యుండ నెవ్వరికి నదృశ్యంబవై నాలుకమెటుచూచిన యోజనంబు నేలఁ బఱపియుండుమని నియోగించిన, రాఘవుండాశ్చర్య మానసుండై చూచుచుండ, నమోఘబాణపరంపర నిగుడించి శతముఖులనందఱ నొక్కదిక్కునకు వాయువ్యాస్త్రంబులం గ్రోయుచు, మహోద్దండ ప్రచండ భండనంబు గావించిన నద్దానవనాయకనిచయంబును దదీయ తేజోవిశేషంబువలనఁ జేతులాడక చూచికొనుచుండి రాసమయంబున॥ ౮౩॥

గీ॥ విల్లుజళిపించి, కరకుశభల్లశతము। పూని, దేవతలెల్ల నద్భుతము నొందఁ। బద్మజాండంబు పటపటఁ బగులనార్చి। యెలమిఁ దనపతి వినుచుండ నిట్టులనియె॥ ౮౪॥

గీ॥ మూడుమూర్తులకును నేనెమూలదుంప। నగుదు నేని, శ్రుతుల్ సత్యమనునయేని,। పుడమి నిజశతకంఠుఁ డొకరుఁడును దక్క। నున్నశతముఖహీనమై యుండుఁగాక॥ ౮౫॥

గీ॥ అనుచు వైచిన నందఱ నాతృణంబు। నీఱుగావింప, మాయమై పోరుమాని। చనిరి, వెండియు దానవచక్రవర్తి। సీతపై నేసె నుద్దండశిత శరములు॥ ౮౬॥

గీ॥ ఇవ్విధంబునఁ దనరక్తమిలను దొరఁగ। యుండఁ బుట్టిన శతముఖ

లఁగ,నందు। వలననిది మాయగాఁ బోలు, వనిత నైన। నిట్టి తెఱఁగునఁ
బోదురే బెట్టిదముగ?॥ ౮౭॥

గీ॥ అనుచుఁ గ్రమ్మఱ జానకి నరయుచుండ। విష్ణుఁడును, బ్రహ్మయు
ను, నలవిశ్వపతియు,। విలయపావకుఁడును, మహావిధియుఁ గాఁగ। బ
డిననదిచూచి మది భయపడియె నసుర॥ ౮౮॥

ఉ॥ రాముని పేరి బాణముల రాక్షసనాయకు మీఁద నార్చియా।
రామ చెలంగి వైచిన, నరాతిభయంకరమై కణంకతో। వేమఱుఁ బోయి
దానవుని విండ్లొగిఁ ద్రుంచి, కిరీటపంక్తులన్। భీమము మీఱ దుల్చి, సరి
పెట్టెఁ దదీయ శరీర తేజమున్॥ ౮౯॥

ఉ॥ ఎచ్చటఁ జూడ నచ్చటనె యెమ్మి నిమృత్యువుఁ బోలి, సీత దా। మ
చ్చరమొప్ప నిల్చి తను మార్గణపంక్తుల నొంపఁ జూనఁ దా। నచ్చెరువంది,
యాహరిహరాదులకైన వశంబు గాదుగాఁ। జెచ్చెర నిమ్మహామహిమ
చేఁ దనకున్ మరణంబు చొప్పడున్॥ ౯౦॥

చ॥ అనుచు రథంబుపై నిలువ, నద్దనుజాధిపు మీఁద నలుకపై। నన
శిలీముఖంబులు సహస్రశతంబులు వైచె, వైచినన్। దనుజుఁడు సొమ్మసిల్లి
యరదంబున మూర్ఛిలి వ్రాలె, వ్రాలినన్। గనుఁగొని సూతుఁడున్ రథము
గ్రక్కునఁ దోలె రణంబు పాయఁగన్॥ ౯౧॥

సీ॥ పుష్పంబుల చేతఁ బూననేరని చెలి యిషుపరంపరఁ బూన నె
ట్లు నేర్చెఁ? జిలుకపలుకులకు బిట్టులుకు కోమలి యిల నెల్ల భీతిల నార్వ
నెట్లు నేర్చె? నేఁ దకరు నన్యుల నీక్షింప నేరని యితిం సేనలఁ గూల్ప నె
ట్లు నేర్చె? విసవిసనడువంగ నసియాడు కొమ్మ నేఁ డెడసి యుద్ధము సే
య నెట్లు నేర్చె? నను చు రాఘవుఁ డద్భుతహర్షవార్ధి। నోలలాడుచు,
హనుమంతువాల మహిమ। వినుతి సేయుచు, నాతని వీపు మీఁద। నుండె
జానకిపైఁ బ్రేమ నిండుకొనఁగ॥ ౯౨

ఉ॥ అంతట దానవుండును రయంబున మూర్ఛయఁ దేఱి, సారథిన్।
వింతగఁ జూచి యోరి! పరవీరులు నవ్వ రథంబుఁ దెత్తురే?। యెంతటివా
రలైనఁ బరమేష్ఠియొసంగిన యవ్వరంబుచే। నింతయు నజ్జనంకఁ గలరే!
మహిఁ గూలుదురింతే కాకొగిన్॥ ౯౩॥

చ॥ అనవినిసూతుఁడిట్లనియె నక్కటా! నాథుఁడు దండలేనిచో। ఘనవిశిఖంబులన్ మనల గ్రక్కున శల్యములుచ్చి పాఱఁగాఁ। గనలుచు నేయుజానకిని గాంచి సురల్వినుతింప, నట్టిచో। దనుజకులాధినాయక! రథంబుమఱల్పకయుంట ధర్మమే?॥ ౯౪॥

వ॥ అదియునుంగాక॥ ౯౫॥

చ॥ వెఱచినయట్టివేళ, మఱపింతగఁ గైదువు చక్కఁ బూనఁగా। మఱచినయట్టివేళఁ, బలుమాఱు నరాతికి వెన్నుఁజూపుచుం। బఱచినయట్టివేళ, నగుబాటుఘటింపఁగఁ జేరిపూరిఁదాఁ। గఱచినవేళలందు నెడగల్గ రథంబు మఱల్చుటొప్పగున్॥ ౯౬॥

చ॥ అనుడు తదీయనీతివచనాలికి నుత్సవమంది, వానికిన్। ఘనతననేకవస్తువులు గ్రక్కున మక్కువనిచ్చి, నేఁటికా। జనకజతోడఁబోరుటకు శక్యముగా, దటుగాన రేపు స। య్యననరుదెంచి రాముని శరావళిచే నణఁగింతు వేగనన్॥ ౯౭॥

ఉ॥ భోరునఁ బోవనిమ్ము మనభూరిరథంబు గృహంబు చేరఁగా,। నారఘురాముదేవి వినుమల్లదె చంపఁగఁ బూనివచ్చె,నా। క్రూరశిలీముఖంబు లలకోమలిపైఁబని సేయ, వెట్లుగాఁ। గారణమున్నదో? యనుచుఁ గుందుచు నేగె శతాస్యుఁడింటికిన్॥ ౯౮॥

శా॥ ఆరీతిన్శతకంధరుండు దనగేహంబొప్పుగాఁ జేరి,యా। కారంబెల్లనుజూచిభీతి నతిదుఃఖప్రాప్తుఁడై మీఱి,సోం। పారన్జానకి మృత్యువైదగు మహోగ్రాగ్నేయ బాణంబులన్। వైరంబొప్పఁగ వైచెనో యనుచు గర్వంబెల్లఁ దూలెన్ వెసన్॥ ౯౯॥

వ॥ మఱియు ననేకమార్గంబుల జానకి దివ్యతేజోమహిమంబును, శరంబుల వేగంబును, బాణసంధానచాతుర్యంబును, ఉపసంహారచమత్కృతియును నుగ్గడింపుచు, నెక్కడఁగనుఁగొన్న నక్కడఁబరంజ్యోతిస్వరూపంబగు సీత గనఁబడిన భీతిల్లుచుఁ, దనకు నింక మరణంబు సిద్ధంబని నిశ్చయింపుచు సెజ్జపయింబొరలుచుండు తనయుని విలోకించి తల్లి యగు చిత్రగంధి డగ్గఱి, తనకరంబున దద్గాత్రంబు నివిరి, రక్తప్లుత ని

మ్మోన్నతంబులై యపరిమితశరంబులు నాటి యందు విఱిగియున్నఁగ ముంగొని విలపించి యిట్లనియె; అయ్యా! నెయ్యంబున నేఁబలుకు వచనంబులు వీనులం జొరనియ్యక యింత చేసికొంటివి; ఆయమ్మ మొకఁడనలు గునకఁడ నిర్మూలంబగు; ఎక్కడఁ గరుణించిన నక్కడఁ గళ్యాణపరంపరాభివృద్ధియగు; అప్పరంజ్యోతిమాయను బ్రహ్మరుద్రేంద్రులు లోనెకాని వెలిమై ప్రకాశింప నేరరు; భూనభశ్శైలసముద్రాద్యపారస్థావరంబులును, మృగాండజోరగ పిపీలికాద్యసంఖ్యజంగమంబులును గలుగు బ్రహ్మాండంబులు నూఱుకోట్లు పుట్టుచుఁ గిట్టుచు నమ్మహాశక్తియందు నటించు; ఆదిమధ్యవిలయంబులు నమ్మహామహిమంబునకుఁ గనఁబడవు; నీవు మొదట విరించి పురుషులచేఁ జావు లేకుండ వరంబులొసంగునపుడు దేవతలు గినిసి యిట్టి వరంబు లొసంగిన నద్దానవుండు లోకంబుల బాధపెట్టు, నింత వత్సలత నీకుండఁగదని దూఱిన నతండు లజ్జించి శతముఖుండు పురుషులం దడలెకాని తరుణులం దలంపఁ, డటుగాన మిమ్మును గోబ్రాహ్మణుల నెప్పుడు చెనకు నప్పుడే జానకీదేవి తనతొంటి దివ్యరూపంబున వధించు, నిందులకు సందియంబు లేదని పలికె; అదిగావున సీతయుఁ జిద్రూపంబగు మాయగాని సామాన్యకన్యక గాదు; ఎట్టిచందంబున నమ్మగువచే భవన్నాశంబు సత్యంబు; ఇటమ్ముము, పుత్రమిత్రకళత్రములను మనుపంబూచెద వేసి, సీతారాములకు శరణుచొచ్చి తల్లిదండ్రులు మీరు, మీరు దప్పమాకు నితరులు లేరు రక్షింపుమని పలికి, సకలభోగంబులం దేలుచు బ్రతుకుమని పెక్కుచందంబులం బలికిన నప్పలుకులు ములుకుల చందంబునఁ గర్ణరంధ్రంబులు సోఁకిన నులికిపడి తల్లితో నిట్లనియె॥ ౧౦౦॥

సీ॥ ఏనల్గిచూచిన నినుఁడు బెట్టిదముగాఁ బూని మెండలు గాయఁ
బొదల వెఱచు। వలసినప్పుడె కాని మలసి మెచ్చట నైనఁ జెలరేఁగి యన
లంబు మెలఁగ వెఱచు। నాకభృత్యులరీతి నాకులందఱుఁ గనుసన్నలఁబ
నులెల్లఁ జరుపుచుందు। రఖిలజీవుల నేర్చు యముఁడు నాముందఱఁ గో
లకాఁడై యుండు వేళ మెఱిఁగి। మృత్యువునకేను మృత్యువై మెఱయు
చుందు। మఱియు నాయందుఁగల మహామహిమ శివున। కైనఁ జొప్ప
డ దట్టి నరాధముఁడు। నతివయును గెల్వఁగలరె? యేననఁ దుఁగాక॥

గీ॥ రేపుచని శాత్రవుల నెల్ల నేపుమాపి। వత్తుఁగా కొండువార్తలు వలవదుడుగు। మీయటంచును దనతల్లి నింటికనిచి। నెలఁతయును దాను నారేయి నిద్ర చెందె॥ ౧౦౨॥

సీ॥ అక్కడ రఘురాముఁ డనుజులుఁ దనయులు సొరిదిఁ గూలినఁ జూచి శోకమంది। యేమనిచన నేర్తు నింటికిఁ? వీరల నెచ్చోటఁ బొడఁగందు నెప్పటట్లు?। కుశుఁడెన్నటికి నన్నుఁ గొమరొప్ప వీక్షించి వేడుకఁ బ్రతిభాషలాడుచుండు?। లవుఁడెన్నటికిఁ గల్గు లక్షణవంతుండు బాలుఁడు నామీఁదఁ బ్రాణపదము?। అనుచు నొఱలంగ, సీత నాయకునిఁ జూచి। యేడ సోదరు? లధికుల కేడ సుతులు?। రణగతులు మాని యిట్లొఱలంగఁ దగునే?। అనఘ! సంసారములు మాయలనఁగ వినవె?॥ ౧౦౩॥

సీ॥ అనుచుఁ దానును రాముఁడా హనుమంతుండు నవ్విభీషణుకడ కరిగి యతఁడు। మమునమ్మి వచ్చి యిక్ష్వాకుని బద్ధుఁడై యున్నాఁడు రక్షింపకున్న దోష। మని, శక్తి శరమున నలుకమై ఖండించి మొనసి యాతఁడు చెందు మూర్ఛఁ దెలుపఁ। దెలిపిన నతఁడును ధీరాత్ముఁడై లేచి వారికోమలపదవారిజములఁ। బడిన దీవించి, యతనితో బవరభూమి। చూడవలెనని దివెలొగ్గి సొరిదిఁ బూని। కపులఁ జూచుచు నంతంతఁ గదలుచుండఁ। బరఁగ భల్లూకపతి గానఁబడియె నచట॥ ౧౦౪॥

సీ॥ ఆతని డాసి రామానుమతంబునఁ బవనజుఁ డల్లనఁ బలుకరించె। జాంబవంతుడ! నన్ను సరవిమై నెఱుఁగుదే? యోపుదే లేచి రానొక్క డెసకు?। నావిని మారుతనందనుం డీతఁడు గాఁబోలునని ధృతి కలిగి తెలిసి। హనుమంత! రమ్ము రామావనీనాథుండు పరిణామమునఁ దన భామతోడ। నున్నవాఁడె? విభీషణుఁ డున్నవాఁడె?। బ్రతికియున్నాఁడె పవనజ! భానుసుతుఁడు?। పరమబంధుండవగు నీవు పలుకరించి। నపుడె బ్రతికితి నీకృపఁ గపివరేణ్య!॥ ౧౦౫॥

సీ॥ కన్నులశరములు గాడి యొక్కింతయుఁ దెఱవ శక్యము గాదు, తెలివి పడదు। వీనులు విన రావు, వివశత్వమొదవెడు దేహంబు మరణ సందేహమునను,। లోలమై పలుక నాలుక రాదు, నోటనుడడిలేదు, లే

చినంబడుదుమరల౯। గావున, శరములు గాడియున్నవిమేన నన్నియుఁ
దివియుమాయన్న! యనిన। రాముఁడన్నియుఁదీసి కరంబులందు। దేహ
మెల్లనునివిరి చింతింపనేల?। నేను రాముఁడనన, లేచినృపునిపాద। వన
జములమీఁద నందండ్రవాలి తెలిసె॥ ౧౦౬॥

వ॥ మఱియుంబరికింపుచుఁ జనిమేడు సమయంబున॥ ౧౦౭॥

సీ॥ కొండలవలెనేలఁ గూలినమదగజ ఘనకదంబములు మేఘములు
గాఁగ। మోఁకాలిబంటితో నేకమైయూడాడఁ గనుపట్టుమెదడు పం
కంబుగాఁగ। నలుగులతాఁకున నిలఁబడు మాంసఖండములు దామింద్ర
గోపములుగాఁగ। బలువిడినెడనెడఁ బాఱెడిరక్తంబు లంబుప్లుతప్రవా
హంబుగాఁగ। వాహినులగుంపు శరములవానగాఁగ। మొనలహుంకృ
తులవియుఱుములనుగాఁగ। వర్షకాలంబుచాడ్పున వారికన్ను। గవల
కనుదోఁచె నప్పుడక్కజముగాను॥ ౧౦౮॥

ఉ॥ అంతటఁ దెల్లవాఱె, విలయాంతకు డైపడి నాశతాస్యుఁడ।
త్యంతపరాక్రమంబున మహాగ్రహుఁడౌచు రథంబుమీదని। శ్చింతగ నె
క్కి, బాణములుచేకొని, దుశ్శకునంబులట్టిచో। నంతకునంతకుం బొడ
మనందుకులోఁగక వచ్చెఁ జెచ్చెరన్॥ ౧౦౯॥

ఉ॥ సీతయువిల్లునమ్ములను జేకొని రాఘవు నాజ్ఞఁబూని, వి। ఖ్యా
తపరాక్రమంబున మహాహవదీక్ష వహించి, యాసురు। జ్జాతుభుజంబు
లన్నిలిచె; జానకిచెంతను రామచంద్రుడుం। బ్రీతిదలిర్ప నుండెను, విభీ
షణుఁడుంజనె వారిపొంతకున్॥ ౧౧౦॥

చ॥ అపుడుసమస్తలోకములు నచ్చెరువందెఁ, గృశించె దానవుం,।
డపుడుపయోనిధుల్ గలఁగె, నప్పుడు పర్వతముల్ చలించె, నా। రసము
నిమృత్యువచ్చుటఁ బరామరిసింపుచు నుండె, బ్రహ్మయుం। గుపిత మన
స్కుఁడయ్యె నదిగో! విలయంబని మాటిమాటికిన్॥ ౧౧౧॥

ఉ॥ సర్వసుపర్వులున్, సకలచారణులున్, వరకిన్నరేంద్రగం। ధ
ర్వులు, సిద్ధసాధ్యులు ముదంబున నభ్రము నుండి వారిదో। ర్గర్వము,
బాణనైపుణియు, గాఢతరప్రతిభాషలున్, దయా। ఖర్వమనస్కులై ని
లిచి కన్గొనుచుండిరి యద్భుతంబుగన్॥ ౧౧౨॥

ఉ॥ జానకి వారిఁ జూచి దనుజప్రభుఁ ద్రుంపఁ ద్రుణంబు నాకు, ని। ద్దానవనాథుతోడ వివిధస్థితిఁ బోరఁగఁ జూడఁగోరి ఖ। స్థానమునన్నిలింపులు విశాలతనల్లదె యున్నవారు, నేఁ। జూనితదీయ చిత్తములు పొంగఁగఁ బోరెదఁ జిత్రవైఖరిన్॥ ౧౧౩॥

చ॥ అసిశరసంఘమేయ, దనుజాధిపుఁ డన్ని శిలీముఖంబులం। దునియఁగ నేసి, వాయుజుని దుష్టతరాగ్రహ వృత్తిఁ జూచి, యా। వనచరుఁ జంపినన్ మనుజవల్లభుఁ డున్ సతియున్నశింతురో। య్యననిజమంచు నిష్ఠురమహాస్త్రములేర్చి శరాసనంబునన్॥ ౧౧౪॥

ఉ॥ ఇగ్గతిబాణముల్ దొడిగి యెమ్మెదలిర్పఁగ నార్చుచున్, సుధా। భుగ్గణమెల్లనద్భుతము నొందుచుఁ జూడఁగ నేసె, నేసినన్। దిగ్గున సీత చూచి నతితీవ్రశరంబుల వానినెల్లఁ దా। నగ్గలమైనకోపమున నల్లనఁ ద్రెవ్వఁగ నేసె నుగ్రతన్॥ ౧౧౫॥

ఉ॥ అందులకున్ మహాద్భుతము నందుచు శాత శిలీముఖంబులం। గ్రిందుకొనంగ జానకిని గ్రక్కున నేసిన, నెల్ల దేవతా। బృందము లుత్సహింప నతిభీషణబాణ పరంపరంబుచే। ముందుగఁ ద్రుంచెఁ దచ్ఛర సమూహములన్ రఘురాముఁ డుబ్బఁగన్॥ ౧౧౬॥

చ॥ అవియునుగాక ఘోరవిశిఖావళి వింటనమర్చి యార్చి పేర్చి, వికృతదైత్యనాయకు కిరీటములుం బటుచాపముల్ కడున్। భువిఁబడనేసి, చండతరభోగి శరంబుల వాని తేజము। గ్రవిధినణంగఁ జేసె నతిగాఢతర ప్రతిశౌర్యకోపయై॥ ౧౧౭॥

ఉ॥ చాపములుం గిరీటములుఁ జాలశరీర విశాల తేజమున్। ఏపును బోయినన్, రఘుకులేంద్రుని దేవిపయిన్ మహాహవా। టోపగదాచయంబును గడున్ వడిఁ బువ్విన, నద్దాళిను। ద్దీపితసాయకంబుల ధృతిం బొడి చేసె సురల్ నుతింపఁగన్॥ ౧౧౮॥

వ॥ మఱియు దర్పంబున॥ ౧౧౯॥

ఉ॥ అంతటిలోన సీత విలయానలకీలయపోలెనాత్మలో। నెంతయు రోషమెత్తి, దనుజేంద్రు శిరంబులు గూలఁగావుతన్। వింతగ నంచునే

సె నొక విష్ణుశరంబున, నేయ నెల్లరా। ప్రాంతములందుఁ బిక్కటిలిన గ్నిపరంపర లీనుచున్ వడిన్॥ ౧౨౦॥

చ॥ చనిశతకంధరుం దలలు చయ్యనఁ ద్రుంచి, తదీయ హస్తముల్। తునియలు చేసి వచ్చె, నటు తోడనె శేచ్ఛిరముల్ కరంబులున్। ఘనతర లీల మొల్చె, నవి గాంచి ధరాసుత వెండియున్ రయం। బున బడఁ జేసె, నప్పటికి ఘోరున మొల్చెను మస్తహస్తముల్॥ ౧౨౧॥

ఉ॥ ఎప్పుడు విల్లు బూనునొకో? యెప్పుడు నిక్కుచు నెక్కు పెట్టునో?। ఎప్పుడు తూణమందునొకో? యెప్పుడు బాణము లేర్పరించునో। యెప్పుడు ఫ్రానునో శిరము? లెప్పుడు ద్రుంచునో? యెప్పుడా తలల్। గుప్పన మొల్చునో? యనుచు గోరి సురల్ గనుచుండి రద్దివిన్॥ ౧౨౨॥

క॥ నక్తంచరలోకేంద్రుని। రక్తము సిలమీఁద టను దొరంగక యుండన్। యుక్తమగు నపుడు మాయా। శక్తి వెసం ద్రావుచుండెఁ జయ్యన నడుమన్॥ ౧౨౩॥

క॥ ఇవ్విధమునఁ బోరాడఁగ। నవ్విపులశరీరి జనకజాత్మజఁ బూడన్। మవ్వముగ నబుఁడు, రుద్రుఁడు। నవ్వుచు దివినుండి రపుడు రమణులతోడన్॥ ౧౨౪॥

ఉ॥ అప్పటికిన్ ధరాసుత రయంబున దానవనాథ మస్తముల్। గుప్పనఁ గూలనేసె, నవి గొబ్బున వెండియు మొల్చె, మొల్చినఁ। దప్పక మళ్లఁ దాఁ దునిమె, దాకొని క్రమ్మఱ మొల్చెఁ, దామఱిం। జప్పుడు గాక యుండ శితసాయకధాటినిఁ గూల్చెఁ జెచ్చెరన్॥ ౧౨౫॥

ఉ॥ ఖండలు సేయఁగా, మొలవఁగాఁ, దలకాయలు తండతండమై। కొండలరీతిఁ బ్రోవులయి కోరిచుట్టిన్ దివిసోఁకి యుమ్మహీ। మండల మెల్ల నిండిన, రమామణి జానకి చూచి యద్భుతా। ఖండవిచారనై, యపుడు కాండము లేయక మాని యాత్మలోన్॥ ౧౨౬॥

చ॥ శిరములు ద్రుంచి వేసరితిఁ జేకొని చండతరాస్త్రకోటిచేఁ। గరములు ద్రుంచి వేసరితి కాండములున్ సరిపోయె, దానవే। శ్వరుఁ డిలఁ గూలుటల్ మఱొక జాడలు చూప్పడ వేమిచోద్యమో?। వరముల సత్వమొకో? గెలువన్ వశమే మియుఁ గాదిఁ కెట్లొకో?॥ ౧౨౭॥

చ॥ అని దనుజేంద్రుఁ డేసెడి శరావళికిన్ హనుమంతువాల మొ, య్యన నరికట్టు చేసి, మనుజాధిపు రాముని బల్కరింపుచుం। దనమహిమంబు దివ్యులు ముదంబున సన్నుతి సేయుచుండఁగా। మనమునఁ జింత నొందఁగ రమామణి సీతను గాంచి యాడకున్॥ ౧౨౮॥

ఉ॥ హారవరాహిరాజ తుహినాచల తారక శైలమల్లికా। శారదనీరదస్ఫురితచందనకుందనిభప్రభాంగుఁ, డా। నారదసంయమీంద్రుఁడు మనంబునఁ బొంగుచు సీతపాలికిన్। ధీరదయార్ద్రవృత్తిఁ జను దెంచె రఘూద్వహుఁ డుత్సహింపఁగన్॥ ౧౨౯॥

ఉ॥ సీతకు, లోకమాతకు, విశేషదయారస పోషితాశ్రిత। వ్రాతకు, ధీసమేతకు, శివస్తవపూతగుణౌఘశౌర్యవి। ఖ్యాతకు, వీతభీతకు, మహాఘనుభాపరిభూతఖండ ఖ। ద్యోతకు నన్నమస్కరణమొయ్యనఁ జేయుచు డా సె, డాసినన్॥ ౧౩౦॥

ఉ॥ రాముఁడు నమ్మునీంద్రునకు రాజితబుద్ధి నమస్కరించి, మీ। రేమికతంబు నిచ్చటికి నెచ్చగు మచ్చిక నేగుదెంచి? రు। ద్దామపరాక్రమంబొదవ దైత్యుఁడు పోరఁగఁ జొచ్చె, ఘోరసం। గ్రామము మించె, నిల్వ నెడగల్గదు, యేమటు చెప్పు మొప్పగన్॥ ౧౩౧॥

చ॥ అనివిని మౌని గోప్యముగ నారఘురామునితోడ డాసి యి। ట్లనునకటా! శతాస్యుని శరావళిచే నని నెంతపోరినం। దనరఁగ నేలఁ గూలునె? వృథాశ్రమమింతియె కాక, వీనిగో। బ్బునఁ దునియింపఁగా నుపమ భోరునఁ జెప్పెదఁ జిత్తగింపుమా॥ ౧౩౨॥

గీ॥ వీనినాభిని జుట్టు రాఁబూని, యల వి। శల్యసంజీవకరణు లతుల్యముగను। గలిగియున్నవి, తద్వస్తుఘనతఁ జేసి। తలలుఁ గరములుఁ దెగియును మొలవఁ దొడఁగె॥ ౧౩౩॥

గీ॥ బలిమినటుగాన నాగ్నేయబాణమేసి। తత్తదుగ్రౌషధుల నెల్ల దగ్ధములుగఁ। జేసి, బ్రహ్మాస్త్రమున నొండె, వాసిగల్గు। శక్తి చే నొండె దైత్యుని సంహరింపు॥ ౧౩౪॥

గీ॥ నేలఁ జేర పోరంగనుండుట నేపమటంచుఁ। దలఁపకుము, సీత చేఁ

గాని దైత్యుఁడణఁగఁ డిట్టిగోప్యంబు జానకి కెఱుఁగఁ జెప్పుము భామ
చేఁ గూల మున్నుశాపంబుగలదు॥ ౧౩౫॥

సీ॥ అది యెటువలెనన్న నతిశీఘ్రవృత్తిమై నెఱిఁగింతువినుము మ
హీతలేశ! తనపరిధానులు గొల్వదైత్యేంద్రుఁడఖిలదిక్కులు గెల్వ నరి
గె నుక్కునను దొల్లి యరిగిసమస్తామరాదుల సుక్కిఱించి మరలివ
చ్చుచుఁగణ్వమౌనివనముఁ జొచ్చికలంచుచో శోధించి, యమ్మునికూరి
మిపట్టినిఁ గోరిచూచి పొలఁతిచక్కదనమున కద్భుతమునొంది మద
నచలితాంగుఁడై తాను మదినిఁగలఁగి యంతకంతకు విభ్రమాయత్తుఁ
డగుచుఁ జెలఁగి విమలాంగియనుదానిఁజేరి పలికె॥ ౧౩౬॥

సీ॥ వనటనొందఁగనేల వరసౌధములఁగల్గుతూఁగుటుయ్యెలలందు
దూఁగరాదె? కందమూలములేల కడు ఘృతప్లుతముగా మించుదేరఁ
గ భుజియించరాదె? నారచీరెలివేల సారమాణిక్యంపుఁ బట్టుపుట్టం
బులు గట్టరాదె? నేలవ్రాలఁగనేల పూలపాన్పులపయి లీలనాతోఁ
బవ్వళింపరాదె? యేల ననుఁ జూడ? వీవనంబేల? యిట్టి జోలెకాఁ
డైన తిరిపపు జోగియేల? యఖిలలోకంబులకుఁ బతినైననన్నుఁ గదిసి
వర్తింపఁ జెల్లదే? కమలనయన!॥ ౧౩౭॥

సీ॥ అనవిని విమలాంగి యడలుచు, నోరిదైత్యాధమ! యిట్టివాక్య
ములుదగునె? పరసతీజనములఁ బరధనంబులకుఁ దానాశించువానికి
నాయువణఁగు, గురుధర్మహానియై నరకంబుసిద్ధించుఁ, జేసినపుణ్య
ముల్ చెడుఁ, దలంప మాతండ్రికణ్వుఁ డీమాటలువినెనేని కదిసిటుభ
స్మంబుగాశపించు! నోరి! కావరమునఁ బరనారిఁజెనకి మడిసిపోయి
న కుజనులమాటవినవె? పొమ్ముపొమ్మింటి కిందు హతమ్ముగాక తరుణి
తోనేల యిట్టిమదంబు కుమతి!॥ ౧౩౮॥

వ॥ అని మఱియుం జతురోపాయంబుల ధర్మంబు దెలిపియు, మ
ర్మంబుగలంచియు, వెఱపించియు, పాటిగాదనియుంజెప్పి యతనితమ
కంబునకు భయంబంది నలుదిక్కులు బరికింపుచునుండ నుద్దండుండగు
శతముఖుండుగదిసి, సకలైశ్వర్యహీనుండగు నొకపేదతపసిం జెప్పి

వెఱపించినం దలంకుదునే? యని మదనకదనమునకు నోదవిన తహతహన్ బలిమిమైఁ బైఁబడి పెనంగ, శతముఖుంబులఁ జుంబనంబులు గావించి యత్యంత ప్రియాసంబుగాఁ గూడిన, నదిసద్యోగర్భమై బాలకుంగని యమ్మహాదనుజుని దేహంబు తనపయింబడుటం జేసి తద్భరంబున శరీరంబు విడిచె; తదనంతరం బాకణ్వుండును సమిధల నిమిత్తంబున నరణ్యంబునకుఁ జనినవాఁడై తనపట్టియొంటినున్నదని రయంబునవచ్చి, యచ్చోట విహరింపుచున్న శతముఖునిం గని భయంబునొంది పర్ణశాలకరుదెంచి, అందుశిశువాపురని యేడ్వంగనుం గొని, యవ్వల శవంబై పడియున్న కన్య నవలోకించి శోకింపుచు దనతపోమహత్త్వంబున నంతయుం దెలిసి, కోపంబున శతకంఠునిం జేరి, ఓరీ! యిట్లు దుర్మదంబున నరుదెంచి నా పెంపుడుకూఁతు నిత్తెఱంగున మానభంగంబు గావించి, ప్రాణంబులుం గొనియున్నవాఁడవు గాననింతి చేసినట్లు సీతలలు తునియత్తై మరణంబు నొందఁ గలవని శపించె; అంతశతముఖుండు నేడ చేడియలని తనపురంబునకరిగె: అదియునుంగాక పరమేష్ఠినివరంబులు వేఁడునప్పుడు స్త్రీలచేతఁ జావులేకుండ నడుగఁడయ్యె; ఇప్పుడు తచ్ఛాపం బనుకూలంబయ్యెఁ గావున నాదిపరంజ్యోతి యగు జానకిచే నవశ్యంబును గూలు; ఆలంబునకు నీదేవిం బురిగొల్పుమని హితోపదేశంబు చేసియంతర్ధానంబునొందె; రామచంద్రుండును బరమాశ్చర్యచిత్తుండై సీతకుఁ దద్వృత్తాంతంబంతయు నెఱింగించి, యింక జాగుసేయక దనుజునిఁ బరిమార్పుమని పురికొల్పిననలరి, భేరీమృదంగతూర్యాది నానావిధంబులగు వాద్యంబులు వినోదంబులుగా నఖిలభువనంబులును నిండ నుద్దండ ప్రచండ భుజాదండంబునఁ గోదండంబంది, యనలకల్ప కాండపరంపరలేర్చి, హయంబులం గూల్చి, సారథిని వ్రాల్చి, కేతనంబులు పొడిచేసి, చక్రంబులు విక్రమంబున ఖండించి, పలకలలు కమై వ్రక్కలుగావించి మఱియును॥ ౧౩౯॥

చ॥ బలువిడిఁ గర్కశక్రకచ భల్లశతంబరివోసి, వానిచే। తులఁ దలలున్ ధరాస్థలిని దోడనెగూల్చి, శరీరమెల్ల వ్రక్కలుగనొనర్చియార్చినను, గర్వముదూలివశంబుగాక చం। చలమానసున్నఁ గాంచి, యల

జానకి యుగ్రత మిన్ను ముట్టుచున్॥ ౧౪౦॥

వ॥ అనలాస్త్రంబరివోసి యేసె, నదిహాహాకార మొప్పంగఁజ। య్యనజీవంబులు సంహరింపుచు మహాశ్చర్యంబు గా వానినా। భిసిఁ దా ముందు మహాషధీలతలు నాఖిలంబుగాఁ గాల్చి గో। బ్బున భస్మంబుగఁ జేసివచ్చెను సురల్ భూషింపఁగాఁ జెచ్చెరన్॥ ౧౪౧॥

శా॥ బ్రహ్మాస్త్రంబరివోసి దిక్కటములఁభ్రింబున్ వెసన్నిండఁగన్,। బ్రహ్మాండంబువణంక, నద్రులుచలింపం, గావిరుల్ మీఱ, నా। బ్రహ్మాద్రులు దల్లడిల్ల, శివుఁ। డోపంజాలనంచుం బరబ్రహ్మాంబున్ వినుతింప, సీత బలశుంభద్వృత్తిమైనార్చుచున్॥ ౧౪౨॥

గీ॥ అవనిపైనే పతివ్రతనైతినేని,। యరయ రాముండు ధర్మాత్ముఁడయ్యేనేని,। వేదములుసత్యమగునేని, వీఁడునిమ్మ। హాస్త్రమున దగ్ధుఁడగుఁగాకయనుచు నేసె॥ ౧౪౩॥

గీ॥ అప్పుడాదివ్యసాయక మతిరయమునఁ। జిచ్చులీనుచుఁజని, వానిచేతులెల్ల। ద్రుంచి,యొకతల చిక్కఁదుందుడుకు మెఱసి। కడమతలలెల్లఁ దృణలీలఁ బుడమిఁగూల్చె॥ ౧౪౪॥

చ॥ మఱియును శక్తివైవ నదిమండుచుశీఘ్రతనేగి, దేహము। బ్బరముగఁజించి, యున్నతల భోరునఁ గూల్చినఁద్రుంగి, యమ్మహా। సురవరుఁ డుగ్రవజ్రమునఁ జోద్యముగాఁబడు కొండవోలె ని। ద్ధరఁబడెఁ,దద్భరంబునకుఁ దల్లడమందె ఫణీంద్రుఁడత్తఱిన్॥ ౧౪౫॥

సీ॥ అప్పుడుగురియించి రమరులుకుసుమంబు, లప్పుడువిమలంబులయ్యెదిశలు,। నప్పుడు తగనాడి రప్సరాంగనలెల్ల, నప్పుడు రవిచంద్రులలరుచుండి,। రప్పుడుచేసె సింహధ్వానమాసీత, యప్పుడురాముండు హర్ష మొందె,। నప్పుడు నారదాద్యఖిలతాపసులును జనుదెంచి రచటికిసంభ్రమముల,। జానకీదేవియును రామచరణములకు। నొరఁగ, నొరఁగిననకుటిన నొనరఁజేర్చి। నీకతంబున వైరంబు నేఁడువాసెఁ,। గటిఁ గీర్తులటంచు నకుఁడఁజెలంగె॥ ౧౪౬॥

ఉ॥ శంకలు మాని యబ్జజుఁడు జానకిపాలికి నేగుదెంచుచోఁ।

బొంకనుగానుతింౘి. మఱిభోరున నొక్కవరంబువేఁడుమో। పంకజ నేత్ర! యన్నఁ,దనభర్తయనుజ్ఞను జేసి వారితో। నుంతువమీఱనిట్లనిమె నుల్లముననే ముదమందుచున్ వెసన్॥ ౧౪౭॥

క॥ మాకొఱకు నఖిలనృపతులు। దాకొని సైన్యములువచ్చి దైత్యుని చేతం। బ్రాకటముగఁబడి రిటు, మీ। రేకంబుగ వారినెల్ల నిండు ముదమునన్॥ ౧౪౮॥

ఉ॥ వారలనిచ్చి వెండియును వారిజనేత్రనుఁ గోరుమన్న గం। భీరతఁబొంగి,వానరవిభీషణసైనికులన్,సుఱందులన్,। వారకపుత్రపౌత్రులను వైళమునన్ బ్రతికింపుఁడంచు వి। స్తారమృదూక్తి వేఁడినను జయ్యనని చ్చిరి దేవసంఘముల్॥ ౧౪౯॥

చ॥ సకలధరాధినాథులును, సైన్యములున్,భరతాదిసోదరుల్,। సకలకుమారకుల్, దనుజసంఘములున్ మహోజ్జ్వల। ప్రకటశరీరులై మనిన, బాగుగ దేవతలెల్ల వారిపై। సుకరముగాఁ గురించి రతిచోద్యముగా నమృతంపు వర్షముల్॥ ౧౫౦॥

గీ॥ అంతహతశేషులైన వారాశతాస్యు। మరణమెఱిఁగింప మూర్ఛిల్లిమహిని(వాలి। తెలిసియాచిత్రగంధి యొత్తిలి విలాప। మొదవఁగోడండ్రు తనవెంట నొఱలవెడలి॥ ౧౫౧॥

గీ॥ కదనమంతయుఁ జూచుచుఁగదలివచ్చి। తలలుదివిసోఁకఁగాఁబడి వెలయుకొండ। వలెనుగూలిన తనయు, నవార్యలోక। కంటకుండైన యాశతకంఠుఁగనియె॥ ౧౫౨॥

వ॥ కని యనేకప్రకారంబులఁ గోడండ్రును దానును నతనిపయిం బడి మోదుకొనుచు, నేలలుదడువుచుఁ, దమకుదక్కియనుచు, సీతను దూఱుచు, బాష్పంబులురాల్చుచు విలపించిమఱియును బుత్రశోకంబును దరింపఁజాలక ఱొమ్మును శిరంబును మోదుకొనుచుఁ జిత్రగంధి యుట్లనియె॥ ౧౫౩॥

సీ॥ సురవర్గములనెల్లఁ జెఱలువట్టిన నీమహాజ్ఞ దానెచ్చటననఁగాఁ దండ్రి?। దిక్కరిఘటముల వ్రక్కలుగావించునీభుజాబలము యేనీటఁగల

సెః! మొగమెత్తి కనుఁగొని ముక్కంటినైనను వెఱపించులావునే వీటఁబో
వెః! నీతపంబునకు విధాత్రుఁ డిచ్చినయట్టి వరములమహిమ యేవఱ
దఁగలసెః! వెలయ రాఘవుఁడాదిమ విష్ణుఁడంటి! సుదతిజానకి యాప్పరం
జ్యోతియంటిఁ,! గపులు సురలంటి, జయములు గలుగవంటి,! నకట!వి
ననేరవైతి వేమందుఁ? దనయ!॥ ౧౫౪॥

గీ॥ రాఘవునిజంపి జానకీరమణికీవు! తలఁతువెప్పుడు మదిని వైధవ్య
మొదవ! నది మృషావాదమై, నీనిజాంగనలకు! నహహా! వైధవ్యమొద
వె నటంచు మఱియు॥ ౧౫౫॥

ఉ॥ రాయనుఁ, బోకుమంటిఁ గద రాయను, నిన్నిఁకఁ బాసియోర్వ
లే! రాయను, హాశతద్వయకరాయను, మమ్మిటు బాధపెట్టితే! రాయ
ను, నీతనూజుఁగన రాయను, నెక్కడఁ గందు రాకుమా! రాయను, న
ల్లనేలవిన రాయను, హాశతకంధరాయనున్॥ ౧౫౬॥

ఉ॥ మాయను మోసపెట్టితివి మాయురె! నీకిది ధర్మమానె రా!
మాయను, నయ్యొ నాదు ఫలమాయను, దానవలోక సార్వభౌ! మా
యను, డాయవింత చలమాయను, నేటికిఁ జేసితింత భౌ! మాయను,
దుర్లభంబులనుమాయను, బాపురె! దైవమా! యనున్॥ ౧౫౭॥

గీ॥ అనుచు నొఁఱలంగ వారల ననునయించి! రాముఁడిట్లనె నేలవి
లాపమొందఁ? నాహవంబున నెచట జయాపజయము! లందఱకుఁగల,
విహము నిత్యంబు గాదు॥ ౧౫౮॥

గీ॥ ఎవ్వఁడనిలోన నాతోడ నిట్లుపోరెః! నెవ్వఁడనిలోన మాచేత
నిట్లుగూలెఁ! జెల్లునితనికి రణమున విల్లుపూని! నరయ నెన్నిటనైనఁ గృ
తార్థుఁడితఁడు॥ ౧౫౯॥

గీ॥ అనివిభీషణుఁబంపించి యగ్నివిధులు! సలుపనియమించి, తీరిన
సమయమందు! నాశతాస్యుని తనయు, మహాగుణాఢ్యు,! నీలకేతనుఁ
డనువాని నృపుఁడుకృపను॥ ౧౬౦॥

గీ॥ డంబుగానప్పురికిని బట్టంబు గట్టి! పెక్కుభంగుల దీవించి ప్రే

మనిగుడ| రమణ నగణితతూర్య నాదములు మ్రోయ| క్షితివరుండరు
దెంచె దేవతలకడకు॥ ౧౬౧॥

చ॥ సురలును, మౌనులున్, నృపులు శోభిల దీవనలిచ్చి మెచ్చుచో|
నరిగిరి; రాముఁడుంబటురయంబున మారుతిఁజూచి, క్రమ్మఱన్| శరధు
లుదాఁటఁజేయుమని చయ్యన వేఁడిన, వాయుజుండుఁజె| చ్చెరఁదనతోఁ
కపైనడపె సేనలనందఱ నొక్కపెట్టునన్॥ ౧౬౨॥

ఉ॥ తమ్ములుఁదానుసీతయును దానవమానవ వానరాళియున్| స
మ్మదలీలనశ్వములఁ జారుమదేభ రథాదులింపుమైఁ| గ్రమ్ముకొనంగ నే
కీఁ, శతకంఠుమహోగ్రకథాప్రకారముల్| పేర్మిగ నుగ్గడింపుచు, వి
భీషణభానుజు లుత్సహింపఁగన్॥ ౧౬౩॥

ఉ॥ మానవనాయకుండును క్రమంబున సేనలఁగొల్వఁ దానయో|
ధ్యానగరంబుఁజేరి, తనతల్లులఁ గాంచి నమస్కరించి, య| జ్జానకిచే
యుపౌరుషము సర్వముఁజెప్పి సుమంతమంత్రులౌ| నాననిసన్నుతింప,
ముదమార విభీషణుఁ బిల్చియిట్లనున్॥ ౧౬౪॥

చ॥ పెనఁగితి వాలమందునను బెక్కువిధంబులఁ, జాలఁ జాలనా|
మనసునవచ్చెనీదు మహిమా విజయంబులటంచు మెచ్చి, స| త్కనకవి
భూషణాంబరనికాయ మొసంగి ముదంబుమీఱనం| పినఁ, దనసేనతో
డుత విభీషణుఁడుంజనె నంతనత్తఱిన్॥ ౧౬౫॥

చ॥ రవితనయాంగదాదులను రమ్మనికౌఁగిటఁజేర్చి, మీకృపా| ప్ర
విమలదృష్టిచేసి నగుబాటుఘటింపకయుండ దైత్యునిన్| భువి నడఁగిం
పఁగాఁగలిగె ఘోరుననంచు, నమూల్యవస్తువుల్| సవినయ వృత్తిమైనొ
సఁగి చయ్యనఁబంపె దయామనస్కుఁడై॥ ౧౬౬॥

చ॥ సకలధరాధినాథులను సంభ్రమ మొప్పఁగఁబిల్చి, సూనృత|
ప్రకటతరోక్తులన్ వివిధభంగుల నాదరణంబుచేసి, వా| రకసెలవిచ్చి
న న్నృపులు రామునకుం దగ మ్రొక్కి తాముద| స్వకబలమెల్లఁ గొల్వఁ
గ నపారరణక్రియ లుగ్గడింపుచున్॥ ౧౬౭॥

చ॥ పిదపమరుత్సుతున్, సమరభీషణు, నీతిగుణౌఘభూషణున్,। స దమలభూషణుం బిలచి, సారెకుఁ గౌఁగిటఁ జేర్చి, ప్రీతి దు। ష్కరదనధురీణ! శత్రుమదఖండన! నీసుహిమంబుచేఁ జుమీ। యదవద వాసి దైత్యుని శరావలిచే నణఁగించి మించుటల్॥ ౧౮౮॥

ఉ॥ నీమదిలోనికోరికలు నిక్కము మెఱుంగుదు, నెన్నిభంగులన్। నేను ముగానొనర్తునది నేనిఁక నమ్ముమటంచు సీతయున్। రాముఁడునిచ్చెఁగోరుకలపరంపరలున్, మణిభూషణంబులున్;। వేమఱువాయుజుండు సువివేకముమీఱఁగ మ్రొక్కి గైకొనన్॥ ౧౮౯॥

చ॥ మనుజవరేణ్యుచేతఁ బలుమాఱును దీవన లంది గంధమా। దనమునకేగె; రాముఁడును దమ్ములు మంత్రులు బంధుమిత్రులున్। ఘనముగనుత్సహింప నతిగౌరవమొప్పఁగ రాజ్యభారమో। య్యనవెసఁ దీర్పుచుండెఁ గరుణాయుతసాంద్రమనస్కుఁడై తగన్॥ ౧౯౦॥

ఉ॥ ఎవ్వరు నీకథంజదివి యిమ్ముగ వ్రాతురు, ధర్మబుద్ధిమై। నెవ్వరు విందు, రట్టిసువివేకులకున్ రఘునాథుఁడిచ్చునా। మవ్వపు భోగభాగ్యములు, మానితసౌఖ్యము లిష్టసంపదల్,। నివ్వటిలంబ్రియంబులును, నీరజసంభవ సన్నిభాయువుల్॥ ౧౯౧॥

వ॥ అని యివ్విధంబున శంకరుం డెఱింగించిన శాంకరీదేవి మహాద్భుతంబు నొంది మహాత్మా! యిట్టిచమత్కార కథావిధానం బెన్నండును విని యెఱుంగము; నేఁడు శ్రవణానందంబుగా వినఁగలిగెఁ గృతార్థురాలనైతినని యానందింపుచుండెనంత॥ ౧౯౨॥

ఉ॥ శ్రీరమణీయ వైభవ! విశేషగుణాకర! దీనలోకమం। దార! గభీర! ధీర! సముదార! సుకీర్తి విహార! శత్రుసం। హార! యఘప్రహార! సదయానుశరీర! సుధాకరప్రభా। కార! లసద్విచార! జయకారణ! పోచమరెడ్డిభూవరా!॥ ౧౯౩॥

మాలిని॥ పరివిమల గుణహారా! బంధురాఘౌఘదూరా!। వివిధశుభవిచారా! విశ్రుతాచార! ధీరా!। కవిజలరుహసూరా! గర్వదుర్వారదూరా!। భువనహితశరీరా! పోచమశ్రీవిహారా!॥ ౧౯౪॥

గద్య॥ ఇది శ్రీమదేయకూర్తి నివాస, లక్ష్మీనృసింహ కరుణాకటాక్షప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణ, సుమహితాంధ్రగీర్వాణ ప్రవీణ, సంగీతలక్షణధురీణ, సకలవిద్వన్మిత్ర, తెగ్రుస గోత్ర, ధర్మనార్యపుత్ర, నిఖిల మహీసురాశీర్వాద ప్రవర్ధమాన ధేయ, సకలనృపవిధేయ, వినయవిధేయ, మర్దననామధేయ ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబునందు శతకంఠునకుఁ జిత్రగంధిస్వప్నంబు సెప్పుటయు, అతండు తనతల్లిబుద్ధి వినక రణంబునకరుగుటయు, సకలకపిప్రళయంబును, భరతశత్రుఘ్నాది హతంబును. రాముకోపంబును, కలహమహిమంబును, రాముసరు శక్యంబుగాక చింతించుటయు, సీత గడంగుటయు, అయ్యమ్మవలన దనుజుండు స్రుక్కుటయు, నారదాగమనంబును, హితోపదేశంబును, బ్రహ్మాస్త్రప్రయోగంబును, శతముఖుని మరణంబును, చిత్రగంధి విలాపంబును, నీలకేతనుపట్టాభిషేకంబును, తమ్ములుం దనయులు సైన్యంబులుఁ బునర్జీవులగుటయు, హనుమంతుండు మరల జలధులు దాఁటించుటయు, పురంబుచేరుటయు, విభీషణ సుగ్రీవ హనుమత్ప్రభృతులు దమతమ భూములకుం జనుటయు రాజ్యంబు పాలించుటయు నన్నది సర్వంబును

చతుర్థాశ్వాసము సంపూర్ణము.

# విక్రయింపబడుపుస్తకములు.

| | | |
|---|---|---|
| మునిభావబోధిని. | (సకలశాస్త్రసంగ్రహము) ... | ౧-౮-౦ |
| సాముద్రికశాస్త్రము. | ... ... | ౦-౫-౦ |
| ఫలప్రదర్శిని. | (జ్యోతిషము) ... ... | ౦-౮-౦ |
| భగవద్గీతాద్విపద కావ్యము. | ... ... | ౦-౪-౦ |
| విచిత్రరామాయణము. | ... ... ... | ౦-౬-౦ |
| శతకంఠరామాయణమను సీతావిజయము. | ... | ౧-౪-౦ |
| సత్యనారాయణ వ్రతకల్పము. | ... ... | ౦-౧-౬ |
| సారంగధరచరిత్ర. | (శారదరామాయణపువరస) ... | ౦-౨-౬ |
| గజేంద్రమోక్షము. | డిటో ... ... | ౦-౧-౬ |
| గజేంద్రమోక్షదండకము. | ... ... | ౦-౧-౬ |
| భల్లాణదండకము. | ... ... ... | ౦-౧-౬ |
| శ్రీరామదండకము. | (ప్రాచీనము) ... | ౦-౧-౦ |
| వరాలహక్ష్మీనరసింహాశతకము. | ... ... | ౦-౧-౬ |
| గణికాహితబోధిని. | ... ... ... | ౦-౧౧-౦ |
| భద్రాద్రియుశ్చరిత్ర | (పాట) ... ... | ౦-౧-౦ |
| ప్రదోషకాలపూజామహిమ. | (పాట) ... | ౦-౧-౦ |
| సోమవారవ్రతప్రభావము. | (పాట) ... | ౦-౧-౦ |
| శ్రీరామలీలలు. | (యక్షగానము) ... | ౦-౨-౦ |
| గౌరీశంకరవిలాసము. | డిటో ... ... | ౦-౨-౦ |
| కమలినీకలహంసనాటిక. | ... ... | ౦-౨-౬ |
| జంత్రి—అనగా ౧౮౫౧ సంవత్సరం లగాయతు ౧౯౦౨ సంవత్సరమువరకు తెనుగుతారీఖులకు సరియైనయింగిలీషుతారీఖులను తెలియజేయునది. | ... | ౧-౬-౦ |
| దైవజ్ఞయశోవిభూషణము. | (జ్యోతిషము) ... | ౦-౮-౦ |
| ఆహారవస్తుగుణప్రదర్శిని. | ... ... | ౦-౪-౦ |
| భాస్కరవిలాసము. | ... ... ... | ౦-౪-౦ |
| రామకృష్ణోపాఖ్యానము. | (ద్వ్యర్థి కావ్యము) ... | ౧-౨-౦ |
| ఆంధ్రపరీక్షాసాధనసంగ్రహము. | ... ... | ౦-౨-౬ |

| | | |
|---|---|---|
| ప్రియదర్శని. (నాటిక) | ... ... | ౦-౨-౬ |
| నరసింహవ్యాకరణము. | ... ... ... | ౦-౪-౦ |
| అద్వైతతత్వసిద్ధాంతదీపిక. (వేదాంతగ్రంథము) | ... | ౦-౨-౬ |
| లోకనాథశతకము. | ... ... ... | ౦-౧-౬ |
| జానకీరామశతకము. | ... ... ... | ౦-౧-౬ |
| హూణకళాప్రభావతారావళి | ... ... | ౦-౧-౦ |
| మద్యపానమారణము. | ... ... ... | ౦-౧-౦ |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము. | ... ... | ౦-౪-౦ |
| పద్మనాభక్షేత్రమాహాత్మ్యము. | ... ... | ౦-౨-౦ |
| విరాటపర్వము. (పదము) | ... ... | ౦-౪-౬ |
| నలచరిత్ర. (పదము) | ... ... | ౦-౫-౦ |
| శల్యపర్వము. (పదము) | } అచ్చులోనున్నవి. | ౦-౪-౬ |
| నరకాసురవిజయము. (పదము) | } | ౦-౪-౬ |
| ప్రతాపరుద్రుని పేరుగల యొకరాజుకథ. | ... | ౦-౧-౦ |
| ఉపనయనప్రయోగము. | ... ... ... | ౦-౪-౦ |
| ఇండియన్ పీనల్ కోడ్. | ... ... ... | ౧-౮-౦ |
| రెంటులా. | ... ... ... | ౧-౮-౦ |
| గ్రామమునసబులఆక్టు. | ... ... ... | ౦-౮-౦ |
| గ్రామాధ్యక్షువ్యవహారప్రదర్శిని | ... ... | ౦-౮-౦ |
| వకీల్సుహేండుబుక్కు. | ... ... ... | ౦-౧౦-౦ |
| ప్లీడర్సుహేండుబుక్కు. | ... ... ... | ౧-౦-౦ |
| దేవస్థానములఆక్టు. | ... ... ... | ౦-౮-౦ |
| ఇండియన్ కంట్రాక్టుఆక్టు. | ... ... | ౦-౮-౦ |
| విజన్సీకోడ్డు. | ... ... ... | ౧-౮-౦ |
| గురుస్వాములవారితీర్పు. | ... ... | ౦-౪-౦ |

ఈఖరీదులలో పోస్టేజీకూడ చేరియున్నది.

వ్యాల్యూపేబిల్ గా తెప్పించుకొను నెడల పదిరూపాయిలకు లోపుగా యెంతమొత్తమునకైనను రెండుఅణాలు జాస్తీ అగును.

వలయువారు విశాఖపట్టణమందున్న శ్రీశారదాముకుటముద్రాక్షరశాల ప్రొప్రయిటరుగారి పేర వ్రాసి తెప్పించుకొనవలెను.